

# మహాంధ్రానర్ఘరాఘవము


భువనగిరి విజయరామయ్య, బి. ఏ.,

ప్రతిభారవి, ఉభయకవిమిత్రుఁడు. Etc.

6/17 బ్రాడీపేట, గుంటూరు - 2.

—: ఈ నాటకమునందలి పురుషులు :-

దశరథుండు — కథానాయకుని తండ్రి
రామభద్రుండు — కథానాయకుడు
లక్ష్మణుడు
భరతుడు } రాముని తమ్ములు
జనకుండు — కథానాయిక తండ్రి
వశిష్ఠుడు
వామదేవుడు } ఇక్ష్వాకుల పురోహితులు
శతానందుండు . జనక పురోహితుడు
విశ్వామిత్రుండు ఒక బ్రహ్మర్షి
శునశ్శేపుడు
పశుపాలుండు } విశ్వామిత్రి శిష్యు
పరశురాముండు — జమదగ్ని కొడుకు
వాలి — వానరరాజు
సుగ్రీవుడు — వాలి తమ్ముండు
జాంబవంతుడు — వాలి మంత్రి
గుహుండు — పడవలరేడు
జటాయువు — పక్షిరాజు
రావణుండు — రాక్షసరాజు
విభీషణుండు — రావణుని తమ్ముడు
మాల్యవంతుడు — రావణుని మంత్రి
శుకుండు
సారణుండు } రావణ వేగులవారు
శౌష్కలుండు — రావణ పురోహితుండు
కంచుకి — జనకాంతఃపుర పాలకుడు
హేమాంగదుడు
రత్నచూడుడు } గంధర్వులు
ద్వారికుడు - ప్రతీహారి

స్త్రీలు
సీత — కథానాయిక
కలహంసిక — సీత చెలికత్తె
శ్రీమణి — శబరవనిత
శూర్పణఖ రావణు చెల్లెలు

శ్రీ శివాయ గురవేనమః

# శ్రీ మదనర్ఘ రాఘవ ప్రశంస

సీ॥ సద్యస్స్ఫురణయుఁ, బ్రసాదసౌమ్యతయును
భావనిర్మలత, యన్వయము క్రమముఁ
దాత్పర్యగరిమ. పదప్రయోజనమును
వ్యంగ్యప్రధానత, పాకశుద్ధి,
ప్రక్రమాభంగత, ప్రకృతి సాక్షాత్కృతి,
రసపరస్పరగుణ రమ్యతయును,
ఆపాతమధురిమ, ఔచిత్యమును, హాయి,
యాకాంక్ష, జీవకలాదికమును,
గీ॥ గలిగి భువనంబులటు వ్యాప్తినెలసి గిరుల
వలెను సుస్థిరభావమ్ము నొలసి యెసఁగు
"భువనగిరి" వంశవార్నిధి పూర్ణచంద్ర
"విజయరామ" కవిత్వంబు వెలయుఁగాఁత !

ఇట్లు
చల్లా పిచ్చయ్యశాస్త్రి
శతావధాని

11—6—49

శ్రీ మేధాదక్షిణామూర్తయేనమః

# ఆంధ్రీకృతానర్ఘరాఘవము - పీఠిక

"కవి" యన నెట్టివాఁడు ? పండితుఁ డని శ్రుతి బోధించును. "కందమల్లిన నేకవి" యనిచాటూక్తి. గణబద్ధముగా నేమాత్రము కూర్చినను "కవి"బిరుదమును జేర్చికొనుటకలదు. అరసినకొలఁదిని, "శుచి, ర్దక్ష, శ్శాన్త, స్సుజనవినుత, స్సుశ్రుతరసః, కలావేదీ, విద్వాన్. కల మృదుపదః, కావ్యరచనః,కృతజ్ఞో, దైవజ్ఞ, స్సదయహృదయ,స్సత్కుల భవ, శ్శుభాచార,శ్ఛందోగుణగణవివేక, స్స హి కవిః॥" అన్నట్లాయా యిలక్షణములు గలవాఁడే "కవి" శబ్దవాచ్యుఁ డని తెలియనౌను.

"కవే రిదం కావ్య"మ్మనికదా. "చతుర్వర్గఫలప్రాప్తి స్సుఖా దల్పధియామపి, కావ్యాదేవ"యని దర్పణపరిదర్శితమాచున్నది" ప్రవృత్తిర్వా నివృత్తిర్వా నిత్యేన కృతకేనవా పుంసాం యే నోపదిశ్యేత తచ్ఛాస్త్ర మభిధీయతే" యన్నట్లు వ్యంజనావృత్తిచే నుపదేశించుటవలనఁ గావ్యములందుఁ గాన్తాసమ్మితత్వ మెంచఁబడినది వ్యంగ్యజీవితము లౌనాకృతులకు "సుగుణాలంకృతీ కావ్య"మ్మనుటలో సమవాయరూప ముగా నయ్యవి రసోపస్కారము లౌనని తేలును.

ఇట్టివి శ్రవ్యములు దృశ్యములునని ద్వివిధము లిం దభినయముచే వస్తువును రూపించురూపకములవలనఁ"జిత్రతురగన్యాయము"న ద్రష్టల హృదయములందు సుకరముగా "రతి హాసము, శోకము, క్రోధము, నుత్సాహము, భయము, జుగుప్స, విస్మయము, శమము" ననుస్థాయి భావము లుదయించుటయు నప్పటిసాత్వికాంతఃకరణవృత్తి యానంద రూపమునొందఁగా "శృంగార, హాస్య, కరుణ, రౌద్ర, వీర, భయానక, భీభ, త్సాద్భుత, శాన్త, రసాభివ్యక్తి యొదవుటయు సంఘటించును. తత్తద్రసోదయభాసుర కవితావైభవము "దోషరహితగుణాలంకార యుక్తశబ్దార్థజన్య"మని ముమ్మటుఁడును, "రమణీయార్థకశబ్దః కావ్య" మని జగన్నాథుండు నెంచ, విశ్వనాథపండితుఁడు, "వాక్యం రసాత్మకం కావ్య" మ్మనెను.

ఇంకఁ బాశ్చాత్యవిమర్శకులందు, హడ్సను (Hudson) కవిత యన నెట్టిదనఁగా కల్పనలద్వారమున మనోవేగముతో జీవితవ్యాఖ్య యొనర్పఁజాలునదె యనియెంచ, ఎమర్సను (Emmerson) కల్పనా మహిమకన్నఁ బ్రకృతివిషయములను గ్రహించి వాని యాంతర్యమును దెలియఁజెప్పసమర్థమాన దేయనినిర్వచించె. మఱి బ్రాడ్లే (Braudely) "మానవచక్షుర్మాత్రగమ్యములు కానిప్రకృత్యంతర్లీనవిషయములను విభావనామహిమచే గ్రహించి లోకుల కది సుబోధము కాఁదగున ట్లభి వర్ణింపఁగల్గున దే కవిత్వ మనిపించుకొను నని నిరూపింపఁగా ననన్య సామాన్యశేముషీవిశేషుం డౌ షేక్స్పియరు (Shakespear) మహాకవి యును "కవికల్పన మజ్ఞాతవస్తుజాతమునకు రూపకల్పన మొనర్పఁజా లెడి" ననెను. ఏమైన. వర్డ్సువర్తు (Wordsworth) ప్రభృతు లెంచిన భావప్రాధాన్య మెవరైనఁ బాటింపవలసినదే. కల్పనము తదభివ్యక్తి సాధనము కాఁగలుగును. దాన నొదవిన యోజకకాంతిసౌకుమార్యా ర్థవ్యక్తిస్ఫురణాదికములవలన మానవుని మానసికప్రవృత్తి మేల్కొల్పఁ బడినప్పుడు స్వార్థ ముడిగి లోకకళ్యాణాభినివిష్టత రూపొందుచుండును.

అట్టి నాటకము లాయాభాషలలో నప్పుడప్పు డేర్పడిన రంగస్థల ముల కెక్కఁగలుగుటయో పండితపామరహృదయంగమములై తత్ప్రద ర్శనాగ్రనర్తనావర్తనము లందుచుంటయో సంఘటించుచుండును. గీర్వా ణామం దిట్టివి వెలయించినవారిలోఁ బ్రముఖమార్గదర్శి యనఁదగు శ్రీ భాసమహాకవి తరువాత, "పురా కవీనాం గణనాప్రసంగే కనిష్ఠికాధిష్ఠిత కాళిదాసః అద్యాపి తత్తుల్యకవే రభావా దనామికా సార్థవతీ బభూవ" యన విఖ్యాతుండౌ శ్రీకాళిదాసకవిశేఖరుఁడు నాతని "యభిజ్ఞానశా కుంత"లాదికములు నటుండ "ఉత్తరే రామచరితే భవభూతి ర్విశిష్యతే" యనఁ బేర్కొంగాంచిన యమ్మహాకవి "పదవాక్యప్రమాణజ్ఞత" నుగూడఁ దలఁదన్ని నన్న వన్నెఁ గన్నమిన్న "మౌద్గల్య" సగోత్రోత్పన్న "భట్ట మురారి" విజ్ఞేయుం డొక్కరుండు వెలసెను.

ఈతని దేశకాలాదికములు సువ్యక్తములు కాకయున్నవి. గోదావరీభీమేశ్వరవర్ణనాదికములనుబట్టి తత్ప్రాంతీయుఁ డనియూహ

మఱి, యీనాటకము సముద్రతీరమందలి (జగన్నాథములోని) పురుషోత్తమభగవానుని రథయాత్రకై చేరినవారియెదుట నాడఁబడుట ప్రస్తావనాంతర్గతమగుట నెన్నఁదగియున్నది. 12 వ శతాబ్ది కీవలది కాని "కవీంద్రవచనసముచ్చయ" మందుదాహృతములైనయీతనిశ్లోకములనుబట్టి తత్పూర్వుఁడనియు, భల్లటవాచస్పతిమిశ్రాదులకు సమకాలికుఁడగుచో నవమశతాబ్దిలోనివాఁడే కానువచ్చుననియు నెంచుచున్నారు. నిజకులగోత్రవివరణము దానే యొనర్చియుంట మహాకవియా వర్ధమానుని సూనుండనియు తంతుమతీగర్భశుక్తిముక్తాయమానుండనియుఁ దెలియఁగలము. ఆతఁడేమేమిపల్కినను "అసత్కీర్తనకాన్తారపరివర్తనపాంసులాం వాచం శౌరికథాలాపగంగయైవ పునీమహే।" యన్నచందాన నున్నపరమపవిత్రశ్రీరామచంద్రచరిత్రప్రతిపాదకంబయిన "అనర్ఘరాఘ" వాభిదాననాటకప్రబంధంబే మనకు లభించినది. "అలంకారకౌస్తుభ" 'కువలయానం' దాదులందు నుదాహృతములైన 'దేవీంవాచముపాసతే' మున్నగు నెన్ని యోశ్లోకములు గ్రంథస్థములుగా మన కగపడమిని దత్కర్తృకము లింక నున్నవనిమాత్ర మూహింపఁగలుగుదుము. "సౌరభ్యనిర్భరగభీరమనోహరంబు"లై వాల్మీకివాగమృతకూపనిపానలక్ష్మీవిలసితము"లై నయీతనివాక్కులను బండితరాయ, విశ్వనాథకవిరాజ, సర్వజ్ఞసింగభూపాలాదు లెందఱో సేకరించియుండ, రఘువీరచరిత్రకారుఁడు "మాధుర్యైకభువాం మురారివచసా మాస్వాదిమైస్వాదిమా సంతుష్యంతి తయేవ నూతనసుధా వేణీషు వాణీషు నః" యనియగ్గింపఁగా, నొరులు "మురారిపదచిన్తాయాం భవభూతేస్తు కా కథా భవభూతిం పరిత్యజ్య మురారి మురరీకురు" యన్నది మున్నగాఁగలవెన్నో మదికిఁ దగులకమానవు.

"ఉత్పత్స్యతే మమతు కోఽపి సమానధర్మాః కాలో హ్యయం నిరవధి ర్విపులా చ పృథ్వీ" యన్నభవభూతిమహాకవివాక్కు వ్యర్థమానా? "య త్ప్రౌఢిత్వ ముదారతా చ వచసాం య చ్చార్థతో, గౌరవం త చ్చే దస్తి తత స్తదేవ గమకం పాండిత్య వైదగ్ధ్యయోః" అన్నసుకవివాగ్భవభూతి నిబ్బరముగా నబ్బిన విద్వత్కవిసార్వభౌముండీ

"బాలవాల్మీకి" బిరుదాభిరాముండగు నిజసూక్తిముక్తాఫలమ్ముల విషమదృష్టివిరహితసూరివరేణ్యైకహారహీరాయమానంబుగా నొనరించి యున్నాఁడు. పూర్వోక్తపరిణతప్రజ్ఞాధురీణుండు "తా మేతాం పరిభావయంత్వభినవైర్విన్యస్తరూపంబుధాః శబ్దబ్రహ్మవిదః కవేః పరిణతప్రజ్ఞస్యవాణీ మిమామ్"అన్నదానికిఁబై మెట్టుగా "సమున్మీలత్సూక్తిస్తబకమకరంద" బిందుసందోహతుందిలాయమానశ్రవణరంధ్రుండీతండు "న శబ్దబ్రహ్మాఖ్యం పరిమళ మనాఘ్రాయ సుజనః కవీనాం గంభీరే వచసిగుణదోషా న్విచయతు"అని యూనవెట్టుటలో శబ్దబ్రహ్మవేతృతా గరిమంబు నందిననే కాని యిందలిరస మానసందఱ కందనేర దని రూఢపరచినవాఁడయ్యెను. కావుననే, వ్యాఖ్యాత, హరిహరపండితుఁడు "హృదయాకలితాశేషశబ్దశాసనసంవిదః మురారే రిహ శబ్దార్థత్వత్తం కో వేద తద్వద!"యని యడుగఁజొచ్చెను.

అట్టియాతండు వల్మీకోద్భవుని భాసదిఙ్నాగభవభూతిప్రభృతుల నుద్దేశించి "యది క్షుణ్ణం పూర్వై రితి జహాతి రామస్యచరితం గుణై రేతావద్భి ర్జగతి పున రన్యో జయతి కః?" అనుచు "ధీరోదాత్తగుణోత్తర" నాయకగుణగ్రామోపసంవర్ణనంబునకుం గడంగెను;గాని, నాటకలక్షణాదికముల నెందు నతిక్రమింపకున్నను నీతని "పంథ" మాత్రము వేఱయ్యె నన్నంతవఱకైన వినని వా రుండరు. సాధారణముగా నాటకరచయితలువర్ణనాంశబాహుళ్యంబునందుఁగాకస్వభావోన్మీలనానుకూలతత్తత్పాత్రవాగ్రచనౌచిత్యంబునందలగ్నచిత్తతవెలయించిహృదయావర్జకకథాసన్నివేశముల సంఘటించుచుఁ గౌతుకోద్దీపికముగా, శ్రోత్రపేయమృదుశయ్యాలంకారవిశిష్టద్రాక్షాస్ఫోరకఫక్కి నెక్కొనఁబల్కఁ జూతురు. ఇయ్యది చంపూరచనఁబో యనఁ బోయినపోడవున నక్కడక్కడఁ గథాగమనంబున కిదేటియంతరాయ మనికూడఁదోఁపఁదగు నంతగా నేవేవో వర్ణించుచువచ్చెనదిగాక యించుమించుగ నష్టాదశ వర్ణనము లెల్లెడఁ జొప్పింప నెంచెనో యన్నట్లు సప్తమాంకమంతయు దేశపర్వతవాహినీపట్టణాద్యభివర్ణనబహుళంబు కావించియుండెను."గురుకులక్లిష్టం" డీతనికిఁ బిండి మెండుగా నుండుటంగావలయు శ్రీనాథ

మహాకవికే యొరవడిగా "ఉద్దామద్యుమణిద్యుతివ్యతికరప్రక్రీడదర్కోపల జ్వాలాజాలజటాలజాంగలతటీనిష్కూజకోయష్టయః" అన్నరీతి నారభటి మెఱయ నిజప్రచండపాండితీస్ఫోరకవాగ్ఝరిని సెలయేటివాటమున దొర లించువశ్యవాక్త్వంబు వెలయించుచు "వీరాద్భుతారంభగంభీరోదాత్త వస్తువిన్యస్తహస్తండై సమస్తపదజాలంబులతో నడిపి నారికేరస్ఫోరకత కల్పించిన వాఁడయ్యెను. అంతతోఁబోక, "చేతస్సుక్తికయా పిపీయ శతశ శ్శాస్త్రామృతాని క్రమా ద్వాంతై రక్షరమూర్తిభి స్సుకవినా ముక్తాఫలైర్గుంభితాః" అని తాఁబల్కినయట్ల శబ్దశాస్త్రంబు నందలి తన నూతనోపజ్ఞ నగపఱుప గూఢప్రయోగంబు లెన్నే ననుసంధించి యుజ్జ్వలదత్తభట్టోజీదీక్షితాదులకే భిక్షముఁ బెట్టఁజూచినదిగాక "ప్రకృష్టకర్తృభిః ప్రాయః క్రియాఫలవతో విధీన్ ప్రయుంజానా స్త్వయా వీర పరిపాల్యామహే వయమ్" అనుటలో "క్రియాపదే కర్తృగామిని స్వాంతేతః జతశ్చధాతో రాత్మనేపది స్యా" త్తను దానిని సూచించి యున్నట్లే 'జనికర్తుః ప్రకృతి' యన్నచో 'జాయమానస్యహేతు రపాదానం స్యా' త్తను కారకాంశమునే కాదు, 'స్థానివద్భావము'లే కా' దాకృతిగణ"ములే కా దిచ్చవచ్చినన్ని యిమిడ్చెను. ఇంక, "ధర్మస్థేయం తథైవ వచాంసి" యనుచో మీమాంసాపరిభాషఁ జొప్పించెను. మంత్రశాస్త్రపరిభాషయు నట్లే. ఆయాసందర్భము లెల్లం బరికింపఁగా నిది పాండిత్యప్రకర్షకై కడుంగడు శ్రద్ధతోఁ గూర్పఁబడినట్లు తెల్లము కాకమానదు. అందలిభాషయు దఱుచుగా బహుళనైఘంటికాద్యాధారమువలనఁగాని భేదిల్ల నట్లుండును.

కాని పదసన్నివేశముమాత్రము శ్రుతిసుఖావహమై యీతఁడు "సంగీతసాహిత్యపారదృశ్వా" యనుటలో సందియ మింతయు నుండఁ గూడ దనిపింపకమానదు. అందందుఁ బొందుపఱుపఁబడిన యుపమానోపమేయసామగ్రి యనన్యోచ్ఛిష్టమై నూతనభావోదయంబునకుఁ దావలంబై చూపట్టెడు. ఇంకఁ గథావిషయమందన్ననో. రంగస్థలానుకూలవ్యూహాసంఘటనంబు నందుఁగూడ నద్వితీయత నగపఱుపఁగలిగెను. ఇందు జనస్థానమున ఖరదూషణాదులను రావణుఁడు వాలికొఱకే

నిల్పెననుటయు, విశ్వామిత్రాశ్రమముననే వామనమూర్తి తపంబొనరించెననుటయు, వార్తాహారిణీమంథర శ్రమచే గతింప శ్రీమణి పరకాయప్రవేశవిద్యచే జాంబవంతునితోడి సంధానమును గల్పించెననుటయు, గుహుఁడు లక్ష్మణసచివుండై రామసుగ్రీవులనడుమను దౌత్యంబు నెఱపెననుటయు మున్నుగాఁగల వెన్నోచాణక్యకల్పన లనిపింపఁదగునవి యిందలి నిగూఢైతిహ్యముల నడుమఁ గోడకట్టుచుండును.

ఇట్టియసత్యసామాన్యవైదగ్ధ్యంబు వెలయించుచు వరసభరితాగాధకూపస్థితంబుల నుద్ధరింప సాధారణుల కెట్లైన దుస్సాధ మనక తీఱదు. ఉద్ధర్తలు కాఁజూచు శబ్దబ్రహ్మవేత్త లెవరైనను 'ఉక్షారథో భూషణమస్థిమాలా భస్మాంగరాగో గజచర్మవాసః ఏకాలయస్థేపి ధనాధినాథే సఖ్యౌ దశేయం త్రిపురాన్తకస్య" యని చదివినమాత్రనే సహాసంబుగా నాలకింపఁడు? ఇంక, "స్థానేషు శిష్యనివహైర్వినియుజ్యమానా విద్యాగురుం హి గుణవత్తర మాతనోతి ఆదాయ శుక్తిషు వలాహకవిప్రకీర్ణైః రత్నాకరో భవతి వారిభి రంబురాశిః" అనిచదువఁగా విన్నప్పటికంటె

మ॥ ఉపదేశించినవిద్యఁ బ్రాజ్ఞులయి శిష్యుల్పెక్కుచందాల ని
క్కపుఁగీర్తిన్బహుచోఁ గనన్ గురుగుణోత్కర్షంబు మెండౌను. దా
నుపయోగించినయబ్ధినీర్మొయిలు వర్షోద్యోగతన్ శుక్తివా
రపుటిన్జిల్కుటఁగాదె వార్ధి యులరున్ రత్నాకరంబై భువిన్।

అన్నయాంధ్రీకరణము చెవినిసోఁకినంతనే సాదృశ్యలక్ష్మిప్రసాదమొసవి. యీధారయే "భువనగిరి"నుండి యవతరించె ననిపించును.

అంత నిట్టివానికై తడవఁగాఁ బదేడవశతాబ్దిలోనే యొకతిమ్మభూపతియు, నాధునికుఁడు (శ్రీ)కూచసత్యనారాయణకవియు ననురూపముగానే శ్రవ్యప్రబంధములుగా మార్చినట్లు విందుము. ఇంక, (శ్రీ) ఆకొండి వ్యాసపండితప్రభృతు లనువదించుటం గందుము. అవియుఁ గొన్ని ముద్రితము లయ్యెం గాకయు నెట్లైన నందఱ కందుపాటుకానేరవు. ఇప్పుడు తమ కిద్దాని సేకరించి పరికింతము.

కర్త విజయరామకవి. రసజ్ఞు లెఱింగిన "ప్రతిభారవి" భువనగిరి ప్రసిద్ధకులజాతుఁడు. ఈతనియగ్రజు లస్మన్మిత్రవతంసులు శ్రీకోదండపాణిగా "రుత్తరరామచరిత్ర" మతిపేశలమైనశైలి నాంధ్రీకరించియుండ, నీతం డొక్కటి కాదు—మున్ముందే "కిరాతార్జునీయము"ను దెలిఁగించి పండితామోదముం బడసినమీఁదట, విభిన్నగుణగణవిశిష్టములైన కాళిదాసకర్తృకములు "మేఘసందేశాభిజ్ఞానశాకుంతలము"లను శ్రీమదాచార్యవిరచిత 'సౌందర్యలహరీ' 'శివానందలహరు'లను శ్రీమద్భగవద్గీత"ను దాఁ బునరాంధ్రీకరణంబు లొనర్చినదే కాక, లోకకళ్యాణంబు' స్వతంత్రముగను నొనరింపఁబూనియున్నాఁడు. అట్టియీతని నొక్కట నొక్కమిత్రవతంసుఁడు "ప్రతిభారవి"ననిపించికోఁజాలితినని మఱియుట కాదు. మురారిం జూచిన నెంతటిసరళవాక్కైనఁ బరారికావలసినదే యన్నమీఁదటఁ దా సిది రచియింపఁబూనితి ననుచు నిందలిపద్యముఁ దెచ్చి యథామూలముగాఁ బరికింపుమని కోరుచు మాకుఁగలసోదరన్యాయమున నన్నిటియట్లు నాయొద్ద విడిచెను. కొంతకాలమైన వెనుక,

"ఉ॥ నాకడసారిపిల్ల పయిన న్గలమక్కువపెక్కువ న్గుణా
లాకరడఁ గోర్కెమై. గురుకులక్రమశిక్ష లభింప సాధువా
క్ఛ్రీకరులైనమీకడకుఁ జేర్చితిఁ, గందువకందు పేరుటు
ల్లాకున గర్వి కాదుగద! లక్ష్యసమన్వితయై చెలంగునా?"

చ॥ అనఁగలకల్పకోచ్ఛలిమి నందుకొన, న్గొనలందు సాధువే
యనఁగలకల్పనన్ జెలఁగునా, తనమాతృకమాదిరిఁ బ్రౌఢగుం
ఫనముల మానకాదుకద! మాటకుమా టెసకొల్పి వ్యంగ్యవ
ర్తనమును మానకే. భవదుదంచితవత్సలతన్ గడించునా!॥

ఉ॥ అంకపుసందునీక, భవదంకపుఁ బొంకము మేల్మికల్మి, స
ప్తాంకములందు, దివ్యఘుటితాంకయుతంబుగనై. సదస్యస
ర్వాంకవిజేతృతన్ వెలయునట్లయి, నాకడసారిబిడ్డ నా
యంకముఁ జేర సాగుననునంకముకై కుతుకంబు గాంచెదన్ ॥

అని వ్రాసిన దానిలోనే పాఠకలోకమున కీతని రసవత్కవితా
నైపుణ్యము చూపట్టెడుగాదే! అందుల కీయనైన ప్రత్యుత్తరమిది చిత్త
గించునది.

చ॥ అవిరళకీర్తిధాముఁడు మురారిమహాకవి. తా ననర్ఘరా
ఘవ, మిల, నారికేరగతిఁ, గల్పనసేయఁగ దృశ్యకావ్యమున్.
"భువనగిరిం" జనించుటను, బోలదె నీ కది భేదిలన్? వచః
ప్రవణలసచ్ఛవీ! విజయరామకవీ! రచితాంధ్రభారవీ!॥

మ॥ సకలాంధ్రీకృతపద్యజాలములు, "తూ-చా" తప్పకుండంగ, 'మ
క్కీకిమక్కీ' యనులెక్కఁగాక, రుచిరోక్తిస్ఫూర్తిదీపించు పూ
ర్వకవిశ్రేష్ఠులబాట వీడక, స్వయంవ్యక్తిత్వమున్ జూపుచు,
బ్రకటానర్ఘళభావసంపదురుశోభ న్మీఱ, నేఁ గాంచితిన్॥

క॥ "కాలేజిగరలె" యయ్యున్
శీలంబును గుణముఁ గల్మి, శృంగారవధూ
పాలంబలక్షణాన్వితఁ
గా లీలఁ బరిష్కరింపఁ గడుఁగూర్చన దాన్॥

గీ॥ తల్లి గడుసెయ్యైనఁ దా మృదుభాషల
కిక్కయౌచు నొప్పు నక్కజముగ,
జిలుగుపలుకు లొలుకఁ దెలుఁగుఁదనం బెందు
నిలువఁగలుగు, నౌర! నేర్పుమీఱ॥

శా॥ మూలంబున్దరినుంచకొంచు, నిది, యీమూలాగ్రముంగాంచుచో
శైలిం బ్రౌఢిమ గూఢసారతయు, ద్రాక్షారీతికిన్ మార్చుభా
షాలాలిత్యము, సర్గగౌరవము, వాక్చాతుర్యమే, యిందు, నే
మూలన్ జానుగఁ గానుపించుట,యశమ్మున్ జిమ్ముఁదానిమ్మలన్॥

ఇట్లనుటలో నిజాభిప్రాయము సూచితమైనను గేవల మిది
యభినందనమాత్రముగ నెంచకుండుటకై యీయాంధ్రీకర్త రసపోషణ
మే యేవిధమునఁ గావింపఁ జూచినదియు దిఙ్మాత్రముగా వివరింపఁబోవుచు
మచ్చునకు మూలమునందలి భావములఁ బోషించినవిధాన మొక్కింత

యగపఱతును. "విద్యాశ్చతుర్దశ చతుర్షు నిజాననేషు సంబాధమస్థి తవతీ రవలోక్య వేధాః తాభ్యోఽపరాణి నియతం దశ తే ముఖాని స్వస్యాప్రిణా ప్రకరోత్స కథం జడోసి!" యనుదానికి, (౬-౮)లో మూలము లోని దింపుఁ బద్యార్థమున నే యిమిడిపోఁగాఁ దుదిముక్కకు (కథం జడోసి)=:"మిసిమేలపుజడ్డ మునింగి నీ విట స్థాలి కుమారిల స్థలఁపుగొంటె వి దెచ్చటినుండి వచ్చెరా? "యని చేర్చుటవలన సకల విద్యాప్రిణేత్రృబ్రిహ్మసంతతిసంభూతుండవయ్యు జగన్మాతృకల్పసీతాప హరణ మొనర్చునంతటి కార్యాకార్యవివేకశూన్యతకుం బాల్పడితివే మనుమూలస్థితభావమునకు మఱింతవన్నెఁ దెచ్చినది. ఈమాత్రము స్వాతంత్ర్యమైన నూనరాదని యెంచుదోషైకదృక్కులు కొందఱిది యమూలకమనియు నామూలస్థితావ్యయార్థం బేదో యిందుఁ గానరా దనియుఁ దడవుట యెఱుంగుదుము, అట్టికైసరులం గొందఱు సూత్రి ధారుంఘు పిలువఁగా వచ్చిన నటి ఇయమస్మి। యన్నదానికి 'ముక్కకు ముక్క'గా నేనయితి ననుమాదిరి భాషాంతరీకరణంబు లొనర్చుటయుం గందుము. అట్టి వెంతయింపుఁగొలిపి లోకాదరణపాత్రములు కాఁగ ల్గునో యోజింపుఁడు. అవి యడుగుబద్దతోఁ గొలిచిసరిపుచ్చఁజూచు గణబద్ధవాఙ్మాత్రములే యగును. ఉచితజ్ఞత వెలయించుస్వాతంత్ర్య మగపఱపఁగలిగిననే కవిత్వమనిపించుకోఁగలుగునన్నది రసజ్ఞహృదయైక వేద్యము. ప్రత్యేకమూర్తిత్వవిభ్రాజత్కీర్తిసాంద్రంబు లౌబహువిధ సుప్రసిద్ధగీర్వాణకవిశేఖరవాగ్జాలంబుల నలవఱచికోఁ జాలినయీయాం ధ్రీకర్తవాగ్రీతి నిజనైపుణ్యమగపఱప సముచితస్థలంబుల నన్వేషించు కోఁజాలు ననుటలో నబ్బురము లేదు.

నలుదెసల నొక్కటఁ జూడ నేర్పడినయాచతుర్ముఖములఁ బ్రపో త్పునిదుర్వృత్త 'మా చెవినా చెవిన్వినిన'ప్పుడు 'విష్వగ్వృత్తిచే' నల్కఁ యే తెఱఁగై యూతలవంపుల నుగుచునో!' యనుటలో 'అసంగతా నమ యితుం' (౭-౧౮) అన్నది ధ్వనిమాత్రవ్యంగ్యముగా స్ఫురింపఁజేయఁ బడదయ్యెనా? చూడుఁడు. రఘురామునకుం బరశురాముండెదురై, 'యీశకరపీడనపీతసారం'బై 'తునిగెవిల్లు నిమిత్తమాత్రుఁడ వెసి'వనుచు 'ఆకృష్ణ కార్ముకం గరుడధ్వజస్య' యని చేతికిచ్చుతఱిని, 'చాలు దేని'

యనునాలుగక్కరాలు చేర్చినంతనే యాధనుర్భంగము మాటటుండ నిందుభ్రూభంగంబుతోడి వీరధర్మంబుతోఁచుటలేదా? వేఱొక్కట సీతారాములు నిచుళనికుంజపుంజంబులందు నెఱపిన స్వైరవిహారంబు నందలిశృంగారచేష్టలు మదికిరాఁగా,

స్వవపుషి నఖలక్ష్మ స్వేనకృత్వా భవత్యా
కృతమితి చతురాణాం దర్శయిష్యే సఖీనాం
ఇతి రహసి మయా తే భీషితాయాః స్మరామి
స్మరపరిమళముద్రాభంగసర్వంసహాయాః

అను మూలమందలి భావం బీకవి తేటమాటలతో

'నా మెయి నానఖాంకురము, నాసఖి! నీకృతమంచు నీసఖీ
స్తోమముతో వచింతుననుచున్ భయపెట్టఁగ, మానియుంకిలిన్
నామదిఁ దృప్తినొందఁగ ననంగపరీమళముద్రి, స్వేచ్ఛ నే
నేమొనరించినన్ సయిచితే' అని యనువదించి, తుదకు

'అలనాఁ డెటువిస్మరింతునో' యనుచుఁ గథానాయకుహృత్స్వమం జొచ్చినంతనే కరుణరసంబు మఱింతగా నీవలికి వచ్చినదికాదా? ఇట్టే యీతం డెదిచేర్చిన రసపోషకమే యగుచుండునన్నది చూడఁజూడ బాలకలోకమునకే క్రమముగా సువ్యక్తముకాఁగలదు.

ఇంకఁ దానే ద్విరేఫయుతనామధారియగుటంగావలయుఁ దఱచుగా భృంగౌపమ్యంబు ననుసంధించుచో.-"పీత్వా భృశం కమల కుట్మలశుక్తికోశాదోషాతనీం తిమిరవృష్టిమథ స్ఫుటంతః నిర్యన్మధువ్రతకదంబమిషాద్వమంతి విభ్రాంతి కారణగుణానివ మౌక్తికాని" (2 47) యని కమలాకరములు పీతతిమిరంబు లౌటనుపాదానకారణభూతనైల్యగుణావహంబులుగా నళివ్యాజంబున నీలమౌక్తికంబులను గ్రక్కుచున్న (2 11) వన్నవాఁడు; వేఱొక్కట నిజమనోహరవాక్ఛ్రీవిలసితత్వంబు వెలయ "అరిషడ్వర్గవనాయ మస్యాస్త్వత! పదానిషట్ తేషా మేకమపి ఛిందన్ ఖంజయ భ్రమరీం శ్రియమ్" (6-9) అని కామమునున్మూలించి ననేకాని సిరి సుస్థిరము కానేర దన్న దానిని "సిరి యనుభ్రమరికిఁ జరణము లరిషడ్వర్గములె యాట నం దొకదాని

న్వాటిచి యని యనువదించుచో మూలస్థిత 'భ్రమర' శబ్దమునే గ్రహించుట భ్రమణశీలత్వధ్వనిసంపాదనమునకొఱకే యని గుర్తించి ముదమందుదము.

'అభేదే నోపాస్తే కుముద ముదరే వాస్థితవతో వివక్షానంభోజాదుపగతవతో వా మధులిహః అపవ్యాప్తః కోపి స్వపరపరిచర్యాపరిచయ ప్రబంధ స్సాధూనా మయ మనభిసంధాన మధురః (6-6)" అని కుముదవృత్తమునకును సాధువృత్తమునకును మూలమం దుపమానోపమేయభావరూపవ్యంగ్యమాపాదించిన దటుండ "కోః ముత్ సంతోషో యస్మా" త్తను వ్యుత్పత్తిచే భూసంతోషప్రద శ్రీరామచంద్రమూర్తియు 'అంభోజా' శబ్దగ్రహణంబున నిందిరాభిన్న జానకీదేవియు, 'మధులి' ట్ఛబ్దమువలన వానర రాక్షసులును 'ఉదర' శబ్దలక్షణార్థగ్రహణంబున స్వసేనాస్థితులు ననుస్ఫురణముకూడఁ గలుగునవకాశ మొదవనయ్యెడు, నది తెలుఁగులో నొప్పింపఁబడెనా యని ప్రశ్నింతురేని, నానార్థనిఘంటుసాహాయ్యమున మైదాపిండివలె సాగింప నౌ నానిర్జరవాక్కులపొందిక నెందు నందింప వలనుపడదన్నది తత్ జ్ఞ తకల్మిని విశదముకాఁగలదే కాన 'సాధు లెప్పుఁ దనవా రొరు లం జెడసేయఁబోవకే నినుతొరు సేవ నెవ్వరికి నేనిసుధామధురక్రియాధురిన్" అనున గ్రాంతరన్యాసమునందలి వాక్సుధామధురక్రియారూపధురి నోలలాడి దాన సంతుష్టి నందవలసినదే యని చెప్పకతీరదు. ఇట్టికవితాధురియయ్యు స్వభావోక్తి యొప్పించుచొప్పుగా -24లో 'శ్రమ వదలి నిలిచి నిలిచి యెట్లుప్రవహించెడినో' యనునది గమనించునది.

"స్యాదేవతోయ మమృతప్రకృతిర్యదిస్యాన్నైకాంత మద్భుత మిదం పున రద్భుతం నః లక్ష్మీం తుషారకర కౌస్తుభ పారిజాతధన్వంతరి ప్రభృతయో యదపాం వివర్తః (7-12)" అనుచోఁ బారిజాతమైననేమి వేల్పుగిడ్డియైననేమిః యిష్టార్థప్రదం బౌనట్లుగానే "అయిన నాఁదగుతే సుధాప్రకృతి యీయంభోధినీరంబు వింత యొకింతేనియు లేదు దాన, సిరియున్. జాబిల్లియున్. వేల్పుగిడ్డియు ధన్వంతరి, కౌస్తుభాదులటఁ బుట్టెన్నాఁగఁ ద్రైలోక్యవిస్మయమానాద్భుతగాధ కాదె" యని తుదకు

‘మహీన్ సంభ్రమంబు సామాన్యమే?’ యనికూడఁ జేర్చుటవల్ల సుధా ప్రకృతి యానీకవితారసాంబుధిమహిమంబును సామాన్యంబ యనితోఁప నిందలి యాయారసంబులుం జవిచూత మనిపించును.

ఇది వీరరసప్రధాన మహానాటకముగాన ముందు రౌద్రవీరాద్భుతము లొప్పించినవిధమును బరికింతము. అవి యెక్కువగాఁ బరశురామ ఘట్టమునను నడుమ నాయా రాక్షసులతోఁ దలపడినసందర్భములం దుదకు రామరావణసంగ్రామమందు నత్యధికముగాఁ గాన్పించుచుండును ‘కల్పాంతకర్కశకృతాంతభయంకరంబు’ (6-77) నాఁగా ‘సకలభూమిని నీరాక్షసం బొనర్ప నిడుతఁ బుణ్యాహమంగళం బీధనున్న (6-33) అనుచుఁ గౌశికయాగంబుఁ గాచి ‘దిక్కూలంకషకీర్తిఘాతంబు’గా “ఎంతటి మేటిరాజులకునేనియుఁ దేఱికనంగరాక భాస్వంతమునై సమస్తసుర సంఘకళాపరిపూర్ణసారసంక్రాంతి నెసంగు శంకరునికార్ముకరాజము నెప్పుడాతఁ డింతలుగాఁగఁ దుంచె నపుడే” (4-16) అన్నదియు, ‘అలశివు నష్టమూర్తు లొకళ్లై కదియుంబడె. నష్టదిక్తతుల్పలపల మోగెఁ గ. నల్వచెవుల న్గఘుంగురు సోఁకె నెన్మిదౌ కులగిరు లయ్యెను గ్గురగకోటి కులాష్టక మక్కలాటె దోర్బలరఘురామకర్షితపురాతన కార్ముకభేదనధ్వనిన్’ (3 54) అన్నదియు విన్నంతనే శివధనుర్భంగం బెంతయద్భుతావహంబై నదియు మూలాతిరిక్తముగాఁ బ్రదర్శితమయ్యె ననిపింపకమానదు.

అంతతోఁ బోయెనా? ఆధ్వని ‘కృతవీర్యనందనవధూబాష్ప ప్రియంభావుక’ నారాచండై ‘హేలామాత్రముగా సమూలముగ భూమీశాన్వయస్తోమముల్ కూలం జేసిన’ యా ‘విపులభుజశిలాస్తంభ విభ్రాజమానజ్యాఘాతశ్రేణిసంజ్ఞ’నకు శ్రుతిపుటగోచరమైనంతనే “ఎంతో యాఁకట న్నాదుగొడ్డలి యిట్లీతనికోసమై వెదకుఁ జెండన్ జండవహ్నిక్రియ” నని తలపడఁగా. “జాతస్నేహాందినకరకులక్షత్రియ శ్రోత్రియేభ్యో విశ్వామిత్రాదపి భగవతో దృష్టదివ్యాస్త్రపారః అస్మిన్ వంశే కథయతు జనో దుర్యశో వా యశో వా విప్రేశస్త్రగ్రహణగురుణా స్సాహసిక్యాద్బిభేమి”.(4-49) అనికదా రాఘవుండు పలికె. ఏమైనను

"దుర్మదబాహులం దగు కార్తవీర్యుని సహస్రస్థూలహస్తాళిపైఁ బాదలం జేసిన నీభుజాబలము పెంపున్ జూపుమా నాపయిన్." (4-63) అని దీకొన్న యెడఁ "బులిపయిపుట్రగా గురుధనుస్సును దుంచుటఁ బ్రోదిఁ గూర్చె" (4-64) ననుటలోని లోకోక్తిగ్రహణమువల్ల నిట మఱింత ప్రోదిఁ గూర్చెడినిగాదే! ఇంక భయానకంబుగా "కౌశికయాగమే మొదలుగాఁ బగ రాఘవసూనులందు లంకేశున కిప్డు బంధువులునే న్నాతులైరి, త్రిశక్తిసంభృతా వేసుఁడు, మాయలాఁడు, బలవిశ్రుతుఁ డెమ్మెయి ముక్కలుం జెవుల్నాశిలు చెల్లి మోముఁ గనినన్ మది సైఁచునో రేఁగకుండఁగన్" (5-5) అన్నప్పటిస్థితియుఁ 'బులిపయిపుట్ర' యన్నట్లేతోఁచును. దాన భీభత్సంబు దోఁప-'వానరదైత్యసంచయకబంధము లెగతి నిప్పుడైన లోకానకు భీప్రదస్థితులఁ గన్పడునో! వెయి నెత్తురేఱు లంభోనిధి క్రొత్తభార్యలుగఁ బొర్లునఁ బాఱునో! వేలవేలుఫుం జానలు నూత్నవీరవరసంగతిఁ గాంచునో!' యనిపించును. తుదకెక్కైన జమదగ్నిసూనున కైనట్లే "సిగ్గలముకొన్న"మీఁదట "శివాస్తే పంథానో వ్రజ నిజగృహేభ్యో నిజగృహాన్ కిమన్య త్సర్వేషాం గుణమయశిరోమాల్యమపి నః" అనిశాంతవాక్యములకు దిగినమీఁదటఁ గరుణంబు దీపించు ఘట్టములు మదికిరాఁగా శ్రీరాముఁడు భరతునితో "అయ్యయో! యెంతపాలెను ద్వాదంగము! వెన్నెలకంబమయ్యెనే మయ్య! కవుంగిలింగొనఁగదయ్య ననున్మదముబ్బునట్టు, లోయయ్య!" యన్నసాదరవాక్కు లాలింతము. అంతతోఁబోక "కడుంగడుం జపలయాకమలాలయ కౌస్తుభంబుపై నెయ్యపుసోదరప్రియత నేకద వీడదు విష్ణువక్షమున్!" అని చమత్కరింపఁగా, నింక శృంగారవిలసితంబైన "రోమాంచోచ్ఛ్వసదంగసంధినిబిడై రాలింగనై ర్యామినీం, శేషీకృత్య వినృణ్వాతే నిజరహశ్చాతుర్య మేణీదృశః" అనుపట్టునఁ 'గ్రినీడ ల్తమ కౌనుబంటి వలయ న్గరింత నేణాక్షు ల త్యానందంబుల వెల్లడింతు రను భూతంబు లహశ్చాతురుల్' అనుటలో 'నాభిదఘ్నము'ను 'గౌనుబంటి' సేయుఁగా కది రహశ్చాతుర్యవేదులకే వదలి "కర్ణోత్తంసయవాంకురం కరతలే కృత్వా హసిత్వా మిథ స్సంహూతః పురుహూతపౌరయువతీ

వర్గేణ కౌతూహలాత్ గాప్తా ర్తిత్సుభితో యమంకహారిణం కుర్వీతకింకిం కలా కంథా మిందుమతీ మజన్మ ఘటనోద్ఘాటగ్లి థావస్థితాం" అన్న హా స్యోక్తికిం' జవరకుఁ గందులేడి యెదిసేయునో! సర్ఫైన చంద్రుగా సెనన్' అన్నది మతింతయింపుఁ గొల్పునదిగానే యెంచఁగలుగుదుము. ఆపై నెట్లో కఁటఁబడిన యాచందురు స్వీడక "ప్రత్యాసన్నతుషారధీధితికర క్లిశ్య త్తమోవల్లరి"యై 'రాజన్మూత్నమృణాళఖండరుచితో రాజీవసం వర్తికా తేజంబు న్మొడిఁగించు. న'య్యమృతాంశుఁడు పొద్దుక్రింకిరా న్నిముఖతఁ జూపుతమ్మిగ్రహిణిన్ శశిపాప మూనఁగా "గౌరాంగీవద నోపమా సుకృతమాద త్తే ఎతిర్యజ్వనా"మన్నది కన్నంత నే"రిక్క_ల్దించి సంధ్యానలశ్వసనంబందు గరంచి పోఁత నిటులే సాధించిరో" యను దీన "నిందుమురారి" యన్నది మదికిఁ దవులక మానదు. ఇక్కడికే గ్రంథ విస్తరమైనది ఇంకెన్నిటి నిం దెత్తిచూపనౌను.రసజ్ఞులే పరికింతురుగాక

అట్లుపరికించుచో (౬-౬౦) "అడ్డాదిడ్డి"ప్రయోగా లేవైనఁదగుఁ (3-39) సరిల్న, (4-47) 'సవాల్' సేయక తెలుఁగులెక్కువగావాడుచో 'మూపులెగిరించుకొను' (3 ౯౧) మాదిరి జాతీయములకును. 'పూట కాపు' (1-1౯) 'మిణుకు' (3 8) 'చెట్టుబట్టు' (3-12) నట్టు లౌవాడుక పదాలకును బ్రవేశముఁ గల్పించుట నందముపెంపొందించుప్రాసిక యే యని యథాయోగ్యముగా సేకరింపఁ జూచునది. భక్తివిభక్తుల లోటు లేనప్పు డుపవిభక్తు లంతగాఁ బాటింపమి క్షంతవ్యముకాదా? 12వ పుటలో 28 పంక్తిలోని బాలులా రా! వంటి యచ్చుతప్పులు మీరే దిద్దుకొందురయ్యె. ఇంకఁ గ్వాచిత్కముగా వటుకలహంసికాదిపాత్రము లచే నెటనేని వాడనైన గ్రామ్యములనుగూర్చి మాత్ర మించుక ప్రస్తా వింతును.

ఇది శిష్టుల కనిష్టమేయైనను బ్రస్తుతకాలవిశిష్టత యద్దానికే సర్వవిధాలఁ బ్రకృష్టతను గల్పించుటలో,నూతనప్రియాభినందనలాలసు లౌపెద్దలనే యందుడించుటం జూచిన యిక్కవి మూలమందుఁ బ్రాకృత మున్నెడ నందును వచనభాగముననే యీనడక నడచినముచ్చటఁ దీర్చికొనెను. ప్రాకృతమట్లిది వ్యాకరింపఁబడిన భాషాంతరముగాకయు

‘రాకుమారుం’డనువాని చేల గెత్తించినట్లే తెన్నుమాలినదయ్యె నుండక తప్పదు. ఈమాత్రమున నీగ్రంథమంతయుఁ బామరలోకసుగమముం గా నేరదు. అయినను బ్రస్తుత మిది నిమ్నజాత్యుద్ధరణరూపపురోభిగమనంబువంటిదే కాదా ? ఇంతకు నిది నాటకమయ్యె. అందు నే నీచపాత్రల నోళ్ళతో పలికింపఁబడినదయ్యె. అది యటుండె.

ఇంక ఛందోవిషయమున నేయఖండయతులో యేతాదృశము లో బహుళాధునికకవిప్రయుక్తము లైనవానినిగూర్చి ప్రత్యేకించి వివరింప నక్కఱలేదు. ఏమైనను నానారసపోషక మైనరమణీయపదగుంఫనముఁ గలిగి, మూలమునందలి కాఠిన్యమును జాలవఱకుఁ దొలఁగించి లోకమున కఁదింపఁబడిన యీనాటక మర్థవిద్యార్థిలోకపఠనీయమై సర్వసంస్కృతభాషానభిజ్ఞతారకంబును బహుళగుణగణ ప్రస్తారకంబునై “యాంధ్రమురారి” కీర్తివిస్తారకం బయ్యెడుఁగావుత !

“ఉద్దామభ్రమివేగవిస్తృతజటావల్లీప్రణాళీపత
త్స్వర్గంగాజలదండికావలయితం నిర్మాయ తత్పంజరం
సంభ్రామ్య ద్భుజదండపక్షపటలద్వంద్వేన హంసాయిత
స్త్రైలోక్యవ్యయనాటికానవనటస్స్వామీ జగత్త్రాయతామ్॥”

బందరు
15-5-49

ఇట్లు, సుధీవిధేయుఁడు,
నాదెళ్ళ మేధాదక్షిణామూర్తిశాస్త్రి

# కవికృతులపైఁబండితాభిప్రాయములు

ఆంధ్రమేఘసందేశముపై శ్రీనాదెళ్ల మేధాదక్షిణామూర్తి శాస్త్రి కవిగారు 3-1-1937:—

చ॥ సుభువనగిర్యుపాఁకకవిసోమ ! యశోవిభవాభిరామ ! వా
క్ప్రభ గురుఁ డుబ్బి మున్ను 'ప్రతిభారవి' యంచనె. నేఁడు దాన నీ
వభినవకాళిదాసబిరుదాంకమునుం గయికొందుగావుతన్
సభలకు నెక్కి నీకృతి ప్రశస్తిఁగనన్ జయరామనామకా !॥

19-5-1936న మాధవశతకాదులపైన :—

ఉ॥ వింటిని మున్ను త్వత్కృతుల వీనుల విందొనరింపఁజేయఁగాఁ
గంటిని వానినే యిపుడు కన్నులపండువుగాఁగ నచ్చువన్
దొంటిభవంబునన్ జనని నోచిననోములపంటలో యనన్
దంటలు మీరలై సుతులు ధారుణిఁ గీరితికెక్కఁ గల్గిరా॥

ఉ॥ సారవిహీనపుంగృతులు చాలఁగ నచ్చయి మేలుఁగూర్చునే ?
యారవితారకంబులు రసాశ్రియభావవిశేషభవ్యశో
భారవితేజము ల్సుకృతివర్యముల న్భువి నిల్పుధీనిధు
ల్భారవిముఖ్యులౌట నెటువల్కినఁ దచ్చరితంబు లింపులౌన్॥

ఉ॥ శైలి మనోహరంబగు రసంబులఁ జిల్క వచఃప్రచారధా
రాళత యొప్పటం గురులు రంజిలనే సిగ చుట్ట నందమా
లీలను నీకృతు ల్మదిఁ దలిర్పఁగ జేయవె? మాధవాదృతిం
గ్రాలునభీష్టముల్ విజయరామకవీ ! రచితాంధ్రభారవీ !॥

ఆంధ్రభగవద్గీతపై శ్రీవేలూరి శివరామశాస్త్రిగారు. శతావధానులు. 25-10-48 మీరు ఎంతయోప్రతిభతో వ్రాసిన గీతలుచూచి చాలనానందించితిని భాషాంతరమునకు లొంగనటులు కనఁబడెడుపలు శ్లోకములు మీకండరువునఁబడి చచ్చవుకముగా తెలుఁగునీటెను. మీయాకృతి నింకొకమాఱు కొండాడి విరమింతును.

శ్రీమద్భాగవతాంధ్రీకర్తయగు శ్రీమాన్ముడుంబ సింగరాచార్య వర్యులుగారు. జగ్గయ్యపేట 3-5-49 విద్యార్థికిఁ బాఠముఁ జెప్పుసందర్భమున (మీ) యాంధ్రకిరాతార్జునీయమును జూచుట సంభవించినది. "భారవేరర్థగౌరవమ్" అనుప్రసిద్ధి తెలుఁగుకావ్యములోఁ బ్రత్యక్షము కావింపఁబడినది. (మీ) "భారవి"యను స్వతంత్రకావ్యమును గూర్చి యెంతవ్రాసినను జాల దని నాయభిప్రాయము. పూర్వకవులఫక్కిలో సర్వాంగసుందరముగాను సర్వలక్షణసమన్వితముగాను ఉన్నదని చెప్పుటలో నేమియు సందేహము లేదు. మీయాంధ్రాభిజ్ఞాననాటకమును జూచి మిక్కిలిసంతసించితిని మూలమునందలి భావములనుసరిగా నర్థముఁ జేసికొని చక్కని తెలుఁగులో నిర్దుష్టములైనపదపదార్థములపొందికతో ఇది కూర్పఁబడినది.

కొవ్వూరు సంస్కృతపాఠశాలాముఖ్యాధికారి శ్రీ కె. వి. నృ అప్పారావుగారు 6-5-49 మీయాంధ్రాభిజ్ఞానశాకుంతలము నామూలాగ్రముగాఁ జదివితిని. ఇప్పటికే యిన్నియనువాదము లున్నవే! ఇదియు నేల? అనిపింపక కొన్నిక్రొత్తపోకడలచే దనవిశిష్టతను స్థాపించుకొనుచున్నది. తమయనువాద మిప్పటికున్నయనువాదరత్నములలో నొక రత్నమై ప్రకాశింపఁగలదని నావిశ్వాసము.

శ్రీ అడిదము రామారావుపంతులుగారు, సీనియరు తెలుఁగు పండితులు. M. R. కాలేజి, విజయనగరం :—14-5-1949.

మీయాంధ్రీకృతశాకుంతలమును శ్రద్ధమై నోపికతోఁ జదివి యానందించితిని. అంకములతుదల మీరు పొందుపఱచిన స్వంతపద్యములలో నుడివినట్లుగ "సుపేశలో మధురవ్యాపార మేషా" రుచు మీయనువాద మెంతయు హృద్యముగా నున్నదని నామనవి. అచ్చటచ్చటఁ బద్యములకుఁ బాఠాంతములుగ వేఱుపద్యముల నిచ్చుచు వచ్చితిరి. అట్టిచోట్లఁ గలపద్యములలోఁ జిన్నపద్యములే కడుంగడు మిన్నగా నున్నవని నా యాశయము. 8 పేజీలో 15వ పద్యమున "మంచియాకృతి కేది కాదు మండనంబు". ఈపద్యపాద మెంతయు ముద్దులు మూఁటగట్టుచున్నది. ఇంక శిష్టజనవ్యవహారభాష యాలం

కారికమతానుసారముగ మీ రాచరణలోనికిఁ దెచ్చుట మీగ్రంథ మునఁ జూపట్టుక్రొత్తందనము, గాని యది నిరక్షరాస్యుల వాడుకకు దగ్గరకాకుండ నచ్చటచ్చట సంస్కరింప నవసరమా యని నా యోచన, పండితప్రకాండులును గవితల్లజులు నగు బ్ర॥ చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రి గారును, మధ్వశ్రీ కాశీకృష్ణాచార్యులుగారు మున్నగువారి యభిప్రా యములే చాలును. ఇంకమఱికొన్నిటిం జేర్చునగత్యము లేదనినా తలంపు ప్రాక్తనపుణ్యావిశేషముచేత మీకు నిస్తులకవితావిభూతి యల వడినది.

శ్రీయుత K V N Apparao మహాశయులు M. A. Principal, Sanskrit College, Kovvur, 23.5-49 'తనురంపిన' "అనర్ఘరాఘవము" నాంధ్రీకృతిని గృతజ్ఞతతో నందుకొని ఆమూలా గ్రముగఁ జదివితిని. తాము చేసినకృషియు, పడినశ్రమమును గ్రంథ మున స్పష్టముగాఁ గన్పించుచున్నది. అనువాదమన్న దేకష్టము. అందు నను, మురారివంటిప్రౌఢకవి ననువదించుట కష్టతరము. అయినను దా మిందు సఫలులైతిరనియే నా తలంపు :—

మ॥ తతసారస్వతదుగ్ధవారిధికి మంథానాచలంబై సుధా
ప్రతిరూపంబు "ననర్ఘరాఘవము" నుత్పాదించె మున్నామురా
రి; తదాస్వాదవినాకృతుల్ దనియ నాంధ్రీకర్తలై బల్సను
ర్థత మీ రిచ్చితి రిప్డు డాసుధను నేత్రశ్రోత్రపేయంబుగన్ ॥

శ్రీమద్భాగవత 11, 12వ స్కంధములను సమర్థతతో మనోహర ముగఁ దెలిఁగించిన బ్ర॥ ఉభయభాషాప్రవీణ వేదాంతపారీణ,మిన్నికంటి గురునాథశర్మగారు, ప్రధానాంధ్రోపాధ్యాయులు. హిందూ కాలేజి హైస్కూలు, గుంటూరు. 31-5-49 ప్రతిభారవీ! తమరుదయతో నొసంగిన శ్రీమదాంధ్రాభిజ్ఞాన శాకుంతలమునుజూచి, కవియైనవాఁడు రామకథంబోలె శాకుంతలముఁగూడఁ దాఁకవలయునా యేమి? యని లోఁదలంచుచు నట్టె పుటలవిప్పి చదువుచుండగా! ఇఁక నేమన! హృద యము గిఱ్ఱుననిండి పొర్లుచు దరుల నొరయుచున్న యానందరసమునట్టె భరింపలేక వాగ్ద్వారపుటలువుఁ జూపవలసివచ్చెను. మహాకవీ! మీ

కవితాధార సుధాసారానుసారియనుట యమృతము తియ్యగనున్న దనుటయే సందర్భోచితశబ్దములతోఁ బద్యముండుననుటరాకాచంద్రబింబము కళలతోఁ గూడియుండుననుటయే. ఆరితేఱిన మీకలమున వ్యర్థపదములురలంబడవనుట సూర్యగోళమును దిమిరపటలములు చేరవనుటయే. భారవి మున్నుగాఁ బెక్కుపొత్తముల వ్రాసిన మీరు చక్కఁగాఁ గవిత్వము వ్రాయఁగలరన్నచో నాబోంట్లపచార మొనర్చుటగాదే?

జిలిబిలి తెలుఁగుఁబలుకుఱవ్వల నెచటఁ బొదుగవలయునో, బంధుర సాంస్కృతిక బంధానుగంధము నెచట సంధింపవలయునో, యలఁతియలఁతి పదముల నెచటఁ జిలుకవలయునో, దీయని జాతీయముల నెచట నేయువలయునో, ఏవృత్తము నెత్తఱి నెత్తికొనవలయునో, ఏయవసరమున నసమరసవిసరము బుసబుస పొంగులువాఱ విసరవలయునో, ఉభయకవిమిత్రా! మీకుఁదెలిసిన ట్లొరులకుఁ దెలియదనుట సాహసోక్తిగాదు.

అచటనచట నొకేభావముగల రెండురెండు పద్యములుంటచేనేమో కాని, లేనిచో, మీ శాకుంతలమాంధ్రీకృతముగాఁగాక స్వతంత్రకృతిగా నున్నదని యే కవితామర్మజ్ఞుఁడు తలంపడు? గీతానర్ఘ రాఘవములు-సరే-వ్రాసితిరి, ఐపోయినవి ఇటుపైఁ బూర్వులంబోలె 'నవారిత సత్కవికల్పనావిభూషావహ పూర్వవృత్తములు సానలఁ దీఱినజాతి రత్నముల్'' గావున నట్టి కావ్యములవ్రాయ దీర్ఘాయురారోగ్యములు మీకుఁ బ్రసాదింప భగవంతుని బ్రార్థించెదను.

## అభినవసరస్వతి-1937 జూన్ సంచిక

"భారవి:-ఇందలి కవిత్వము మృదుమధురభూయిష్ఠము. మిక్కిలి మనోహరము. లోకోక్తులనేకములు. అవధానమందలి యాకాశపురాణమున భారతకథ పలుపద్యముల బాగుగాఁ జెప్పించిరి. కవితాస్వరూపమునుగూర్చి పెద్దనాదుల మాలికలవంటి పెద్దపెద్దమాలికలే అల్లించిరి. ఏ పట్టునఁ జూచినను నెంతయు రసముట్టిపడునట్లు వ్రాసిరి."

# శ్రీ సౌందర్యలహరి-మచ్చుపద్యములు

ఉ॥ పూలె ధనుస్సొ ? తేంట్లె గుణమో ? విశిఖా లయిదేనొ? చల్లనౌ
గాలియె పోరుతేరొ ! దళకాపు వసంతమొ ! వీనితోనె మే
న్మాలినవాఁడె యొంటరి సమర్థత గెల్చెనొ లోకమంతయున్ ?
శైలసుతా ! ఇదెల్లఁ గృప చాల్కొనునీకడకంటి పెంపెగా !॥

ఉ॥ నీకడకంటిచూపు పడునే నతఁ డెట్టికురూపి వృద్ధు న
శ్రైన్మకజడుండునైనఁ బరుఁగెత్తెదు రారె బడి వేఁజవ్వనుల్
రైఁకల కావుపైఁట పడ, వ్రాలుచుఁ గొప్పులు తూఁగియాడఁ గాం
చీకలనంబు వీడిచనఁ, జేలములూఁడ నెఱుంగ కీశ్వరీ !॥

చ॥ తిరుగుటయే ప్రదక్షిణము, తిండియె యాహుతి, నేల వ్రాలుచున్
బొరలుటయే ప్రణామ, మెదొ పొర్లుగ వాగుటయే జపంబు, శి
ల్పరచనలన్ని ముద్రలు, నపాస్త్వమదీయసుఖాలు సేవలై
వఱలునుగాత నీకు సదుపాస్తి మదాత్మసమర్పణంబుగన్ ॥

మ॥ కవ గోమైన ‘విశాల’గా, కుచులు నిక్కన్మేటి “కళ్యాణి”గా
కువలప్రొడి ‘కయోధ్య’గాఁ, గృపకు నిగ్గున్ “ధార”గా “భోగవ”
త్యవతంసంబుగ, నిద్దమా “మధుర” ని “త్యావంతి”గా, మేల్పురి
ప్రవర జ్యేష్ఠత నీదుదృష్టి “విజయ”త్వప్రౌఢ మౌ నీశ్వరీ !॥

శా॥ కెంపు న్వజ్రము నీలము న్దగడు నక్షిత్రైకసౌభాగ్య మూ
హింప న్నమ్ముఁ బవిత్రిల న్నలుప నెంతే స్నిగ్ధపాపూర్తి నిం
డింపన్ శోణగ, గంగగా, యమునగా విల్పొందినట్లౌ విచా
రింపన్ మూడిటిసంగమం బటనె సిద్ధించుంగదా! ఈశ్వరీ ।॥

చ॥ భవు బహుశౌర్యగాథల విపంచిపయి న్బలికించువాణి నీ
“పవురిపురా !” యటంచుఁ దలనాడిచి పల్కిన నాకలోక్తి నెం
తొ వెలితిచే నపశ్రుతులతోఁ జెడుతంత్రులవీణ గొబ్బునన్
గవిసెనలోన దాఁచుకొనుఁగా ! పెనువిస్మయ మూఁప ! నీశ్వరీ !॥

—o—

# శ్రీ మదనర్ష రాఘవము

శ్రీమదామ్రమ గుణాంబురాశి స్వామసత్శ్రీఁజిల్కు వీరాద్భుత
గామ్రమాపూర్వ్వచఃపరంపరితధారాళోరుధారార్ఘురీ
స్తోమావేశముతో మురారి కళఁబొందు ల్యాకార్వ నద్దాని కాం
ధీమ్రమాధుర్య మిడన్గడంగు నెడ నర్చింతున్ దదాన్నత్యముల్॥

## ప్రస్తావనము — నాంది

శా॥ శ్రీకామోదకి తోడుగాఁగ భగవచ్ఛ్రీమూర్తి యేకన్గవన్
గోకప్రీతిఁ జకోరపారణము వల్గుజ్యోతులన్గూర్చి నా
భీకంజంబున నర్థబోధ దరసుప్తి న్గంబుసాపత్న్యమున్
బ్రాకెత్తించునో, అట్టికన్గవను నిష్ప్రత్యూహ మర్చించెదన్॥

## మఱియు

చ॥ ప్రళయ మడంగ బొడ్డునికిపట్టుగ నాత్మభవుండు ముజ్జగం
బులతొలిశిల్పి సృష్టికని పూనఁదలంచి, యెదెందునుండికాఁ
గలదో వ్యవస్థయెల్లొ యెఱుఁగంగఁ బ్రతిక్షణ మేరిబొజ్జలో
పలికిని బోవు, నాసకలవంద్యజగన్నిధి కేను మ్రొక్కెదన్॥

సూత్రధారి:-ఓహో! ఏమండో! క్షారపారావారతీరకాంతారవారం
బునకుఁ దమాలభూరుహకందళంబై త్రిభువనశిరోలంకారభూతమహా
నీలమణియై, లక్ష్మీకుచకుంభద్వయ కేళీరచితకస్తూరికాపత్రాంకూర
మైనశ్రీపురుషోత్తమభగవానునిరథయాత్రకొఱకై చేరినసభాస్తారు
లారా ఏదియోద్వీపాంతరమునుండి వచ్చినకలహకందళుం డను
కుశీలవునిచే రౌద్రభీభత్సభయానకరసపూర్ణమైనయేదో ప్రబంధము
నిత్యము నభినయింపఁబడుటచేఁ బ్రజలెల్లరుఁ గంపితులైపోయిరి
గదా! కావున, నద్దియే నభిమతరసప్రసిద్ధ మైననాటకముఁ బ్రద
ర్శింప ననుజ్ఞనిచ్చి నాట్యవేదోపాధ్యాయుని యనేకనాటకములలో
నంతేవాసియై మధ్యమదేశవాస్తవ్యత స్వరఁగుసుచరితనాముఁ డగు
యీభరతపుత్రుని మీరెల్ల రనుగ్రహింతురుగాత!

గీ॥ ఏజనములకు రంగమే యెల్ల బ్రతుకొ
పి్రయమె వారికి సభ్యులప్రీతియనఁగ
దాని దొంగిలి చనినట్టివాని గెలిచి
యిట్లిదే తెచ్చుకొనువాఁడ నిపు డిదాని॥ 3

(వినుటనభినయించి) ఏమనియెదరు ? నీవు దేశాంతరమునుండి వచ్చినవాఁడవు ఎందుకు వట్టిప్రగల్భములనియా ? (నవ్వి) పెద్ద లిట్లందురా ? తమబోంట్లసభను సేవించుప్రయత్నమే సంపూర్ణ ఫలప్రాప్తిసాదనసామర్థ్యము నొసంగుఁగదా ! కనుఁడు.

గీ॥ న్యాయమునకు బాట విడువనియట్టివాని
కగును బాసట తిర్యక్కులైనఁగాని,
చెడుగుదారిని బడిపోవుచెనటిజనుని
దవ్వుగా వీడిచను సహోదరుఁడుగూడ॥ 4

(వినుటనభినయించి) ఏమంటి రేమంటిరి ! అట్లైన నిదిగో చీటి నంపెద మనియా !

(నటుఁడు ప్రవేశించి చీటినొసఁగును.)

సూ:-(అందుకొని చదువును)

మ॥ తనియన్ శాస్త్రసుధ ల్యతంబులుగఁ జేతశ్శుక్తిఁ బెల్లాని కొ
న్నన వాంతాక్షరముక్తిమాక్తికకళానద్ధోక్తిహారావళు
ల్తనరం గూర్చినకావ్యము ల్వెరిసి తత్తన్నాయకోత్కృష్టస
ద్గుణభూషాయుతమై సుహృద్గళముల న్దాగాడుచుండున్నదా॥ 5

కావున నెంతె సమస్తపురుషార్థరసములుం జిప్పిలుచుండునో అట్టి,

క॥ వీరాద్భుతరసగంభీ
రారంభోదాత్తవస్తుహారిశుభకథా
పూరితమై జగదుత్సవ
నీరద మగునాటకొకటి నిద్వారయిడుటల్॥ 6

(వితర్కించి మందహాసమున) మారిషా ! వింటివా రామాయణ మనుదానిని ?

న:- అదియేమి ?

సూ:- భగవానుఁడును కవిత్వావతరణమున కాదిమోపాధ్యాయుఁడు
నగువాల్మీకిమహాముని యొక్క వాణీనిస్సరణమనుమా! ఇక్ష్వాకుల
కీర్తికాయమది!

న:- నాకేమి.

సూ:- ఆకథకు సంబంధించినదే సభ్యులయాజ్ఞ.

న:- (నవ్వి) ఎల్లకవుల కవితావ్యాపారముల కీవాల్మీకిసుభాషితము
సాధారణమూలధనాంగణమయ్యెఁగదా!

సూ:- మారిషా! ఏమనుచున్నావు!

ఉ॥ అమ్మెయిఁ రాక్షసేంద్రుఁడు మహోర్తి జగత్త్రయి నేడిపించు టిం
కమ్మెయిఁదార్క్ష్యకేతనుఁ డహర్పతివంశమునందుఁ బుట్టు టిం
కమ్మెయి మహాసవాక్కులు స్వయమ్ముగఁ గావ్యరసాప్తి వెల్గుటల్
ముమ్మరమైె సమస్తకవిపుణ్యము లమ్మెయిఁ బండుటేగదా!॥ 7

అందుఁగూడ సదస్యజనాజ్ఞానురూప మగురూపకమునుగూర్చి
యోచించెను. (కొంచెమాగి) (జ్ఞప్తిదొఱకునుల్లాసమున)
మౌద్గల్యగోత్రసంభవుండును మహాకవియు నగుభట్టశ్రీవర్ధమానుని
తనూజుండును తంతుమతీహృదయనందనుండు నగుమురారికృతమగు
నూత్నమైన "అనర్ఘరాఘవ"మను నాటక మొండుకలదు. దానిం
బ్రయోగించుటకు సామాజికులనందఱు శ్వేడుచున్నాను. (యోచించి
సంతసముతో) ఈపరిషత్తు నారాధించుట కెట్టిరమణీయసామగ్రి
సంపత్తుకుదిరినది.

చ॥ తగు రసపాకగీతిగతి దక్షుఁ డొకొక్కఁడె మానటాళి! యె
న్నఁగఁ గవి ముద్గలాన్వయుఁడు నవ్యగభీరరసామృతో త్కిపా
రగుఁడు! గుణోత్తరుండు రఘురాముఁడె నాయకుఁ! డాచరిత్రి ధ
న్యగతిగ దివ్యవాణిని బొనర్చెఁ బ్రచేతసుసూతి దక్షతన్॥ 8

ఎంతమందిచేతనో యెన్నివిధములుగనో రచియింపఁబడిన యీ
పాత్రచేతసకథావస్తువునే యాశ్రోత్రియపుత్త్రుఁడునాటకంబుగనొన
ర్చియు నపరాధి కాఁజాలడు. కనుము:

ఉ॥ ఎందఱో రాముగాథ రచియించిరటంచును వ్రాయమానఁ బృ
ధ్వీం దదమేయదివ్యగుణదీపితు డన్యుఁ డొకండు కల్గెనే!
చెందుదు రెట్లు తద్గుణవిశేషగభీరసుధోక్తిమాధురీ
సుందరవాగ్విరించనులు చొక్కముగాఁ గృతిసార్థకత్వమున్॥ 9

కావునఁ స్వయముగాఁ దనముఖమున నావిర్భవించినసరస్వతిఁ గలయాదిమకవి యగుటవల్ల ప్రాచేతసునివాణి నీకవి యీనాటకము రచింపంబూని యిమ్మెయి వినుతించెడి.

గీ॥ స్వర్గమందుండి పృథివికి నిర్గమించు
వాణి కధ్వశ్రమంబును బాపుకొఱకు
ఎవరు విశ్రామశాఖగా నెసఁగిరనతి
దూరమందా ఋషికి నమస్కార మిడుదు। 10

మఱియు,

గీ॥ నాల్గుత్రోవలు గలిగిన నలువకంఠ
మనెడిచదుకంబున న్విహారణము సల్పు
జాణ, నిత్యప్రగల్భవాచాలయైన
దేవికి సరస్వతికి భక్తి సేవఁ గూర్తు॥ 11

న:-(సంతోషముతో) బావా! బ్రహ్మర్షులగు ముద్గలాన్వయులలో శ్రేష్ఠుండై "బాలవాల్మీకి" బిరుదమును వహించినమురారియొక్క సుధారస బిందువులఁ గురియువాఙ్మయమునకై నామానసమున గుతూహలము గుబ్బతిలుచున్నది ఉపక్రమింపఁబడుగాక!

సూ:-మారిషా! యుక్తమేసుమీ నీయీకుతూహలము!

ఉ॥ అంతమహోజ్జ్వలం బయినదయ్యా! కకుత్థ్సకులంబు, తద్విశా
క్రాంతయశఃపరీమళనిగాఢగభీర మనోహరత్వభా
స్వంతము లౌమురారి నెఱపల్కులో! వల్మికజాతువాక్సుధా
త్యంతనిగూఢరూపసవిధంబున గాబులుకావు టబ్బమే!

(తెరవెనుక - ధ్రువాగానము)

క॥ మొగిడిన తమ్మియొడులలో
దిగులున భ్రమియించునళులఁ దిగుచుమహిమతో

జగమును మేలుకొలుపుదొర
తొగరురుచులు దెసలఁ బెంపుతోఁ బ్రసరించున్॥ (లేక)

గీ॥ ముకుళితాబ్జాంకపాళి సమ్మోహిత మగు
మధుకరంబు నాకర్షించుమహిమ గలిగి
జీవలోక ప్రజాగరస్థితి ఘటించు
దినకరారుణకిరణదీధితులు చెలఁగు॥ 13

సూ:-(ఆలకించి) ఇదియేమి! దశరథు నొడినుండి రామభద్రు లాగికొని కొనిపోవ విశ్వామిత్రుని ప్రవేశమునకై ధ్రువపడుచున్నారే: (ముందుఁబరికించి సంభ్రమముతో) ఆహా! భగవానుఁడగుబ్రహ్మ మానసపుత్త్రుని వసిష్ఠుని యాశ్రమమునుండి తిరిగివచ్చిన ఋత్విజుండగు వామదేవుఁడు వసిష్ఠున యాదేశమును దెల్పుచుండ నదిగో మహారాజగుదశరథుఁడు వినుచున్నాఁడు. వారిమంతనములలో నితరు లుండఁగూడదు. మన మనంతరకరణీయముల నాయత్త పఱతము రమ్మా! (నిష్క్రమము)

ఇది ప్రస్తావనము.



# శ్రీ మదనర్ఘరాఘవము

## — మొదటి యంకము —

రంగము:- సభ (ఆసనముల నాసీనులై దశరథ వామదేవులు)

ద:- ఆహాహా! ఎన్నిమారులో వినియుండియు వసిష్ఠభగవానుల యీ యనుశాసన మెప్పటికప్పుడే క్రొంగ్రొత్తదిగ నన్ను సంతోషపెట్టు చుండును.

గీ॥ అల్లమధుకైటభుల మెదడగుట భూమి
మురిగి గాలినుమాంసంపుముద్దనుమ్ము!
దానిఁ దమకీర్తిసురభిసంతతులఁ బొదివి
యనుభవింతురు భూపు లనాదిగాఁగ॥

(వితర్కయుతమందహాసమున)

గీ॥ ఆనఁ దలదాల్చి ప్రజనేలుటందె ముదిమి
నెరయఁగాఁజేసెఁ జెవులసన్నిధులకురుల,
నైనఁ బసివాని దిద్దెడునట్లు దిద్దు
నన్ను గురుఁడౌర! వాత్సల్య మెన్నదరమె!

వా:- మహారాజా! ఏమంటివి! సమానవృత్తికలవారలఁగూడ నొక్కొక్కని కొక్కొక్కనితోఁ దారామైత్రి యుండుచుండుంగదా! అట్టులే నీయం దమ్మహానుభావునకు,

గీ॥ రఘుకులోద్భవు లగునెల్లరకును గురుఁడె
తా నయినఁ జూచుఁ బక్షపాతమున నిన్ను
అందఱను దన్పుచుండియుఁ జందురుండు
కలువ తనసర్వమని కళోత్కళిక లిడఁడె॥ 3

ద: వామదేవా! ఇంద్రియము లెట్లులాఁగిన నట్లు సంచలించు నాచిత్త సామజమునకు మద్గురూత్తమాదేశము నాలకింపవలయు ననునాశ యంకుశమై నిల్వరించినది వారింకేమి సెలవిచ్చిరి?

వా:-మహారాజా! అంతయు జెప్పితినను కొందును. అయినను, సకల సందేశముల సంగ్రహసార మైనయిద్దానిని మఱిమఱి నీజ్ఞప్తికిం దెమ్మనిరి.

ద:-(ఆదరముతో) అవహితుఁడను వారియాన యేమనిఁ

వా:-

గీ॥ అర్థ మెల్లను నీదుగృహంబునుండి
కోరికలు నిండుగాసమకూరఁ జనుటె
నీదుకులధర్మము స్మృతినీతపంబు
నీహితము నీదుయజ్ఞమ్ము నిశ్చయముగ॥ 4

ద:-(సంతోషమున) గురునానఁ జక్కఁగాఁ దలఁదాల్తును. ఎఱిఁగినదే కదా!

ఉ॥ మాకులకర్తభాస్కరుఁడు మాన్యత నేఁడు సురాగ్రగణ్యుఁడో
ఏకత నేఁడు జన్నముల నేమొనరించుట, పూజ్యభూమి నేఁ
డే కుదురైనభర్తఁగను. టింద్రుఁడో నాబల మేను గొల్వఁ దా
నే కృతినా, నరుంధతి కథీశుఁ డిటుల్లము నేలనేకదా!॥ 5

వా:-ఓ రాజర్షిశేఖరా! అదియట్లేసుమా! పుట్టుటతోడనే యంతులేని యైశ్వర్యవిశేషముగల మీబోంట్లే యిట్టికీర్తికిం దగువారు. మేమో! ఊఱ కుపదేశించు వారమే.

ఉ॥ శారదరాత్రి శాణపటుశాతమున న్బ్బర లూఁడకుండియు
నైరవమిత్రుఁ డక్కలువకాంతల లేపుఁగదా! ద్వితీయపం
కేరుహగర్భుఁ డన్న పెనుకీరితిఁ గాంచువసిష్ఠమానిబ్రం
దారకుప్రజ్ఞఁ జెప్పవలెనా? కలనా? జతనం గొనర్చియున్॥ 6

ఇటుచూడుము!

ఉ॥ యాజుల రైనమీ రనుదినాభ్యుదయంబుల నేఁడుకాంచు టా
రోజుల నిష్టిపూర్తిసగరుండు మహార్ణవకర్తయౌట, గం
గాజనయిత్రి మీపితల గాథయశంపుఁబతాక యౌట, లో
రాజ! త్రిలోకసద్గురుతఁ గ్రాలువసిష్ఠుప్రభావమేకదా!॥ 7

మఱియు నొం డిటువినుము!

గీ॥ ఆన మీరుత్రిశంకుభూజాని కప్పు
డల్ల కౌశికునండ సంధిల్లి కూడ
నిలువఁగానైన యోగ్యత కలుగదయ్యె
స్వర్గమునఁగాని తుదకు నీవసుధఁగాని॥ 8

ప్రతీహారి :-(ప్రవేశించి) మహారాజుగారికి జయము! జయము! భగ।
వాను లగుకౌశికమహర్షులవారు ద్వారముదరి కేతెంచినారు.

ద:-(సంభ్రమముతో) ఎట్లూ! కౌశికభగవానులే!

ప్ర:-అవును మహాప్రభూ!

ద:-ఎవరెవ రక్కడ!

వా:-నేనెదురేగి శ్రౌతవిధిపూర్వకముగ నాతపోధను నిచటికిం దోడ్కొని
వచ్చెద! (నిష్క్రమము)

ద:-(సంతోషముతో)

గీ॥ తపము లనుచిత్రికల క్షత్త్రతనువుఁ జెక్కి-
మలిచి బ్రహ్మర్షి దేహంబు సలుపుకొనుచు
నమలసత్వగుణాగాధుఁ డైనగాధి
పుత్త్రుఁడటె నాగృహాని కిప్పు డరుదెంచె!॥ 9

(వామదేవుఁడు విశ్వామిత్రునితోఁ బ్రవేశము.)

వి:-మిత్రమా! వామదేవా! చెప్పవూ! వసిష్ఠాశ్రమమునుండి నీ
విప్పుడేవచ్చితివా! జ్యోతిస్స్వరూప యగునరుంధతీపతివ్రతతో
మైత్రావరుణుఁడు కుశలియై యున్నాఁడుగదా!

వా:-అడిగెదరా! తనశిష్యులు యాజ్యులు నైనవీరియింటికిఁ దన చిర
కాలమిత్రు లగుకౌశికు లేతెంచుటచే విశేషకుశలముగదా!

వి:-సఖా! వామదేవా! దశరథుని జాతమనునుత్కంఠ చాలకాలము
నుండి యున్న మనోరథములమించి యుండెడిదిసుమా!

వా:-(వినయముతో) భగవానుఁడా! తాముగూడ నింతటియనుగ్రహ
వంతులగుట నీభానువంశసార్వభౌముఁడు నిక్కముగ ధన్యుఁడు.

వి.-మిత్రమా! ఈతఁడెట్లునుధన్యుఁడే.

ఉ॥ చాఁగిలుతోఁడ్ల మహాళిమణిచంద్రిక లొత్తుగఁబర్వ విస్ఫుర
ద్భాగము లైన తచ్చరణపల్లవము ల్భుజసంపదున్నతిన్
బ్రోఁగిడ, నశ్వమేధవనము క్షితురంగఖురాంక చంద్రక
శ్రీ గడియించు మేదినిఁ బ్రసిద్ధముఁ గాఁగద తత్పవిత్రతల్॥ 10

(ముందుఁజూచి, హర్షముతో)

చ॥ గురువిజయంబు నింద్రునకుఁగూర్చఁ ద్రిలోకములాక్రమించుచుబం
ధురసహజప్రతాపగతితో, సకలాసుర భామినీకచా
భరణవిపాటనప్రసభ భావుకదివ్యభుజాఢ్యుఁడో గుణో
ద్ధరు, మనువంశజున్ దశరథు, న్గనఁ గన్నులబెంగ తీఱెఁగా॥ 11

నేస్తుఁడా! వామదేవా! చల్లనినీటికణములు వర్షించుజలదమాలి
కను దూర్పుగాలి యెట్లనంతము లగుచిలువపలువల న్గొల్పునో
అట్లే అమృతబింబుసందోహములజిందుసత్పురుషసంవాదకౌతుకము
నీలోకనాథుఁడు వేయిముఖములుగఁ గొనసాగించుచున్నాఁడోయి!

వా:-విశ్వామిత్రభగవానుఁడా! ముల్లోకములకు సనాతనగురువు లగు
తమ రీమహారాజుపై నిట్టిసదభిప్రాయము గలిగియుంట నిశ్చయ
ముగా నేఁటి కీదిలీపవంశకుశలమనుకల్పవృక్ష మనంతములగు చివు
రులం దొడిగి శోభిల్లుచున్నదనినమాటే, (ఇరువురుం బరిక్రమింతురు)

ద:-(వినయముతోఁ ద్వరగా గద్దియనుండి లేచి యెదురేగి) కౌశికభగ
వానులకైక్ష్వాకుఁ డగునీదశరథుఁ డభివాదన మొనర్చుచున్నాఁడు.

వి:-నీకు నీపరివారములకు స్వస్తియగుఁగాత!

ద:-(వినయమున) విశ్వామిత్రభగవానుఁడా!

చ॥ కలుగదుగా ఉపద్రవము కానలఁ గ్రూరమృగాళిబాధ చేఁ?
దొలఁగరుగా సుర క్రతుమధుద్రవమానక విఘ్నహానిచే?
నెలయదుగా కుతూహలము నిష్టికి నీధర యెల్ల నీవిచే?
భళి! రఘువంశసంభవతపఃపరిపాక మె తెచ్చె మిమ్మిటుల్॥ 12

వి:-(నవ్వి) గీ॥ కడుపుఁ గోఁజల్ల నుంతయున్గదలకుండఁ
బరిజనులతోడ నుంద్రు దిక్పాలురిండ్ల
నట్టినీ యేలుబడి శత్రువనెడిమాట
వీను సోకదు, భయమింక దేన వెలయు॥

అదియునుంగాక.-

ఉ॥ వాసవునారోడకుండుమను పాటి మహాద్భుత బాహుశక్తి నీ
వే సమకూర్ప, విష్ణు, వతివేలము దంబునం బాలకల్లి ది
వ్యాసమసారభోచ్ఛ్వసితమానుచు నుబ్బిడి శేషుపైని మే
ల్వేసి విపంచరక్షణము వీడ్కొని నిద్రిలునట్టు లుండడే!" 14

ద:-(నివ్వెఱనగవున) కౌశికభగవానుఁడా! సర్వజ్ఞులరగుతిమరే యిట్లు నన్నుఁ గొండాడిన నేనేమిచెప్పఁగలను! శత్రుసంఘముల నెను రొక్కను పురందరుసేనాముఖంబు నూఱకపూరించుమాత్రమునకైన నే నొకవేళ ధనువు నించుకయెత్తితినే యనకొనుఁ డంతకే కలిగిన నట్టిజనప్రవాదమును తమరు నిట్లనువదింతురా! అట్టిది మీకును మెచ్చఁగోల్పనా?

వి:-(పరిహాసపుటెలనగవున) నీవటులుగా కెట్లందువులే:

ఉ॥ ఐతివి పూటకాపు భువనావన మూని, సురేంద్రుఁ డందుచేఁ
జేతక్షణాబ్ధభాక్తనువుఁ జేర్పుమిఁ దత్కళ విస్మరించి, నీ
వేతఱిఁ గూర్చుహవ్యముల నెవ్వడు మెక్కుచు వ్రేలఁబాఱు మై
మూఁతలకన్నదోయిఁ దడవున్నదబాటల నేఁడు భూవరా!" 15

వా:-(నవ్వి) మహారాజ! భూతలమహేంద్ర! కౌశికభగవానులు సెలవిచ్చిన దట్లుండ దేవసభలో నేను స్వయముగఁజూచినదింకొకటిటు వినుము!

శా॥ నీవర్చాసన మెక్కఁ గిన్నరవరు ల్నీవీర్యముల్పాడ నా
దేశేశుం డుడుకేచ రానిముదము న్దెప్పించుకొం చెట్లొపై
పై విన్నాణముఁ గన్నులన్ బుడిబుడి న్బాష్పార్ద్రితన్ జూపెఁ గా
దే వేగగ్గురుదేఱునీఱడిభుజం బింతంత తన్నంటఁగన్॥ 16

ద:-(నవ్వుచు) వాము దేవమహాశయా. మీరుఁగూడ భగవానులగు నిగ్గాధినందనుతో నే యేకీభవించినారే! కనుండు!

మ॥ పిడుగు ల్చుట్టు వెలార్చువజ్రము చలద్భిన్నోరుహస్తంబునం
దడలన్ నిప్పుల గ్రక్కుదృగ్వితతు లెం దాగ్నేయబాణస్పృహా
ల్పాడలింపన్ గదనాగ్రభూమిఁ గుమరై భీరేఁపు జంభారిముం
దిడుమై పాఱ కెదుర్చువైరి కలఁడే యీ రేడులోకంబులన్?॥ 17

వి:-(సగౌరవముగా భుజాగ్రమున దట్టుచు) వసిష్ఠశిష్యుఁడవైన యోరాజర్షి శేఖరా!

మ॥ అమరేశుం డిపు డంతరాయరహితం బౌరాజ్యలక్ష్మిన్ ద్వదీ
యమహాబాహులనీడ నిల్చునను గొర్ర్తా? వింతయా! నీయశం
బమరీగండదళాళిపై మకరికల్లాత్రించుమేల్పాళుపా
ల్యము లైత్యాకులు వ్రాసి వర్ణనలచే నార్జించిరే కాదొకో!॥ 18

ద:-భగవానుఁడా! సకలాద్భుతములకు నిధులరై సతమతో ననుసరించుటకు మేమెంతవారము. త్రిశంకుమహారాజునుగీర్తించునుపాఖ్యానము సారము నెఱింగినపౌరాణికు లిట్లు చెప్పుదురు గదా!

ఉ॥ పట్టె దలన్ శరించి ప్రతిభన్ బ్రతిసృష్టిని మీరొనర్ప నె
ట్టెట్టు! మఱొక్కయింద్రుసృజియించునొ యంచుసుధర్మ వేలుపున్
జట్టులు వ్రజి తన్మకుటసన్మణి పుంజనవార్క భానుసం
ఘట్టన మీపదంబు వెలుఁగన్ శరణంబని క్రిమ్మఱింపరే!॥ 19

(సవ్రీ) అదియునుగాక,

మ॥ నిను శాంతింపఁగఁజేయ సర్వసురలు న్వేపర్వుచో నంచ తే
రున మందత్వరఁ జిక్కి నాకమలగర్భుండైన నాఁ డట్టిచో
వినుతి న్మానుటయెట్లు మద్రసన మీవిశ్వాతిగప్రౌఢి' నై
నను బీయూషఝురు ల్పొలార్చుభవదాజ్ఞన్వింట కేవేచెదన్॥ 0

(అంజలింబట్టి) ఓభగవానుడా! దయాతరంగితాంతరంగుఁడవు కమ్మా! పురుషులమనంబు లధికాధికోత్సవంబు లమరుచున్నను దృప్తినొకప్పుడేనిఁగాంచవు కావున నిప్పుడు తమరిందురాకచే సుకరముగ సంభావనాదిగౌరవముల నర్పించుకొనుట కనువగుటచే నామనము సంగీతనర్తకవ్యాపారదర్శనసాభిలాషయై తమయనుగ్రహమున కెదురుచూచుచున్నది.

వి:-ఓయిందుమతీనందనా! నియోగింపవలసినదితర మేమున్నది!

చ॥ పౌర విను శేషు నచ్చ తెలుపుంబస, మంథనగానఁ ద్రిచ్చుపై
న్బ్రఁగ నడిసీముఁ బాల్కడలిఁ బర్వెడిసాంద్రసితాభ పెంపు, చం

దురు బహులశార్థకృత్తశిఖల దోఁచు మహోజ్జ్వలధౌతకాంతియు
ట్లురవగునీయశశ్శవిభల నొప్పఁగ విశ్వము శోభనొందెఁగా !! 21

ఇంక నేమనిన :-

అద్దిర ! పండువెన్నెల యటంచుఁ జకోరవిలాసినీమణు
ల్పద్దుగఁ గ్రోలరాఁ గొఱుకఁ జాలని కీర్తి ప్రభ న్గడింపుమా !
యొద్దిక నీప్రతాపమున కోడి తమంబఱ నాశఁ దేలి మా
పెద్ద దివాకరుం డుఱక వింటఁ జరించుహితంబుఁ గూర్పుమా!॥ 22

ప్రస్తుతమున నాయుధసహితుం డగురామభద్రునిచే సన్నిహిత మగుచున్న మావైతానికప్రితరక్షణమునకై మాయాశ్రమమును సనాథముగ నొనరింపవలయును.

ఉ॥ తా జలరాశి స్వీయజలదానము మేఘముఖానఁ గూర్చు, నీ
రేజహితుండు స్వాభల హరిత్తమమూర్చు ననూరు నిల్పి, య
ట్లే జగ మేలుమీవు స్వపటిష్ఠత మున్నుగ రాముఁనుంచి, యా
యోజయె మిమ్ముఁ బోలినపరోపకృతిద్యుల నైజమౌఁగదా!॥ 23

ఇం కొం డిటు వినుము:-

సీ॥ సాక్షాత్కృతిగ నాకసార్వభౌముఁడు కాంచు
నతివేలముగ నెప్ప డసురవిజయ,
మపుర ! మాత్స్యన్యాయ మనుసరించును వారు
ణీదండనీతి, మానితగుణాఢ్య !
నిత్యానుషక్తమౌ నేకాదె పాతాళ
మందైనఁ బరికింప నహిభయంబు,
మాపుణ్యఫలము సంభవమునా వీరరా
జన్వతి ధర నీదు శాసనమున,
గీ॥ స్వర్గమునఁ బ్రక్కధర నాగవసుధఁగూడఁ
గలయనేకదోషముల నొక్కలవమైన
వఱలకుండ మహాకీర్తి మరఁగి యేలు
దీవు కడుదూర మిటు చెప్ప నేటికయ్య!॥

ద:-(విషాదముతోఁ దనలో) సకలప్రాణిసర్గమూలకుం గలుగుదుఃఖోత్పాదకశల్యముల నిర్మూలించుటయే శీలముగాఁగలయీకౌశిక పాదములనుండి రామభద్రుఁడు ప్రవాసమేగవలయుటచే నాకుఁజిత్త వైకల్యము యెట్లుకలుగఁగలదు?... దానికేమి? ఎల్లరకానందముం గురియుచుండు చంద్రికిరణసమూహముల నేగదా పద్మముల ముకుళింపఁ జేయుకళంకముండుట! (యోజించి) ఏదిదారి?

(ప్రకాశముగ)

మ॥ అదిరా! ఈతఁడు కూర్మరా జనుచు, వ్యాళాధీశుఁడే యంచు మే
ల్కుడు రౌసప్తకులాద్రిసంఘ మని, కన్గో దిగ్గజాహస్తిసం
పద యంచు న్వసుధాభరోద్వహనసామ్యత్వంబునన్ మాకులం
బెదిగించె న్ననునర్థిఁ గాదనుచు నౌనే నేఁటి కానిందకున్॥ 25

వి:-(నవ్వుచు) చూడుము

గీ॥ వాఁడిసూదుల తోలి తోలి బాధయొందు
సంతతము మోయవలయుకష్టం బొకండుఁ
గాదె కుండలములు వీనుఁగవకుఁ గూర్చుఁ
జెంతఁ జెక్కిళు లాసొంపుఁ జెంది కులుక॥ 26

ద:-(వినయాన్వితమగు వెనుబాటుతో) భగవానుఁడా! మీయిట్టిమాన్ననచే మేమతివేలముగ ననుగ్రహింపఁబడితిమి. ఐనను. మాయీకుఱ్ఱఁడు పాల్గొఱుపసివాఁడనియేకాక ధనుర్విద్య నారితేఱనివాఁడని యేమియుఁజెప్పలేనిముగ్ధుఁడ నగుచున్నాను.

వి:-(నవ్వి) సఖుఁడా! మైత్రావరుణి యగువసిష్ఠబ్రహ్మర్షియే పురోహితుఁడుగా నీతఁడు బ్రహ్మచర్యవ్రతానుష్ఠానమున నారితేఱెనుగదా! ఇఁక భృశాశ్వగురూపదిష్టమగు ధనుర్వేదమంతయు నాయధీనము ననే యున్నదాయె!

ద:-(వినయయుతమగు వెనుబాటున)రఘురాజకుమారులయూర్ప్వలేత్వాదధీనములన విలువిద్యాసాంప్రదాయములనుగూర్చి తిరిగి చెప్పవలసినది యేముండును. మాసహస్రకిరణుఁ డగుభానునికులముపైఁ బొడసూపిన పక్షపాతవిశేషముననే భృశాశ్వు సహస్రసంవత్సరము లుపాశ్రయించి దివ్యాస్త్రరహస్యముల నేర్చితిరనినమాట!

వి:-నీయవిశ్వాసమును మాన్పుము రాజర్షీ! రాముఁడు కేవలముఁ బసివాఁడని తలంపకుము. ఆకసమందలి సూర్యుఁడు మన కతిసూక్ష్మరూపిగ గనిపించుఁగదా! ఆయనప్రకాశమో! భూమిని రోదసిని మలయుచీఁకటుల నిట్టె చిమ్మివైచుట లేదా!

ద:-(నవ్వి) ఓభగవానుఁడా! కౌశికవంశకేతువు లగుమీయంతవారె కోరిన నెట్టినీచముగువాచాలునకైన హీనోత్తరము నీయమనస్కరించునా! (చేయిముఖమునకడ్డముంచి) వామదేవమహాశయా! భగవాను లగుకౌశికు లిట్లనుచున్నారే!

వా:-ఓరాజర్షి చంద్రమా! ఇందుమేము చెప్పవలసినది యేమున్నది!

గీ॥ అర్థికౌశికులఁట! దాతయంట తమరె
గొప్పక్రతువంట! రక్షణ స్తోరునంట!
రామభద్రుఁడె తద్యాగరక్షకైన
నిందుసమ్మతి మే మియ్యకుండఁ గలమె! 27

అదియునుగాక :-

క॥ అడిగినది నిండుగాఁజత
పడ నర్థిముఖంబుఁ బొంగిపఱచుముదము నే
ర్పడఁ జూచుటేకదా శ్రీమఁ
మడచున్ భూభారఖిన్ను లగుమీబోంట్లన్॥

ఇంకొక విశేషమిందుఁ గలదు :-

గీ॥ కులగురుండు వసిష్ఠుఁ డెక్కుడుగ నీకు
యాచకులవాంఛల స్దీర్ప నాన నిడఁడె!
తన సమాధి నియ్యఖిలంబుఁ గనియెయేమొ
తెలిపె నారికి నీ కుపదేశవిధిగ॥ 29

ద:-అది యట్లలకాదు-

క॥ ఈకాలం బీ దేశముఁ
నా కన్నిట ధ్యానదృష్టి నడపఁగలుగు ని
ష్ఠాకలితులు తలఁచినచో
నేకథలు న్గనులయెదుట నే యగుపడుగా॥ 30

(విమర్శతోఁ దనలో)

ఉ॥ పంపనె చూడు రాముఁ గ్రతుపాలనకై యపు డేమియాఁ గడున్
దెంపున నిమ్మహామహుఁడు దిగ్గన నింటికిఁ జేరుకొంచు లే
శంపుదపోవ్యయంబుననె చక్కఁగ విఘ్నము లార్పి పూనికన్
నింపుకొనున్నదా! ఇఁకను నిల్చునె మత్కులకీర్తి సుంతయున్॥ 31

(విశ్వామిత్రునితోఁ బ్రకాశముగ) త్రైలోక్యగురుండ వగు నో భగవానుఁడా!

గీ॥ యజ్ఞదీక్షఁ గొనఁగ నాయతులై మీరు
నాకుమారు రాము నన్న యడుగ
సీధరాపురంధ్రి యెపుడుఁ బతివ్రతా
నియతి మాయెడ న్గణించునటులె॥ 32

(తెరవైపు చూచి) ఎవ రెవ రక్కడ! (దౌవారికుఁడు ప్రవేశించి) మహాప్రభూ! ఏమి సెలవు!

ద:-రామభద్రునిం బిలువుము వా॥ లక్ష్మణకుమారుఁగూడ

వి:-(నవ్వి) ఈతనింగూడ నిట్లు వేఱుగ నిర్దేశింపనక్కఱ లేదు. వెన్నెలనెందోవదలి చంద్రుఁ డుదయింపఁడుగదా!

(ద్వారపాలుండు నిష్క్రమింప రామలక్ష్మణుల ప్రవేశము)

రా:-(హర్ష జనితమందహాసమున)

చ॥ పలుకుఁ బురాణము ల్మఘువుపై గినుకన్ బ్రతిసృష్టిఁ బూని బ్ర
హ్మల నొకయేడ్వుర న్సలిపి, అంతనె శాంతిలి, సృష్టికర్తలై
విలసిలువారి నయ్యనలవీథికి వెల్వల నిల్పెనంచు, న
య్యలఘుయశఃప్రభావఘనుఁ డౌ మహనీయుఁ డితండె లక్ష్మణా॥

ఆయీ భగవానులను స్వయముగా నెట్లుపచరింపఁ గలమో గదా? (పరికించి ముందుఁ జూచి సంతోషమున) వినయవినమితులై యున్న వామదేవులకు నాన్నగారికి దాఁపుగాఁ బ్రశాంతపావనమూర్తిమంతులై యున్నమూఁడవవారే భగవాను లగువిశ్వామిత్రులై యుందురు.

ల:-(ఆశ్చర్యస్మితంబున) ఆర్యా!-

మ॥ ఇతఁడా! ఈతఁడ! నమ్మ చేరఁదగు నెంతేసాధుసద్విగ్రహుం
డతిరోషంబున నాఁడు ముజ్జగము లూటాడించె భీఁగొల్పి? సం

గతమే కాఁదగుఁ, జల్లనౌమ్మృదుమనోజ్ఞశ్రీల జ్యోతిష్మతీ
లతలున్ జీఁకటిరా హతాద్గతిగ జ్వాల ల్గ్రిక్కుచుండుంగదా॥ 4.

రా:-తమ్ముఁడ! లక్ష్మణా! తెలిసికొన నలవికానిగంభీరచరిత్రములు గలమహామహు లిట్టులే చిత్రముల కాకరములగుచుందురు.

ఉ॥ వీరితపంబును స్త్రైణమువేడుక నచ్చర లేగుదేఁజన
వ్వారలపై జగంబువయిఁ బర్వఁగ యీఘను రోషధూమితీ
వ్రారభటుల్ సహింపఁ జాలకయుండిన, సర్వసురాళివాళిన
ద్ధారుకిరీటరోచులు పదోపనతంబులుగామి నండ్రుగా॥ 35

వా:(చూచిహర్షముతో) వీఁడుగో రామభద్రుఁడు రానేవచ్చె (విశ్వామిత్రునితో) భగవానుఁడా!

ఆ॥ బ్రహ్మతేజయొక్క పరిణామ మిట నాల్గు
సలుపుఋశ్యశృంగు చరువులందు
నాదిమాంశ మౌమహాభుజుం డరుదెంచె
నయ్య! ప్రీతిమీఱ నరయుమయ్య!॥ 36

వి:-(హర్షసంభ్రమములతోఁ జూచి) వామదేవా! ఏమంటివి! ఋశ్యశృంగుఁడనియా? ఆహా! వనవాసు లందఱిలో సీతని బ్రహ్మణ్యము కడుంగడు దొడ్డదిసుమా! ఈమహామహునిమూలమున బ్రహ్మర్షి యగువిభాండకుఁడు పుత్త్రవంతుఁ డగుటయుండ నీదశరథుఁడుగూడఁ దత్కీర్తికిం దావలుండయ్యెఁగదా!

వా:-భగవానుఁడా! అదివాస్తవమే.

వి:-(వామదేవునితో)

చ॥ మనుకులజాతులై గురుని మాన్యుఁ బురోహితుఁ జేసి వైనయి
క్యనిఖలకర్మపాళి వెలయంగ భవాదృశుల న్వరించి, మం
తును గొను రాజుల న్దశరథుం డెనుమీఱెఁగదా! ఋషి ఋశ్యశృం
గుని సుతవత్పరిదీప్తినిఁ గోల్కొనుగా రఘువంశ సంపదల॥ 37

(రామలక్ష్మణులు సమీపింతురు)

వా:-వత్సలారా! సమస్తభువనములకు మహనీయుఁడు భగవానుఁడు నైనయిమ్మునిసత్తమునకు నమస్కరింపుఁడు!

రా॥ల:-విశ్వామిత్రభగవానులకు సూర్యకులజు లగురామలక్ష్మణు లిదే యభివాదనము నొనర్చుచున్నారు.

వి:-బాలకులారా! మీ రాయుష్మంతులరగుదురుగాత! (రామునిభుజములు చేతులంబట్టి సగౌరవముగఁ జూచి తనలో)

శా॥ తాత్రైశ్రీకుచకుంభసీమ నిలుప, న్నారాడుము త్తేభ మీ
నాఁ డీయింటను రాముతో నలువ్రర్తై నర్తింపఁ జేకూరుటన్
నాఁడు న్నాఁడు వసిష్ఠుఁడే వినుచుమంత్రప్రౌఢి యిక్ష్వాకులన్
న్నేఁడేగా భువనాళి కభ్యుదయము న్జైకూర్చునాఁడెం బిడెన్॥ 38

అదియునుంగాక :-

శా॥ ఆయాబుక్ద శకస్మృతిం గొనిన దీవౌదయ్య! నీప్రీతి కే
కా యజ్వాల్తనలో హవిస్సు నిడ నాహారించుఁ దేత్రాగ్ని గ
ర్వాయత్తాత్ముల రావణాదులను ద్రోపాడంగదా శేషశా
యీ! యెత్తించిరి జన్మమిందు నిను బ్రహ్మేంద్రు ల్బదా
త్రాంతులై॥ 39

శ:-(నవ్వుచు) బాలకులారా! ఈమహామహుఁడు మిమ్మిద్దఱం గొంపోవుటకే విచ్చేసినాఁడు.

రా॥ల:-తమకుఁ దండ్రిగారి కెట్లునమ్మతమో అట్లులే.

ద:-(ప్రేమతో నిరువురం జేరఁదీసికొని) కౌశిక...(అర్థోక్తిలో శోకమున మూసికొను గొంతుతో వామదేవుంజూచును)

వా:-(విశ్వామిత్రునితో) ఈరామలక్ష్మణులు తమకర్పింపఁబడుచున్నారు.

వి:-(ఆదరముతో జేరఁదీసికొనును.) (తెరలో)

వైతాళికుఁడు:-మహారాజులకు మధ్యాహ్నసంధ్య సుఖమునిచ్చుఁగాత!

గీ॥ ఇనునియెండ లెల్లెడ వెల్ల మనుజునీడ
మెట్టతాఁ బేలన న్బొట్టిపొట్టి దయ్యె
కరిముఖోద్గీర్ణ వారిశీకరహిమాతి
శీతలస్నిగ్ధకచ్చము ల్చేరె లేండ్లు॥ 40

మఱియు,

చ॥ వలికెడి యక్షరాక్షరము భవ్యసుధ స్గురియంగఁ గోరలన్
వెలయువిషంబఱన్ మిగుల వెల్గుఫణంబులభోగిరాట్సుతల్

వలచి పటీరకోటరములన్ భవదీయగుణాళిఁ బాడుఁ గం
చెలల వినిర్గమించి పరిస్వేదమునా త్రివేకహర్షమీరఁగన్॥ 41

వి:-(విని) మిత్రమా! దశరథా! వైతాళికుఁడు మనోహరమైనసత్యమునే పలికినాఁడుసుమా!

మ॥ మణిభారాన ఫణంబు లించుక చలింపన్ దూఁగుచున్. సమ్మదో
ల్బణజస్వేదము కంచుకాంతరమునుబ్బన్సర్వుచుండ, స్వభ
ద్గుణము ల్పాడుచునుండు, వార్థితటసద్గోత్రిస్థలీభోగినీ
మణులున్ నాల్కలరెంట వర్ణములనువ్యక్తంబులై సొంపిడన్ ॥42

ద:-(వినయావైలక్ష్యస్మితమున దలవంచి యుండును).

వి:-రాజర్షి! దీక్షఁ జేకొను వేళ సమీపించుచున్నది ఇంతటియానందమును బుట్టించునీసంభాషణమును మొదట నేనేనిలుపవలసినవాఁడనగుచున్నాను.

ద:-(రామలక్ష్మణులం జూచి కన్నీరు తొరఁగుకాడు నేత్రములతో విశ్వామిత్రునితో) భగవ్ (అర్థోక్తిలో గాద్గద్యముచే నాఁగును)

వా:-(సంభ్రమముతో) కౌశికభగవానుఁడా! తాము వేంచేయుఁడు. తమకు రామలక్ష్మణులకు మార్గములు సుకరశ్రీప్రాపకములగుఁగాత!

వి:-మీరెల్ల రిఁక నిలువుఁడు (రా॥ల॥తో) విశ్వామిత్రుఁడు నిష్క్రమించును.)

ద:-(వేడినిట్టూర్పున) వామదేవమహాశయా! మనయందువలెనే అకారణవత్సలుం డగునీకౌశికులయందుఁగూడ మనవాఁడు తనపై బ్రేమను బుట్టించుకొనఁగలఁడా!

కం॥ మన యీయెడబాటున దా
మునుఁగుచు దుఃఖమున దుఃఖము నె మునికిడునో!
కనుచు నపూర్వవిషయముల
మునుఁగుచు సౌఖ్యమున సౌఖ్యము నె ముని కిడునో?॥ 43

వా:-(నవ్వి) రాజర్షి! రాముని మధురతకు మనమని విశ్వామిత్రుఁడని తారతమ్యముండునా! ఎంతమాట!

మ॥ తనయుం డే జనియించెఁ జంద్రుఁ డనుబంధం బుంట సంద్రంబు చం
ద్రుని వృద్ధిక్షయపూర్తిఁ దాను గనుచుండున్ బోటు నా, కేల వి
ప్పను మోడ్ప న్ననుఁగల్వ యిందునుదయంబు న్గ్రుంకు సంధిల్ల? నెం
దును శుద్ధుల్ తమలో నకారణపు బంధు ల్సుమ్ము పేర్మోన్నతిన్

దః-(విమర్శించి) అది యట్టిదే

గీ॥ ఆత్మజనకుండె సుమ్ము రత్నాకరుండు
అమృతకౌస్తుభపారిజాతములతోడఁ
గలిగినవె గొప్పవే, యైన వలపదేమొ!
తాను జాబిల్లి కుముదబాంధవుఁడెయయ్యె॥ 45

(ముందుఁజూచి) రామలక్ష్ములును కౌశికభగవానులు నప్పుడే కను మరుగైరే! ఇఁక మనము కుమారప్రవాసదుఃఖహత యగుచుండు పట్టపుదేవిని దక్షిణకోసలేశపుత్రి నోదార్పవెళ్ళుదము. (ఎల్లరు నిష్క్రమింతురు)

ఇది మొదటి యంకము



# శ్రీ మదనర్ఘరాఘవము

రెండవయంకము - మిశ్రవిష్కంభము

రంగము — తపోవనము - [పత్రి-దర్భలతో విశ్వామిత్రశిష్యుఁడు శునశ్శేపుఁడు]

శు:- (ముందుఁజూచి) ఇంక రాత్రి తెల్లవారఁబోవుచున్నట్లేనా !

ఉ॥ పండినచంద్రబింబసుధ పైకొని చీఁకటి సూర్యకాంతము
ల్మండఁగ ముందు లేపుపాగమాదిరి దిక్కుల రేగెఁ బద్మినీ
మండలహృత్తప్పటి న్గలఁచుమాధుకరాఖ్యశిలాళి నెల్ల మా
ర్తాండుఁడు నూదియంటుశిలరాణ వెలార్పఁగఁబూనఁడింతకున్॥

మఱియు

శా॥ తార ల్పక్వఫలాంశుభవ్యకళ నుద్భాసిల్లెడి న్మింట నం
కూరంబౌ నలినీహృదాషధరుచు ల్కొంచెంబుగాఁదూర్పునన్
సారం బంతరితంబుగాఁగ శశియు న్నాలీని గూఁడట్టులై
జాఱుబ్బన్ బడి పశ్చిమాద్రిఁ గఱచెన్ జ్యావీథికి న్దూరుఁడై॥

(అన్నివైపుల న్జూచి)

శా॥ ఆశామాళికిరీటరత్నరుచిసామ్యాభన్ ఖరాంశుండు పూ
ర్వాశాగర్భబహిర్గతుం డగుటలే, దట్లయ్యు, నాయాసరో
దేశంబు ల్సరసంబులౌఁ గుశలసుప్తి న్గాంచితే యంచు వా
చాశంఖారవ మూనుబంభరములన్ జక్రాంగసంఘంబులన్॥

మఱియు:

ఉ॥ ప్రాచివిలాసభూష యగుపద్మము తొమ్మిదిరేకులం దదే
తోఁచెను రెండొ మూఁడొ యన ద్యోపథిఁ బర్వె నవార్కరోచులన్
గోచరమైనవిప్పనకె గుబ్బతిలన్గుతుకంబు, తుమ్మెద
ల్దాఁచి చెఱ ల్తొలంగుత్వరఁ దద్దయు విచ్చె సరోజకోశముల్॥ 4

అదియుంగాక :-

చ॥ వెనుకటిమాపు సూర్యు వెయివెల్గులతోఁ దనరేకు లొండు రెం
డును మఱి మూఁడు నాల్గని ముడుంచుటఁగాఁదగు నేఁడు తమ్మి య

య్యానకిరణోదయక్రమమునునే సరిపోల్చనో తా నొకొక్క గే
హనై విడఁబర్చుచున్న దదిగో! యతఁడే. ఇతఁడంట తేలఁగన్॥

ఇంక నేమనిన :—

చ॥ అటఁ గలవేల్పు లేన్గు శిరమందలి చందిరమొందఁ బ్రొద్దిశా
తటమున సాంద్రతారుణతఁ దాల్చు ఖరాంశుమరీచిరేణు వు
త్కటరవివిగ్రహం బులులఁ దద్దయుఁ ద్వష్ట తనూకరింపఁ జె
క్కు లెగయు నెఱ్ఱవువ్వ పెనుగూఁడయి సూర్యునిఁజుట్టి వెల్గెడిన్॥

(ముందుఁజూచి) పొడుపుకొండంతలమానిక మగుదినకరమండల మిప్పటికిఁగూడ వినువీధి నలంకరింపరాదయ్యె విపులతరముగ యజ్ఞముసొనర్చుచున్న మాగురువులగు కౌశికభగవానుల యాజ్ఞచేఁ బొదలకడనే సమిధలకై యిట కరుదెంచితింగదా! ఇఁకనా పన్కై ప్రవర్తింతును. (పరిక్రమించును)

(భయముతో వెనుకకుఁజూచుచు నొకవటుఁడు ప్రవేశించును.)

వ:-అయ్యా! శునశ్శేపుఁడుగారూ! అట నేదో అద్భుతం భయంకరం జరుగుతున్నది!

శు.-(చమత్కారముగఁ జుట్టివచ్చి) చెలికాఁడా! పశుపాలా! ఏమిటోయ్ ఆ ఆశ్చర్యం భయంకరం?

వ:-ఎవరో రాముఁడనే రాకుమారుఁ డొచ్చాఁడని విని కుతూహలంతో చూడ్డానికి పఱుఁగెత్తే నాముందఱకు తపోవనందగ్గఱ పాతుకొని పోయినరాతిబొమ్మ మనిషై గబగబా యెదురుగ్గా లగెత్తింది. అది చూస్తూనే పైగుడ్డ పడిపోయిందికూడా యెఱుక్కుండా పలాయనమై వచ్చా.

శు:-(నవ్వి) మిత్రమా! మంచిపనే. నీవదృష్టవంతుఁడవు గనుకనే తిరిగి రాఁగలిగితివి.

వ:-ఆరక్కసినుండి నన్నెట్లా రక్షిస్తావో బాబూ! (వణఁకుచుఁ గాళ్ళపైఁ బడును.)

శు:-(నవ్వుచూ) (లేవఁదీసి కౌఁగిలించుకొని) నెచ్చెలీ! ఉచథ్యుని పుత్త్రుఁడగుగౌతమభగవానుని కీయహల్య భార్య, విన్నావా?

వ:-విన్నా! విన్నా! జనకవంశపురోహితులగు శతానందులంతటివాళ్లే గాదూ!
ఆఁ! అయితే?

శు:-ఆమె పూర్వము పురుహూతుముఖంబున దోషియగుటచే దీర్ఘతపస్వియగు నమ్మునికోపముచే నాఁప్రాఁజ్ఞమాలికకుఁ దగినట్లుగ నిరింద్రియయై కల్పము నిట్లురాయియై యనుభవించి యిప్పు డీరఘురాజకుమారుని తేజముచే నయ్యంధకారమునుండి తప్పించుకొనినది. తెలిసెనా? ఇఁక భయమెందులకు?

వ:-అమ్మయ్య! ఆర్యులంగుతమదయావిశేషాన్న తిరిగి నేను మనుజుల్లో పడ్డట్లైంది! అయినా అనుమానపిశాచం నన్నింకా వదల్టంలే! ఒక్క ముహూర్తమిక్కడ విశ్రమిద్దాం!

శు:-బ్రాహ్మణులము గనుక భయము సహజమేలే. నిబ్బరించుకొనుము (కూర్చుందురు)

వ:-(తడవుయోజించి యాశ్చర్యముతో) అమ్మయ్యో! విషయసుఖాలనే యెండమావులహడావుడిలో భగవానులైన దేవేంద్రుఁడుగూడ లేకిపిల్లైపోయినాఁడంటే!

శు:-మిత్రమా! బాగుగఁజెప్పినావు ఈలోకులు మిక్కిలియల్పులే సుమా! ఐహికసుఖములు మరిగిన వీరిచే రాత్రు లెట్లు వ్యర్థములు చేయఁబడుచున్నై! నేత్రద్వయమాత్రులయ్యు నీమానవగజముల మనస్సు నాకర్షించుకొని వెంటఁదవులంజేసికొను విషయానుభవములకు లొంగి వివేకమనునంకుశమున కుత్సుకులుగారనినచో వేయినేత్రములుకలిగియుత్కృష్టభోగపతియగు దేవేంద్రునసందున్నదా! కన్నులకుఁ బండు వెపుడుదయించునో కామవలపులకుఁ దలఁపులప్పుడే బలుపులగుచుండును.

వ:-(నవ్వి) రామభద్రుని యీపవిత్రవాసంతముని పత్ని పుణ్యపరిపాకమల్లేనే వుంది,

శు:-అదియొక్క కారణము.

వ:-ఇంకోటుందేం? చెప్పరూ! విన్నాల్నుందికుతూహలం!

శు:-సఖుఁడా! నీకుఁ జెప్పఁగూడని దేమియున్నది! కిష్కింధలో నింద్రునికుమారుఁ డగు వాలియను వానరనాయకుఁ డొకఁడున్నాఁడు. వానికి రాక్షసచక్రవర్తియైన దశకంఠునకుఁ బెరుగుచున్న స్నేహముఁ జూచి క్రోఁతులకు నెలుఁగులకుఁ గోలాంగూలములకు నాచార్యుఁ డగుజాంబవంతుఁ డందఱమంత్రులయనుమతితో నవ్వాలిప్రోల నిట్లనియె

స:-(నవ్వి) ఓహో! ఏమన్నాఁడో!

శు:-ఓరాజా! రాక్షసజాతి అసలే మాయలమారిజాతి, అందులో నీ రావణుఁడు వంచనచే నింద్రుజయించి యవక్రపరాక్రముఁడుగా నిగుడుచున్నాఁడు. కావున, నీ కతఁడు పితృవైరికూడ. మఱొండే మనిన, నీచంకలనిఱికింపఁబడి యభిభూతి నొందినవాఁడు. నమ్మఁ దగనివాఁ డనియే మాయెల్లర నమ్మకము, అదియునుంగాక, మన కేమేనాపద సంభవింప వెంటనే సాయపడగలవాఁడా యనినవానికి మనకు నడుమ పెద్దసముద్రమే యున్నది. ఈకారణములచేత పులస్త్యబ్రహ్మపుత్త్రుఁడైనను రావణునితో మైత్రి మన కుపకారశూన్యమైనదే హరిణాంక శేఖరుఁడే యిందులకు నిదర్శనము.

గీ॥ ఆపులస్త్యసుతుండె ధనాధినాథుఁ
డెపుడుఁ జెలియై యొకింటనే యెసఁగు, నైన
దిప్రురజేత మైపూత బూది కయిసేత
యేన్గుతోల్, బున్కపే, రెద్దెయెక్కిరింత ! 7

స:-బలే! ముసలివాఁడైనా భల్లూకరాజు మంచిమాటకారి! నేర్పఱి! హాస్యగాడుగూడా నే. ఆపైని ?

శు:-ఆపైననా! నీవ్యాసమంతయు ముసలిసోదె యని వాలి నిరాకరించుటచే రహస్యముగా జాంబవంతుని యనుజ్ఞతో మహామాత్యుఁ డైన కేసరిపుత్త్రుఁడగు హనుమంతుఁడు సుగ్రీవకుమారు నెత్తుకొని ఋష్యమూక పర్వతదుర్గమునఁ బ్రవేశించినాఁడు.

స:-(సాభిప్రాయముగ) మారుతి యంటే, త్రైలోక్యమల్లుఁడని పేరొందినవాఁడే కాదూ ?

శు:-అవు నతఁడే.

ప:-(విచికిత్సతో) ఎంత చెప్పినా యెట్లాంటివాఁడైనా స్వామి స్వామే! వానికి వ్యతిరేకులవడం మంచిదనిపించుకుంటుందా?

శు:-(నవ్వి) మిత్రమా! ఈ ఆంజనేయుఁడు భగవంతుఁడగు సహస్రకిరణు దగ్గఱ మును పెన్నఁడో వ్యాకరణము నభ్యసించిననాఁడే యా సూర్యునకు వానరయోనిసంజాతుఁ డగు సుగ్రీవునకు సాయమొనర్చుటయే గురుదక్షిణగ నిర్ణయించుకొని యుండె.

ప: ఓహో! అదా సంగతి? గురుపుత్త్రునికిగాని తోటివిద్యార్థిగాని తోడునీడగు టుచితమేగా. పిదప?

శు:-గ్రహకల్లోలములచేఁ దనమిత్త్రుఁ డగు వాలిరాజ్యము జర్ఘరితస్థితిలోనికి వచ్చుచున్నదని గ్రహించి రాక్షసరాజైన రావణుఁడు తనము ఖ్యామంత్త్రులగు ఖరదూషణత్రిశిరులను చతురంగబలసమన్వితముగ సముద్రమును త్తరపుగట్టున వాలికి సాయపడుటకై నిలిపియున్నాఁడు.

ప:-బలే! అవడానికి రాక్షసుఁడైనా మిత్త్రధర్మాన్ని వదిలాఁడుగాఁడే!

శు.-మిత్త్రమా! ఏమి చెప్పను! వాఁడెవరనుకొంటివో! రావణుఁడునుమా!

ఉ॥ ఏరికొ తృప్తిసేఁగలుగులే యని మేన్బులకించు కౌతుక
శ్రీ రహిఁ దొమ్మిదింటి నటుత్రెంపిన, న ల్లతిదీప్తిఁ బుట్టఁగా
నారసి చిన్నఁబోవుపది యౌతలఁ బొల్చిన సింహళేశువ్యా
పారవిలక్షణత్వ మది నికెచెల్లు జగద్విచిత్త్రమై॥

ప:-అబ్బో! అట్లాగా! తరువాత! తరువాత!

శు:.సుకేశుఁ డనురక్కసుని పుత్త్రికయు వేయిమదపుటేన్గుల బలముగలదియు నగు తాటక యనురక్కసి యమ్మోకనుండి వచ్చి మనుష్యులుండుభూములతో విహరింపవలయునను కుతూహలముచే మన పరిసరములనే నివసించుచున్నది.

ప:-అమ్మయ్యో! వేయేన్గులబలమే! అందుల్లో ఆడదే! యెప్పుడు వినని కననిసంతే! పైన?

శు:-తదుపరి శ్రౌతవిధుల కీరక్కసిమూలమున విఘ్నమగునేమోయని భగవానులకుశలపతు లీరామలక్ష్మణులను గొనివచ్చిరి.

ప:-రక్కసుల నుక్కడంచడానికే రామభద్రుఁ డను పేరుతో నీతఁడవతరించాఁ డనుకుంటా!

శు:-అవునోయిసఖా! నీ వనిన దే సత్యము. రామభద్రుఁడన రాక్షస శిక్షకైన నాల్గక్షరముల సిద్ధమంత్ర మనవలసిన దే! అదియునుంగాక మరొకవిశేష మేమనఁగాఁ గౌశికభగవానులచే బ్రహ్మవర్చస్సాదృశ వివర్తదివ్యాస్త్రపారాయణ మత్యాశ్చర్యకరముగాఁ జేయింపఁ బడియెఁగదా!

ప:-మంత్రమయము లైన యస్త్రదేవతలతో సహా బలాతిబల లనే శక్తులుకూడా రామభద్రునందు సంక్రమించినవటగా?

శు:-మరేమి. అదియుం జరిగినదాయె.

ప:-అయితే! అన్నీసరేగాని నాకు తెలియకడుగుతా! శక్తేమో తనదేనాయె. అస్త్రవిద్యా తనదేనాయె. అటువంటప్పుడు, తన క్రతువిఘ్నాల నడఁచడానికి కౌశికభగవాను లీరామభద్రున కాధిక్యతను గూర్చుచున్నాఁడేమో అని (నవ్వి) నాకుఁ జూడ అతిథిచేతి పాముంజంపించేచందంగావుం దిదంతా.

శు:-సఖుఁడా! ఇంత తెలియనివాఁడ వైతివేమోయ్! గురువులు తమంతటఁ బ్రయోగించి కనుకీర్తికంటెఁ శిష్యులచేఁ బ్రయోగింపఁజేయుటచే విశేషయశస్సు నొందుచుందురుగదా ఇటువినుము :-

మ॥ ఉపదేశించినవిద్యఁ బ్రౌఢులయి శిష్యుల్ పెక్కుచందాల ని
క్కపుఁగీర్తి న్బలుచోఁ గనన్ గురుగుణోత్కర్షంబు మెండౌను దా
నుపయోగించిన యబ్ధినీర్మొయిలు వర్షోద్యోగతన్ శుక్తివా
రపుటి న్జిల్కుటఁగాదె వార్ధి యలరున్ రత్నాకరంబై భువిన్॥ 9

ప:-ఆర్యా! అన్నింటికీ తగినట్లే చెప్పారు కాని ఒక్కసందేహముంది.

శు: ఏమిటోయ్ అది?

ప:-అన్నివిధాలా అతిగోప్యమైన వానరరాజనీతి తమకెట్లా తెలిసిందో?

శు:-దివ్యదృష్టిచే సకలభువనవృత్తాంతము లెఱుంగఁగలవిశ్వామిత్రతాతపాదు లయోధ్యదారిలో సెలవిచ్చిన వింటినోయీ! (అంతటఁజూచి) ఓహో! ఏమి యీప్రభాతసమయమునందలి త్రిభువనలక్ష్మి!

ఉ॥ అప్పటి కస్తు పూర్వమును లర్చులఁ గొల్పి నివాళులెత్తఁగా
నొప్పెడెఁ బశ్చిమాగరుచు లొల్కు-న వారిక్క-కరాళి తూర్పునన్
గప్పగుకారుచీకటి వికారపుహాసము నీడసాకుతోఁ
జప్పనఁ జారిచె న్భువనసర్పము క్షాళనఁ గోరకింతయున్॥ 10

మఱియు:-

మ॥ కనుపార న్నిశఁ గ్రోలియున్నతిమిరౌఘమౌఘస్పృష్టి స్ఫడా
దుడి నీ నీరజకుట్మలంబు లనుశక్తు ల్నీలముక్తాళిగా
వెడలన్జేసెడినాఁగఁ దుమ్మెదలు వెన్వెంట న్జెఱల్మాయ వె
ల్వాపెడిన్ బారులుగట్టితమ్మిమొగడల్వ్యాకోచము ల్పొందఁగన్

ఆహా!

క॥ ఇది విరిసి మొగ్గ విచ్చెడు
నది, యిది నూత్నముగ విరియునది యని పోల్పన్
గుదుర, దదర!, మూఁగెడి తు
మ్మెదకదపులఁగాక శక్యమే యెఱుఁగంగన్॥ 12

(పైకి జూచి సూర్యునభివర్ణించి)

చ॥ కటువులెయయ్యెఁ జక్కవల కామకఠోరతరాగ్ని నెల్ల మా
న్పుట కురుశీతవీర్యమున శోభనము ల్పనుకూర్పఁజాలి, మి
క్కుటమయి మూఁగునాతిమిరముష్కరతనీఁడి, లోకనేత్రసం
పుటములు తేఱఁగాఁ బ్రభవముల్గొని వేఁడి వెలుఁగు లుబ్బఁగా॥

కావున, నింకఁ జిదుగులందే నన్నుఁ బోనిచ్చెదవా!

వ:-వాగ్దూహా నారాజకుమారుల్ను చూడాల్న నేముచ్చట మిక్కుట
మౌతున్నది. వారెక్కడవుపడతారో నాకు?

శ:-(నవ్వి) యజ్ఞశాలకు నుత్తరమున నున్నవిహారభూమియందునిశ్చయ
ముగఁ గ్రీడించుచుందురు. తనివితీఱ యథేచ్ఛగాఁ జూచిరమ్ము

(ఇరువురు నిష్క్రమింతురు) ఇదిమిశ్రవిష్కంభము

(రామలక్ష్మణుల ప్రవేశము విశ్వామిత్రాశ్రమపరిసరములలో)

రా:-భగవానులగుగాధినందనుల 'సిద్ధాశ్రమ' మనుపేరుగల యీని
వాస మత్యంతవిచిత్రమునుమా! గమనింపుము.

చ॥ ప్రతిదిన మెప్పు చొప్పు గొనిరా శ్రమఁ బుట్టిన శ్వాసమూని "వ
త్సతరి! ఇఁకైతి మేధ్య" వని తార్ణ్యటువు ల్విశసింతు రల్ల దే!
యతిథులు ప్రాశనాశ లెగయ న్వారిఁ బిల్వఁగఁ దూర్పుగాలితోఁ
బ్రతనుత నొందసాగె మధుపర్కసుపాకమనోజ్ఞ వాసనల్॥ 14

ల:-ఆరఁ

గీ॥ నల్లతొగయుఁ గింజల్కంబు నాఁ దనర్చు
వెడఁదరొమ్ము గొస్తుభమును వెలసెడిహరి
కపటవామనుఁ డగుచు నిక్కడ నెగాదె
వలచి దేవిశో బ్టుతపం ంొనర్చె॥ 15

గీ॥ అట్టియీమహాతీర్థమధ్యమునఁ జేరి
యెట్టిభయ మేరిభయము మాకేమి యనుచు
గట్టినమ్మికతో ద్విజాగ్రణులు కనుమ!
యెటులు షట్కర్మములఁ జరియించువారొ!॥ 16

(మఱియొకవైపుఁ జూచి)

చ॥ అవె పశుబంధవేదివలయంబు లుదుంబరదంతురంబులై
హవణిలు, గృహ్యతంత్రవిధు లన్వహము న్జరుగన్ గృహస్థు లిం
డ్ల వెలయు సొంపు యాగశిఖలన్ గృహమేధులు మాటిమాటికిన్
హవములఁ బిల్చి వేల్తురు గతాగతి నిందురిపీఠ మూఁగఁగన్॥17

రా:-(సంతోషస్మితమున) తమ్ముఁడా! ఇటువచ్చి నీకనులసార్థకపఱచు
కొనుము! ఈఋషులసమ్మూహ మెంతప్రసన్నముఁ బావనము నైన
దియో!

క॥ తనువులు నరములగూండ్లుగ
నొనరిచి, యుఁక మిగులుసిరల నునిచికొనిరో యీ
మునులు శిరంబుల నన నొ
ప్పినజడల సదంబు చిత్రిపివిన మనఁ దగెన్॥ 18

అంతియగాక:-

గీ॥ సృష్టికి న్మడిబొమ్మల జేసి నిలిపి
నటులు, తపములఁ గృశము లౌనంగములను

రేపుమాపును వీర లర్చింతురి కనుమా!
యతితరపవిత్రుఁడౌ సవనాగ్నిహోత్రి! 19

(పరిక్రమించి)

ల:-(నవ్వి) ఆర్యా! ఇచట నొకచిత్రము జరుగుచున్నది!

చ॥ అనలగృహాన దాఁచినవి యాబలితంపలముల్గ్రసించెనే!
యనుచు నదల్చి సోమిదమ యం దొకదండము నెత్తికొట్టవ
చ్చినఁ బయిఁదాఁకుభీతిఁగొని తర్లక దండమె మూరుకొంచు నం
దె నిలచులేడిఁ గన్గొని మునీత్రతి నవ్వెడి మేలమాడుచున్॥ 20

రా:-(పరిక్రమించి) (కౌతుకానురాగములతో) సోదరా! ఈవింతం
జూతువా!

ఉ॥ ఇంతకుముందె యీనియును నీమృగి యీ వెలియజ్ఞ వేదికిన్
జెంతల మేలిపచ్చికఁ గ్రసించుచునే తనదూడపైపు న
ల్లంతఁ దృణాంకురాళిఁ దనకఁ దిను మానినుతాళి పైపు సం
భ్రాంత మొనర్చుఁ జిందుతమి మాటికిమాటికి స్వాక్షియుగ్మమున్॥

ఇచ్చో మఱొక్కచిత్రము.

చ॥ మునిసుతు లెందుఁ గుప్పలుగఁ బోసినచాముల ముక్కుకొండ్లతోఁ
గొని పెనుబార్లుగట్టి పఱుఁగు ల్లొనుచీమలచేత నాశ్రమా
వని సకలంబుఁ జిత్రబహుపత్రముల న్దగుభాజనంబు లే
ర్చి నిలిపినట్లు చిత్తమునఁ జేర్చు విచిత్రముదంబు లక్ష్మణా!॥ 22

ల:-అద్దిరా! పశువులలోఁగూడ బిడ్డలపై నెట్టిమమతలో! పసివాండ్రలోఁ
గూడ మంచిపనులయెడ నెంతయభిలాషయో!

రా:-(ఇంకొకవైపుఁజూచి)

మ॥ ఉపయోగార్థము మున్మను ల్నఱకఁగా నొయ్యజ్ఞిగుళ్లెత్తు ప్రాం
తపుగచ్చ న్గలశాద్వలస్థలిఁ గుశాగ్రంబు ల్ప్రరూఢంబులై
టుపలాలించెడితల్లుల న్విడచి మేయుం జెంగుచున్బోయి య
చ్చపుఁగందు ల్కనుఁ! తల్లి తెళ్ళ వెనుక న్వాగన్ ఖురల్చిమ్ముచున్॥

ల:-(పరిక్రమించి మఱొకవైపుఁ జూచి) అన్నా!

క॥ పదపదమున గనుపులుగాఁ
గుదిరిన పాములను వెలయు కుల్యాల నింప

న్బొదలుట వడియే రిట శ్రమ
వదల నిలిచినిలిచి యెట్లు ప్రవహించెడినో!॥ 24

రా:-తమ్ముఁడా! ఎంతచక్కఁగాఁ బరిశీలించితివి!

గీ॥ పాముల న్బిక్కటిలునిండు పర్వఁ దొనఁకి
యువలిచిఱుకాల్వల న్బడి యురుగుజలము
కేరళీఘనచికురభంగిమ హసించు
నెఱినడక దాఁట్లఁ జను సలాంతరప్రవృత్తి॥ 25

ఇదిగో! భగవతి యగుకౌశికీనది! రమ్ము! దర్శించి పావనుల మవుదము! (పరిక్రమించిచూచి)

ఉ॥ చల్లన, నిర్మలత్వమును, స్వాదుత నైజము లీస్రవంతికిన్
చల్లక, చూడ, కానక పస ల్కనరా, పటుకాక వేతసో
త్ఫుల్లసుమానుషంగమునఁ బొల్చుపరీమళ మెల్లచోట్ల రా
జిల్లి బలాద్వ్యధి న్జనులఁ జేర్చెడిఁగాదె తదంతికస్థలిన్॥ 26

ల:-ఆర్య! ముందు గనఁబడుకౌశికీనదీతీరముపొడుగునం గనుఁడు!

శా॥ శ్రీమేధాజననవ్రతాది పటువు ల్ప్రీతి న్నడింగట్టుచో
నాముం గాంచి పలాశపాళి మధునిత్యశ్రీల రాజిల్లి శా
ఖావాళిస్థలిఁ దోఁచుసింహకరజాకారంబు లాకోగక
స్తోమం బంకుశరాజిగా వనముఁ గాచు న్దోలి యేనుంగులన్॥ 27

(తెరలో - రామభద్రా! మాతపోవనప్రదేశములు కృతార్థములుగా
నింకెంతసేపిట్లరసెదు.)

శా॥ జ్యోతిర్వృత్తి యజస్సుల న్బరిణతిన్ శోభించు రుజ్ఞాథుఁ డే
దో తోరంపురహస్యసూర్యజపమం దున్నారు మౌనీంద్రు, ల
య్యా! తీర్పంబడ మధ్యమాహ్నసవనవ్యాపారముల్, కోరు ని
న్నైతత్ప్రాంతమునందుఁ జేర గురుఁ డాయీకార్యభోగాప్తికిన్॥ 28

రా:-(వినమిగా ననురాగముతో)

ఉ॥ స్నానము మూఁడుపూటల నొనర్తురు, తీర్తురు జీవయాత్ర వ
న్యాన నె, లేడిచర్మమెకదా మెయిఁజేర్చ, ధరింప నారలే
యైనను, జర్మచక్షువుల కందనిధామమె కాంతు రాజసం
బేని దమంబునే నెఱుఁగ రెంతటిధన్యులో దేవమాన్యులో!॥ 29

( తెరలో - మజిల)

శా॥ జ్యోతిర్వృత్తి...భోగా ప్తికిన్॥

రా: (విని) (సంభ్రమముతో మిన్నుఁజూచి) వేఁడివేలు పప్పుడే నడి మింటి కెక్కినాఁడే! సోదరా! రమ్మిఁక! యజ్ఞవాటినధిష్ఠించి అహ్నికకలాపము లన్నియుం దీర్చినభగవానులగు కౌశికుల దాపునకుం జేరుకొందము॥

ల:-(అంతటంబరికించి) ఆర్య! చూచితిరా!

ఉ॥ మండెడిసూర్య చండకరమండలము ల్బయినిండఁబ్రొద్దురా
తండము గుప్పుజ్వాలలకదంబముచేత జటాలమైనయా
యెంకులజాంగలంబున నొకింతయుఁ గూయవు టిట్టిభాళి, యా
నింకుమరీచిక న్గనులెనెగ్గ. విసీ! నడిప్రొద్దునన్నతల్!॥ 30

యజ్ఞభూమి చాలదాఁపుననే యున్నదిగాన నీపుణ్యనిడ నడిసీమఁ గూర్చుండియున్నయాజకులఁ బ్రత్యవేక్షించి యొండతీవ్రిత తగ్గఁగనే భగవానుల దర్శించుకొందము.

రా:-అటులనే కానిమ్ము! (పరిక్రమించికూర్చుందురు.)

ల:-(ప్రక్కకుంజూచి)

అ॥ వె॥ మండిమండి గగనమధ్యంబునకుఁ జెడి
బైసిమాలి వ్రేలఁబడ నినుండు
వృక్షములమొదళ్ళ విడలేక విడుఁ జాయ
లెవరొ కదిసి పట్టియాడినట్లు. 31

రా:-(అంతటంజూచి) తమ్ముడా! మధ్యాహ్నము దాఁటినదనినచో నాదినమంతయుం గడచనిన దనినమాత్రే!

గీ॥ పొడువుగుబ్బలి విడి మింటినడిమిశిఖర
మెక్కఁజాలక యెక్కినయిన హయాళి
యిట్టెచులకన జాఱెడి నిపుడు కనుము!
ఆవియస్థలినుండి యస్తాద్రిదెసకు॥ 32

ల:-ఆర్య! నిజముగా నిది రాక్షసు లరుదెంచువేళ కావుననే భగవానులగుకౌశికోపాధ్యాయులు శునశ్శేపునిచే వార్త ననిచియుందురు, మనల యాగవేదికపైకి రమ్మని!

రా:-(రోషముతో) హాఁ! వత్సా! అటులే యగు నెడల,

గీ॥ క్రతువుఁ జెఱుపంగఁ దొడఁగువీరల నెకాక
పరిశయకర్కశయమ భయహావహాముగాఁగ
సకలభూమిని నీరాక్షసం బొనర్ప
నిజుతఁ బుణ్యాహమంగళం బీధనుస్సు!॥ 33

ల:-(నవ్వి) రాత్రిచరుల నిర్మూలింపవలయు ననును దేశిక మన్నగారి హృదయమునఁ బుంఖిభవించి త్రికాలవేది యగుకౌశికభగవానులం గూడ నెట్లు లెక్కింపనట్టిదవుచున్నది!

క॥ సకలావిద్యాంకురముల
వికలముల నొనర్చుసత్త్వవీర్యుఁడు ముని త
త్ప్రకటతరదివ్యచక్షు
ర్నికటంబున వర్తమానకృతులె నిఖిలముల్॥ 34

రా:-ఏమనుచున్నావూ? విశ్వామిత్రులవిషయమేనా?

గీ॥ బ్రహ్మతత్త్వంబు నెఱిఁగినప్రౌఢుఁడయ్యుఁ
గేవలగృహస్థవిధులుగాఁ గీర్తిఁగాంచు
స్వర్గఫలదంబులైనయజ్ఞముల నఱక
క్రీడగా నీయహోమహహుం జాడుఁగాదె॥ 35

మఱియు,

ఉ॥ నూతనభూతసృష్టికయి నూల్కొని యీఘనుఁ డంతలోనె స్వ
ర్జాత వినమ్రిఁడై తల ధరించిన దేవతరుప్రసూనమా
లాతతసన్మధుప్రవమల జ్జరణంబుల నింప నార్ద్రిఁడై
యాతమి సున్న చుట్టె జగమందుఁ ద్రిశంకుచరిత్రిఁ జాటఁడే॥ 36

ల:-(ముందుఁ జూచి సంతసముతో)

క॥ ఆయీకులపతి యీయ
జ్ఞాయతనంబున స్వకీయయాగార్చనలన్
జేయుచు శ్రుతివాక్యఁ గృతా
ర్థాయత్త మొనర్చుచుందె యగుపడు నిదిగో!॥ 37

[ప్రవేశము:-దీక్షితవేషుఁడై విశ్వామిత్రుఁడు]

రా:-(పరికించి గౌరవముతో) తమ్ముఁడా! లక్ష్మణా! అటుచూడుము.

ఆ॥ శ్రౌతధర్మదీక్షితకై తగు నేపథ్య
ధారిణములఁ గురుఁడు తనతపః ప
సిద్ధతేజ మెంతొ పిఱులఁబ్బుకళలీన
సమధికోజ్జ్వలాభ నమరినాఁడు॥ 38

వి: (పరిక్రమించి తనలో)

చ॥ అమరుల మిన్నగాఁ దనుపనైనది యీవిధి సాంతమయ్యెడిన్
సమసెడి నింక నివ్వాటి స్వగందనుతోఁ బడి తాటకాఖ్య; చం
ద్రిమకుటువింటిఁ ద్రుంచుటె పణంబగుకన్య గ్రహించి, దేవకా
ర్యము లిల దిద్దుచుండు రఘురాముఁ గనంగదె స్వాస్థ్యమాత్మకున్॥

(రామలక్ష్మణులు లేచి సమీపింతురు)

వి:-(రాముఁ జాలసేపు చూచి స్నేహకౌతుకముతో)

క॥ ఈవిధి విహారణశీలం
బౌవేషం బిట రఘూద్వహార్చితపాటన్
లావై నిశ్చయ మమృత
సాంద్రముగా మదంతరంగ మొగసెడిన్॥ 40

రా॥ల:-(సమీపించి, దాశరథులము నమస్కరించుచున్నారము.

వి:-(కౌఁగిలించుకొని) బిడ్డలారా! వేఱేమని దీవింతునోయీ!

క॥ ఆవాసవు యోగక్షే
మావిష్కృతి మీముఖాన నగుచుండుట న
ద్దేవేశు నాయుధమ్ములు
కేవల మైశ్వర్యమాత్రకృత్యమ్ము లగుతన్!॥ 41

రా॥ల:-(క్రిందఁజూచుచు నూఱకుందురు)

వి:-(నవ్వి) మాయీసన్నివేశమునంతయుఁ జక్కఁగఁ జూచితిరా? మాతపోవనవిహారభూములు మీకు రమణీయములుగ నున్నవియా? మాఋషుల గృహస్థాశ్రమములు మీమనముల స్నేహజనకము లయ్యెనా?

రా॥ల:-(ఇరువురు నమ్రకముతో)

గీ॥ అగును రమ్యము కాదు రమ్యంబటంచు
నెవ్వ రిట యోగ్యులో నిశ్చయించి తెలుపఁ!

జూడఁజూడ రజస్తమస్సులు నశించి
నిండె మామది సత్త్వ మఖండలీల॥ 42

(అందఱు యథోచితాసనములఁ గూర్చుందురు)

వి:- (భావగర్భితమందహాసమున) వత్సలారా!

క॥ కైతవవామనుఁ డనెడి పు
రాతనముని యిటుఁ దపించి క్రిమ్మఱు టాదిన్
మూఁతవడుమునులకను లిపు
డే తెఱచుచుఁ గాంతు రాతఁడే మీ రనుచున్ 43

రా॥ల:-(ఇరువురు నుత్సకత్వసంభ్రమితు లవుదురు)

వి:-(తనలో) అహో! వీరిపు రాజన్మస్మృతి నించుక రేపితింగదా! ఇంత చాలు నిఁక నితరప్రసంగమున దింపెదను. (ప్రకాశముగ పడమరం జూచుచు) తూరుపుకొండ కాశ్మీరమునఁ గుంకుమపు కేదారమందలి ప్రభాతలతామతల్లికకు మొదటిపూగుత్తినాఁ బొలిచిన వేవెలుంగు నాచేతనాచేత దిశాంగనలు తమిలీఁ జందిపుచ్చుకొని వారుణీదిశకుం జేర్చిరి. ఈసమయమున.

గీ॥ అదుగాడిదచెవివన్నె యూవహిల్ల
నించుక తలెత్తుచీఁకట్ల నంచులగులు
వెలుఁగు దివిసెడి రవి పిచ్చికల మదకల
నాంది వెలయుఁగుజాగ్రింబులందునుండి॥ 44

మఱియు,

గీ॥ మంత్రిసంస్కార పరమసంపన్నము లయి
వెలయుపడమటిమున్నీటిజలము లదిగో!
ఆత్రియీామయుఁ డైనదివ్యప్రభాధ్యు
స్నానమాడించు నాదిత్యనామమహితు॥ 45

రా:-(దెసలంబరికించి) తమ్ముఁడా

క॥ మండించు తేజముబుకఁగ
మండి పిదప మంట లాఱ మసిరం గదె తూ
ర్పండ నుదగ్దక్షిణముల
నిండి క్రమతఁ బశ్చిమాశనేన్ వ్యాపించెన్॥ 46

మఱియు,

మ॥ సవనాగ్నిన్ జనియించుధూమపటలభు ల్సాగన్ దిశ ల్విర్గన
ట్లవుచు న్నైల్యకొనె నాశ్రమస్థలి నవంబా నెద్దిరయోనిండు, మూఁ
డవజన్నంబున వేదగానమున జంటల్వాఱె స్పర్థ న్వటు
ప్రవరు ల్సుస్వరము ల్క్రమోచ్చతగ విస్ప స్వీనువిందయ్యెడిన్॥47

వి:-వత్సా! రాఘవా!

మ॥ పగట న్డాఁద్యజియించుఛాయలనె కప్పంబడ్డదో కంచుకం
బుగ ని ష్టంచనిపించు నీజగతి. చిమ్మంగాఱుచీఁకట్లన
ల్పగుభూకాంతయొ! రత్నసానువున నాఁగ్దానబ్ధుల న్వెల్గులు
బ్చఁగఁ జతాఱింగిగఁ దేలి చూపఱకు భావప్రీతి సంధించెడిన్॥ 48

ల:-(విచారముతో)

గీ॥ ఎంతో తేజోమయములుగా నెసఁగుదిక్కు
లింతలోఁ గారుచీఁకట్లబొంత లయ్యె!
బ్రహ్మదేవుని భువననిర్మాణ మవుర!
వింతల విచిత్రతరముగా వెలయుఁ గనఁగ॥

అంతటంజూచి,

చ॥ అవె ఫణిరత్నదీప్తు, లెగయన్ గనిపించెడి వల్మికంబు, లా
రవిశిలలన్ ద్యజించుచుఁ జొఱంబడె నగ్ని రథాంగి హృత్పుటిన్
దివి నిశరాయుటన్ బడి తునింగిన సాంధ్యహుతాశ లేశవై
భవముల నిర్గడ న్డిమిరభంగులఁ ద్రోపిడు దీపికాతతుల్॥ 50

రా:-(చూచి)

చ॥ కనుసకలంబు నత్తమిలె, గాఢతమం బెటనిండ నొండెది
క్కునఁదగె, నామమాత్రములె యయ్యె దిశాఖ్యలు పోవ్రేమి, ద
క్షునకును భీతిహేతువులు చొప్పడె, వస్తువివేకమాఱె. ని
ల్చిన దొకమాటసవ్వడియె చేకొన పీడ్కొన నిశ్చయింపఁగన్॥51

(విచారమున)

గీ॥ పద్మముల మేలుకొల్పుదీప మగుభానుఁ
డయఱొ చరమాద్రిశిఖరశయానుఁ డయ్యెఁ!

గల్వా లిఁక విప్వమోములఁ స్గా్రిలఁగలవు,
క్రొ్రిలఁగల వింక జ్యోత్స్నఁ జకోరకములు!॥ 52

మఱియు,

క॥ చీఁకటినుసిపు ర్వాఖలది
శాకాష్టంబులను దొలిచి సాంద్రిత నతు
ల్రాకరరంధ్రింబులఁ గిర
ణాకృతి నుసి రాల్చుచున్న దవనీస్థలిపై॥ 53

తెరలో - కలకలము (ఎల్లరు సంభ్రిమముతోఁ జెవులనొగ్గుదురు)

(తెరలో)

శా॥ డబ్బాట న్దలకి్రించునల్ల మిడి(గుడ్లన్ ద్రిప్పుచు న్నింగి నా
గుబ్బుస్జీఁకటి, యూర్పుమంటజడిఁ జీకుంజెంద. దంతంబులన్
గబ్బుంగొమ్మిక నాల్క మాటికిని జక్క న్సర్దుకొం, చుబ్బిత
బ్బిబ్బాగ్రిద్దలఁ, దాటకాసురి యిదే వేష్టించెడిన్ రాత్రితన్॥ 54

మఱియు,

గీ॥ అయరెయి ్రేతాగ్నికుండంబులంగా రుధిర
మల సుబాహుమారీచులు చిలుకఁ దొడర
వారితోడఁ గిలార్చుక్రివ్యాదవితతి
తఱిమెదరు హొట్టఁబెట్టుకోఁదలఁచి మమ్ము॥

వి:-(యోజించి) వచ్చినదా! తాటక! వత్సా! రామభద్రా!

గీ॥ మాగృహంబుల వేదోక్తిములయుక్రియలఁ
జెఱతురకటా! యూర కటులుచూచెద వదేల!
కొనుము నీచాపము న్మన్నిగొనుము సోఁకు
మాఁకల సుబాహుఁ దాటక న్మునుముఁబట్టి!॥ 56

(తెరలో - అబ్రిహ్మణ్యం!-అబ్రిహ్మణ్యం! అయ్యో! తండ్రి!
విశ్వామిత్రా! ఇట్టింకెంతసేపు మాకీరాక్షసులచే నవమానములు?
ఎక్కువింటితో దాశరథి నిటుపంపుఁడు పంపుఁడు!

రా:-(తెరవైపుఁజూచి నవ్వుచు) ఓఋషికుమారా! శునశ్శేఫ! ఒక
ముహూర్త మోపికఁగొనుము!

గీ॥ అంగలార్చెదు మోయయ్య! స్వల్పమిద్ది
బలతరంబగువిధి నీదుపనుపె, గాధి
జాతునారసుఁ డగుమధుచ్ఛందుఁ డొకటి
నీవొకటి కాదుమా కిదినిశ్చయంబు!॥ 57

వి:-(సవ్రీడ) వత్స! ఉత్తరప్రత్యుత్తరముల కిటనవకాశములేదు. ఆశ్రమ
వినాశమే దాపరించినది!

ల:-(వ్యథతో) (తనలో)

గీ॥ ఇట్టికౌశికులే యానతిచ్చుచుండ
నన్నగారిమీమాంసకు నర్థమేమొ !
ఋషులు నోరారఁగావచియించునుడు లె
జగతి శాస్త్రములగుచుఁ బ్రశస్తిఁగనవె !॥ 58

గా:-(తనలో)

ఆ॥ గురువునాజ్ఞఁ బడఁతిఁ గూల్పవలయునాఁటఁ
గలుగఁబో దధర్మగతి రవ్వొకింత
నేఁడు మిణికి రేపు నీల్గుమాబోంట్లు ల
జ్జను జయింపలేరె కనులమోడ్చి॥ కాని, 5

చ॥ ఇతరులలోప మెన్నుపనియే పనిగాఁ గుతుకంబు నొందున
ద్వ్రతసభవిమ్మదల్పజనతండము లీసడి గొప్పఁజేసి చా
టుతరుల రెక్కగా దివిఁ గదుర్ష్మళియంబులదాఁటి నిల్చుది
వ్రతనువసిష్ఠుఁ బైకొనదె వల్మతు లజ్జ పరంపరార్భటిన్ ?॥ 6

(తెరలో)

మ॥ ఎప్పుడో కాని యొసంగదతుములుకా వీయాగము ల్స్వర్గమున్
ద్రిపతే కేటికి, మూర్ఖులార! కడునాస్థన్యానిఁగా వింవ ? ని
కృష్ణుస్వర్గభ్రమణేచ్ఛ యే కలిగినన్ ఖడ్గంబిదే రండు మీ
కిపుడే! యిప్పుడె! స్వాభిలాష వడిఁ బెంతేరూఢిఁ బ్రాప్తించెడిన్

రా:-(విని, రోషసంభ్రమములతో) (వినయాంజలింబట్టి) భగవానుఁడా
జగత్త్రయగురుఁడా !

చ॥ దశరథునంతవానికి యథావిధి నౌతనయేప్టింబుట్టి, వి
ల్లుశరముఁబట్టి రాఘవులలోఁగళంకముఁ గూరుసేమొనాఁ

న్గుశికతనూజ! యిప్పుడఁ దెఁగూల్పఁగఁ గొంకెద. మీయనుజ్ఞ యే
యశమిడుధర్మనిర్ణయపరార్థముగా నతిసేంచి యేగెదన్॥ 61

(నమస్కరించి) ఓతపోధనులారా! భయపడకుఁడు! భయపడ
కుఁడు !

శా॥ ఈరక్షోబలమెల్లఁ గూల్చుకొఱకే యీరామభద్రుం డిటు
ల్సేరవ్వచ్చుచునున్నవాఁ డితనివాసింగన్న చాపంబునన్
బ్రారంభత్వరఁ బర్వబాణ మలవిశ్వామిత్రదర్భాంకురా
గ్రారూఢాంబుకణంబుకై వడి నమోఘంభీలమై నమ్ముఁడీ! 63

(విల్లునెక్కిడుచు నిష్క్రమించును)

ల:-(సాశంకముగఁ దనలో) అన్నగారికౌమార మదృష్టవశమున క్షాత్ర
ధర్మముతోఁ గూడినదైనది. పనికిమాలినదికాలేదుసుమా!
(తెఱవైపుఁజూచి) కౌశికభగవానుఁడా! కనుఁడు! కనుఁడు!
పురోభాగమున నన్నగారు ధనుర్ధరులగుసరికి,

శా॥ వాయవ్యాస్త్రమునిర్గమించె, నొగుడై పట్టేది మారీచుఁ డే
దోయోరన్నకెఁజచ్చినట్టులు, సుబాహుండో గతించె. న్దగన్
గాయంబుల్ స్రవిసాగ్రెల్చేఁదాఁటక మహాకారుణ్యభీభత్సహా
సాయత్తాద్భుతకోపభీచకితులై యందెల్ల రీక్షింపఁగన్॥ 64

వి:-(చూచి) వత్సా! లక్ష్మణా! ఒకవైపు విస్మయము మఱియొకట
సంతోషము నన్నుఁ బరవశునొనర్ప మాటాడలేకపోవుచున్నాఁడ
నోయ్! అయినను, జెప్పుటకుమాత్ర మేకొంత్రవిషయముకలిగినది?
నేఁటిదా యీమీ ప్రతిష్ఠ యంతయు?

ఉ॥ మీరఘురాజులా! దెసల మించెడికీర్తి మింటఁ జేర్చుధీ
రారభటుల్మహాద్ధతులహర్పతితేజులు! మీధనుష్కులా!
వారనిదైత్యనిగ్రహ మపారముగాఁ గొనునాటగాఁగ, జం
భారి శచీకుచాగ్రరచనార్పితుఁడౌటలు దానసేకదా!॥ 65

ల:-మహాత్మా!

గీ॥ వీరధర్మంపుటాధానవిధిగఁ దుర్రిటిని
రాత్రిచరసేనసెల్ల మర్దనమొనర్చి

తావకీనపదాంతికస్థితి మగిలఁ
జేయుచున్నారు మాఅన్నగారి టదిగో!॥

రా:-(దూరానఁబ్రవేశించుచు నెల్లబాటుతో)

గీ॥ గాధిసుతుఁడు వసిష్ఠుఁడుఁ గంజహితుఁడు
ముగురుగురువులు రఘుకులోద్భూతులకును
ఈమహోమహులు ననుమతియొసఁగు, నెన
నిడదు సుఖమింత స్త్రీకథ, యేమొనర్తు!॥ 6

(ఆశ్రమముంజూచుచు)

ఉ॥ చీఁకటితీవెగుంపులు నశింపఁగ జాబిలివెల్గు తోఁచె, నీ
పాకలగుర్తులత్తమిలఁ బర్వెడిజన్నపుధూమవల్లరుల్
కైకొనరేపు వల్కలనికాయములారఁగఁగట్టు బాలకు
ల్సాఁకిరి నిద్రనాగతులు సంయములిండ్లఁ గన న్మదంబుగన్॥ 68

(ముందుఁజూచి)

ఉ॥ వెన్నెలపిట్టగుంపు మదవీక్షణరక్తతు లూఁతమీయ సం
పన్నత మించుజ్యోత్స్నలను బ్రొద్దిగఁ దోఁచె సుధాకరుండు, కా
మోన్నతి బెట్టుపిడి ప్రియునొద్దకుఁ దామె చనంగ సాగుమే
లన్నల సిగ్గుఁగాచి యమృతాంబువు లక్షులమాఁకుఁగొల్పుచున్॥

మఱియు,

శా॥ రాజన్మాత్మమృణాళఖండరుచితో రాజీవసంవర్తికా
తేజంబు న్మడిగించుచంద్రకరపంక్తిన్గొన్ని వెల్గుల్తమో
రాజిన్సాఁకి కలంప నుర్వితెఱలగ్రవ్యాప్తి ద్యోతిల్లునాఁ
గా జొత్తిల్లెడుఁ గొండనెత్తముల ముంగారున్నసందీనుచున్॥ 70

(నిర్వేదముతో)

ఉ॥ తూరుపుకొండనెత్తమునఁ దోఁచినవెన్నెలకాంతిచేత నే
తీఱెఁగదా తమంబు, కడుఁదేఱెఁగదా కనుదోయి, జెందొవన్
సీఱెఁగరా సువాసనలు! మింటికిరాఁ బనియేమియింకఁ బ
ద్మారికి లోనిమచ్చ నిటులందఱకున్వెలిపుచ్చనేకదా॥ 71

(సంతోషముతో)

మ॥ బటుల న్గుంకుమఁ బూసి, స్త్రీముఖతతిన్ ద్వైరాజ్యము న్గొల్పి వా
ర్మయముల్గా శశికాంతపున్నిరుల నార్ద్రత్వంబుఁ జేకూర్చి దే
వధువత్యర్పితదూర్వము ల్మెసవుట న్బల్పొందు నేణంబుతో,
వియదుత్సంగము నెక్కుచున్న దుడురాడ్బింబంబు సోజ్జృంభతన్॥

ఇంతియ కాక,

శా॥ పౌలోమీకుచకుంభకుంకుమముతో బాంధవ్యము న్గల్పు నీ
బాలాబ్జద్యుతు లింద్రపట్టణపు శోభ న్బెంపుఁ జేకూర్చెడిన్
నీలం బౌతమము న్గ్రసించెడి దిశానీకంబును న్దేర్చెడిన్
నేలన్గప్పెడి నంతరంధతమ మానింగిన్ మహోజస్సెడున్॥ 72

మఱియు,

చ॥ నభమున రెండుక్రోసులయిన న్బయిఁ బ్రాఁకఁడు శీతరశ్మి, మే
ల్నభమును గైరవాళి కిడుశుభ్రకరంబులొ! అద్దెయియాసమం
పుభువి మధించుఁ జీఁకటుల, భూధరకాననపాళిలోనఁ ద్రో
యు! భృశమువాని, నీడల మహోగ్రత నాశముఁగూర్చునొక్కటన్

(వెన్నెలపెంపున్గమనించి)

ఉ॥ వెన్నెలచిల్లగంథమున వేగఁ దమోబ్ధిఁ దమంపుపంకముల్
చన్నవొ క్రిందికి, న్బయినిస్వచ్ఛత తేఱఁగఁ, గాక నీలపు
న్మిన్నటు వెల్గుబాడిసెల నేర్పునఁ జెక్కఁగ నీడబెత్తిక
ల్మన్నుతలాన రాలెనన మంచికళన్ శశిశోభ హెచ్చెడిన్॥ 74

(పరికించి, ప్రక్కలం జూచి)

గీ॥ చిక్కనై పత్త్రములెసంగు చెట్లక్రింది
జ్యోత్స్న తిలతండులితమయ్యెఁ జోద్యముగను,
మదచకోరాళి గుంపులై మలసి చంచు
పుటుల నెడనెడఁ గొఱికెనేమో యనంగ॥ 75

(యోజించి)

శా॥ ముల్లోకంబు దమం బడంచెడిఖరాంశువ్యాప్తి కోకావలీ
హృల్లేశంబులమాత్రమే మిగిలె, నిస్సీ! క్షుత్తమంబు ల్వడిం

ద్రేళ్ళం జేయఁగఁ జాలుశీతకరు మేల్ట్రి పుల్సమూలంబుగా
జెల్ల న్మ్రింగుఁ జకోరకంబులు కడున్ శీఘ్రప్రడీనోద్గతిన్॥ 76

మఱియిప్పుడో,

చ॥ శశిపఃను తెల్లపైపులను జాఱ్పుజలంబుల బిందుసంతతు
ల్విశదముగా గుహాన్గుహను వెల్లువగా జతగూడిపాఱఁబ్రా
గ్దిశఁ గల తెల్లకల్వమడిఁ గ్రిక్కిఱియ న్వాలసిల్లు మొగ్గలన్
గశలయి పీడఁగొట్టఁ బాలిగాఁబ్రసరించెడి జంద్రుడంశువుల్॥

(పరిక్రమించి పైకిఁజూచి)

ఉ॥ పొందెను జందమామ తనువున్నడిపీమను లేదమాలమ
ట్లందపుఁగందు, మచ్చయని యందురు దానినిఁలోకు లుత్తద
య్యిందుఁ దమోగ్రహంబు గ్రసియించిన వాఁడిమిఁకోఱగాట్లు మా
నం దుది నిల్చుతూట్లను గనంబడునవ్విలిమిన్ని రూఢిగన్॥ 78

మఱియు,

ఉ॥ ఇమ్మోయి రిక్కతండములు, నింకఁ బ్రవాసురుచు, ల్వారిన్వారిన్
భమ్మునఁ దోఁచుచుంటఁ గన, భాస్కరుఁ జక్రపుసానఁబట్టి పొం
క మ్మిడుత్వష్టకూటమునఁ. గంజవిరోధిని గూడ నిల్పి, డం
కమ్ముల, బెమ్బులెల్లఁ దొలఁగ, న్సరిచేయు నటంచుఁ దోఁచెడిన్॥

ల:-(అంతటన్జూచి)

మ॥ అసితార్థంబున నంబరంబునను సాంద్రారోపితా ల్చ్యక్క! లా
ర సితార్థంబున బల్చనోట కతమేమా? నా న్మదిన్దోచు, నా
కసమన్మాసను జాలునన్నిగనురిక్క ల్దించి సంధ్యానల
శ్వసనం బంమఁ గఱంచి పోత నిటులే సాధింతురం చీశశిన్॥ 80

ఇది ధర్మానుసారియేగదా! (నవ్వి)

చ॥ తిమిర మకాలమృత్యువును దే సుధఁ గన్నులనుద్ధరించుది
వ్యమహిమఁ డిట్లు తా నతిథియై యమృతాంశుఁడు పొద్దుద్రుంకిరా
న్విముఖతఁ జూపుతమ్మిగృహిణి న్నశిపాపము పూనె, నబ్బె జం
ద్రమునకుఁ బద్మగౌరవనితాముఖసామ్యపుఁబుణ్యమంతయున్॥ 81

వి:-(అంతటంగలయఁగని) (నవ్వుచూ) ఔరౌరా! పేరునఁ గల
మాధురి చేతనే విషయోపభోగులు మోసపోవుచుంద్రుగదా! ||.

ఉ॥ తేలినఁ దేలుగా తొగలు దిక్కులు, వాపిరు లౌచకోరము
లోఁగిలినఁగోరులుఁగాక ముకుళోద్రుల వెన్నెలయిక్కరంభమున్
బోలుప నతిప్రకటిప్పుసిపో! యిసిగో! అమృతాంశుఁడంచు బ్రా
ల్మాలికఁ బెద్దఁజేసి తశాలం బను రాగముఁ గొందుర్ వెంగలుల ॥82

(రాము నింగూడఁ జూచి సంతోషమునఁ దనలో) ఏమిది! ఈపసివాఁ
డింతపిన్నవయసుననే విజయమునందియుఁ దాటకన్జంపవలసె నేయను
జుగుప్సచే నాదరిం జేరరాకున్న వాఁడు! (లక్ష్మణుంజూచి) వత్సా!
లక్ష్మణా!

ఆ॥ రాత్రిచరతమంబు మ్రందించి యెగఁజిమ్మ
సరవి నెదుట రామచంద్రుఁ డొలయ,
నాశ్రమమున నెట్టు లంతట మునినేత్ర
కుముదవికసనంబు కుదిరెఁ గనుము!॥ 83

అదియట్లగదా!

చ॥ జనకుఁడు పాలయే, అయిన సప్తమహోద్ధులఁ బొంగఁజేయు న
త్రినయనజన్ముఁడైన నలరించు జగద్బహునేత్రపాళి, నిం
దునమృతభాండమయ్యు నమరుల్తిన నెల్లరకంచమయ్యె నెం
తని కొనియాడనో కువలయప్రియుఁ జంద్రు సమంజసత్వమున్ ॥84

రా: (లజ్జతో సమీపించి) కౌశికభగవానులకు నమస్కారము!

వి:-(స్నేహబహుమానములతోఁ గౌఁగిలించుకొని) వత్సా! రఘు
నందనా!

ఆ॥ నలువునట్టివాని సకలేప్సితంబులే
తగుక్రియాఫలంబులుగఁ దనర్చు
విధుల నెట్టు లేమువిస్తరింతుము, తండ్రి!
పౌర్షి మెఱయు నీదు పాలనమున!॥

రా:-గురువాక్యము శిరసావహింతును.

వి:-(దొమ్మియుద్ధపుదుమ్ముతో నిండిన రాముకపోలములఁ దుడిచి)
వత్స! నాగాఢమిత్త్రుఁడగు శీరధ్వజుం డాచరించు నధ్వరము
రాకాసిమూకలచే నెట్టియంతరాయములఁ జీకాకునొందునో యని
న్నామనము కడుంగడుఁ దల్లడిల్లుచున్నది.

రా:-(గౌరవముతో) భగవానుఁడా! త్రిభువనములలో దుర్లభమైన గాధమిత్రిశబ్దముచేఁ దాము తెల్పినయీసీరధ్వజనాము లెవ్వరై యుందురో! ఇట్టియోగ్యత గలయాతఁడు మిక్కిలిమహిమానుఁడనియెంతును.

వి:-కుమారా! వినుము! విదేహదేశమున మిథిలయనుపట్టణము కలదు,

రా:-ఎల్లరాజుల కెక్కుడగాని యుండు శైఖునివిల్లును నాగంటిచాలున నయోనిజగాఁబుట్టిన స్త్రీయు నందద్భుతము లని జనులు చెప్పచుందు రదియేనా!

వి:-(నవ్వి) ఇఁక నేమి!

రా:-(కౌతుకముతో) అయిన నందేమివిశేషమో?

వి:-ఆ॥ ఆనభోమణి యైనసహస్రకిరణు
దయను మును యాజ్ఞవల్క్యునొద్ద గ్రహియించె
"బ్రహ్మసంహిత" యనియెడిపరమవిద్య
నధికమగుశ్రద్ధ సీరధ్వజనృపుఁడు! 86

జనకవంశసంభవుండును సత్యవ్రతశ్రేష్ఠుండునగు నప్పురాతనరాజర్షికి దీక్షాలోప మగునేమోయనుశంక నన్నాకులపఱచుచున్నది. కావున, నాయీక్రతుశేషము ముగించినయుత్తరక్షణముననే సరాసరి మిథిలంగూర్చి వెడలుదము!

రా:-(సంతోషముతో) తమ్ముఁడా! లక్ష్మణా! బాలచంద్రకిరీటుఁడు కేలధరించిన యబ్బాణాసనముంజూడవలయు ననియెడికుతూహలము చాల కాలముగ నున్నది

ల:-(చిలిపిగా) అయోనిజ యగునప్పావ్యకన్యంగూడ ననరాదు?

రా:-(రోషమున) ఇదొకటియా? నీవేదో చిత్రకథం గల్పించుచున్నట్లున్నది. (విశ్వామిత్రునితో) ఇక్ష్వాకులగురువు లనుమతమయిష్టాను సారముగనే కానిందు. (పరిక్రమించి నిష్క్రమింతురు.)

ఇది రెండవయంకము.



# శ్రీ మదనర్ఘరాఘవము

## మూఁడవయంకము.

రంగము - రాజాంతఃపురపరిసరము

కంచుకి:-(ప్రవేశించి, ముఁదిమిచేఁ దూలుచుఁ దనను దా నిఁదించు కొనుచు).

శా॥ తో స్సాటన్నడి, యెల్లగాత్రమున సంధుల్స్వళ్ళమైతూలుటన్
లెస్సానేలికగేలితోఁ బ్రహసనాళిన్ హాస్యపున్పాత్రయ
ట్లుస్సులొట్టుటహెచ్చె, దీర్ఘమగునాయుస్సింకపై బూదిలో
బుస్సన్నట్టుల మార్చి యేరకవుఁద్రిప్పల్ త్రిప్పఁగానున్నదో!॥ 1

(ముందుఁజూచి) ఆవచ్చునది సీతాపాదసేవకురా లగుకలహంసిక యేయనుకొనియెద!

క:-(ప్రవేశించి) పెద్దలకు దండాలు.

కం-పిల్లా! కళ్యాణివవుదువుగాత!

క:-ఆర్యా! బహుకాలదర్శనం! ఎందుండిరాకయో!

కం:-(యోజించి) చెప్పఁగూడనిది యేమున్నది. అంతయు మీకు తెలిసినదే. అద్భుతులగు నిరువురుకుమారులతోఁ గౌశికులవారు సీరధ్వజమహారాజులదరికి వచ్చిరట!

క:-విన్నదే. అయితే స్వామీ! వారిపుట్టుపూర్వోత్తరాలు నామధేయాలు తెలుసుకోవాల్ననుంది కుతూహాలం.

కం:-పిల్లా! అదియుం జెప్పెద.

ఉ॥ ముప్పదిమూఁడుకోట్ల సురపుంగవమూర్తులమూర్తి భానుఁ, డా
గొప్పకులానఁ బంక్తిరథగోపతిచంద్రుఁ డెసంగు, వానిదా
తప్పనియస్త్రవిద్య నలదైత్యనితంబినులందు నూర్పులా
ముప్పు ఘటింప, వజ్రమును ముట్టనెముట్టఁడు వజ్రిభోగియై॥ 2

గీ॥ ఆత్మజులువీర లావసుధాధిపునకు
రామలక్ష్మణు లన వీరినామములగు

భరతశత్రుఘ్నులసి ఘ్రాతలంబు
రీతులు వార్వేను జంటలై యెటంజరింతురి 3

క:-మనయింట మనరాచపడుచు లగునూర్మిళాసీతలును మాండవీ శ్రుతకీర్తులు నుండునటుల నేనా ?

(ఇంచుక యోచించి) (సంతోషముతో) ఎట్టిగొప్పకులను లీలా మాళ్ళు (వేడినిట్టూర్పుతో) మరి! మనవంటివారికా అంతటి అదృష్టం !

కం:-ఎందుకుకాదు? విచారింపకు! దేవబ్రాహ్మణప్రసాదమున నన్నియు ననుకూలములే కాఁగలవు

క:-ఆఁ- తరువాత!

కం:-తరువాత నంతిపురిలోని వృద్ధరాణులు వేడుకొనఁగా నానూర్యవంశ రాజకుమారులం జూచివచ్చుచుండఁబురోహితు లగుశతానందులవా రగుపడి వనుప రాజపుత్రీసౌభాగ్యదేవతారాధనమునకై వెళ్ళు చున్నాను.

క:-(సంతోషముతో) స్వామీ! ఈ శతానందులవారివచన మందటి యాశీర్వాదాలతో నేకీభవించినుమా !

కం:-అమ్మాయీ! అదిఅష్టైకా కెట్లగునసుకొంటివి ఆంగిరసుఁడు లోఁతు లేనిమాట ననఁడు.

క:-అయితే, బాబూ! జనకమహారాజుల ప్రతిజ్ఞానుసారంగా నీరఘునంద నుఁడు శంకరచాపా న్నెక్కుపెట్టఁడ నేఅంటావ్ ?

కం:-అమ్మా! ఆవిషయమే నన్నుఁగూడా కలవరపెట్టుచున్నది, చూడుము!

చ॥ తనసవనంబుఁ గాచుపని, దైత్యులధాటి నడంచుకార్యమున్
బనుపడె నానుకూలముగఁ బ్రాణసమాత్మజులై నవీరి నా
జనకునియింటి కంపకయ, చాపకు నేర్పడె వీర్యశుల్కమం
టనెఱిఁగియు న్మునీశ్వరుకడంకయెదో యిటు వీరిఁ దెచ్చుటన్॥ 4

క:-(స్మృతినభినయించి) (విషాదముతో) ఆర్యా ! జరుగుచున్నసమాచా రాలు విని వికలమయ్యె తనమనస్సును బొమ్మలపెండ్లి నెపంతోఁ దేర్చుకోఁ జూచేరాజపుత్రియవస్థఁ గనిపెట్టి తరువాతిసంగతు

తెఱుంగవచ్చి మీదర్శనంతోనదంతా మఱచిపోయ్యాను! మీ
రోనర్చు రాక్షసప్రస్తావనచే మళ్ళీ జ్ఞప్తికొస్తున్నది.

కం:-(విషాదముతో) పిల్లా! ఆసమాచారమేమిటో! అటులు రాజ
పుత్త్రికనే కలవరపెట్టినదిగా!

క:-వినలేమీరు? సీతాదేవి నడుగడానికై రావణపురోహితుఁ
డొచ్చాఁడు!

కం:-(అదిలెక్కసేయక) (సంతోషముతో) ఉస్! దానికేమిగాని!
ఈవార్తచే వ్యాకులపడునంతటి తెలివిగలిగేయీడు వచ్చెనా మన
జానకికి అటులయిన నిజముగా నామెఱుంగములు మంగళాచార
ముల నందిపుచ్చుకొని యౌవనమున కుబలాటపడుచున్నవనిన
మాటే!

క:-తాతా! కాదామఱి! సిగ్గువిడిచి వకసంగతిచెపా విను నాకూ
యింతకుముందే తెలిసింది. ఆకళ్యాణి,

చ॥ ప్రియసఖులైన బాలికలు వేడ్కకు నర్థమెఱుంగలేమి, "సీ
రెయి మనబొమ్మలాల్మగలు ప్రీతి శయించెద రొక్కశయ్య నా
యయము గనంగర" మ్మనఁగ నాయన దూయన దేమొ కాని ని
శ్చయముగఁ జెక్కిళుల్పులక సందడిఁ దొట్రిలసాగ బిట్టుగన్॥ 5

కం:-(సంతోషముతో) ఇంతకాలము బ్రతికియున్నందుకు నీవై దేహి
యౌవనదశంజూచి సంతసించుటకైగా (నవ్వి) తరువాత!

క:-తరువాత ముద్దరాండ్రగునబ్బాలికలు మఱిమఱినిర్బంధిస్తే మొదట
సిగ్ధుపడ్డందుకే మఱలసిగ్గుపడింది!

కం:-(నవ్వి. కుతుకంతో) పిల్లా! ఈయీడనంగా బాల్యయౌవనసంధి
కాదటే! అందుకని,

క॥ మూఁడవకనవ కలయ
న్నూడనివాఙ్ముణ్యాకళ నిగూఢుఁ డనంగుం
డీడేఱుఁ దనదుమనము
నూడ ననలేనిముగుదకోమిరెల మదులన్॥ 6

క:-ఆర్య! మీ వెప్పేడు శుభరహస్యాలేగా! అందఱి అనుభవాలకు
సూటిగాకూడా వుంటై.

కం:-పిల్లా !

మ॥ ఉబుకున్ రమ్యతతోడ సంగముల నెన్నో బింకము ల్మీఱఁగ న
యువ్వబలాటంబులకుప్ప లౌకుచయుగం బుత్ప్రోతలూఁప న్గబా
గుబిగా, నమ్రిత చార్ష్ట్యము న్దైఱులుగా గొండ్లిస్మరుఁడూనఁ దో
సబురుల్వాఱు వయస్యమేఁలసము మించ న్వేఱ్ఱసం బున్న దే॥

క:-(నవ్వి) సరేకాని, మీరువిన్న దేంలేదు. నేను చెప్పిందేంలేదు. ఏం!

కం:-ఇప్పటికిఁగూడ నీసంగతి మహారాజుగారికి తెలిసియుండదనియా నీయూహా! తెలిసియేయున్న నీయీప్రార్థనమునకుఁ బ్రయోజనమేమి ?

క:-వీఁడియూసమండ! రావణుఁడా! దేవిని పెండ్లాడెం ?

కం:-(నవ్వి)

గీ॥ పరీక్షయుబలశాలికైనను బాణిఁగొడ
మగుచు నలికాక్షుకార్ముకం బడ్డుకలుగు
నిట్టిమిథిలేశతనయను జెట్టఁబట్టఁ
నెట్టి త్రైలోక్యవిజయియు నెంతవాఁడు !॥ 8

ఉత్తమక్షత్రియుండగునీవిదేహరాజు దశకంఠుని బలవంతముండినను దనప్రతిజ్ఞను మార్చుకొనువాఁడు కాఁజాలఁడు. ఇది కేవలమసంభవము,

క:-అదట్లే కావాలె మీనోటివాక్యాన్న. ఇప్పుడా రామలక్ష్మణులెందున్నారో ?

కం:-ఆ దేవాలయపు తిన్నెమీదనే,

క॥ మును లగుజనకుశతానం
దుని విశ్వామిత్రుఁ గొల్వ దొరకొని "కొనుమీ
నను నను" నను మోక్షస్వ
ర్గనిలూఢిన్ జ్ఞానకర్మరతి నిల్తు ర దే॥ 9

మనము వచ్చి చాలసేపైనది. కన్యాంతఃపురమున కరుగుదము పద. (ఇరువురునిష్క్రమణము)

ఇదిమిశ్రవిష్కంభము

రంగము - జనకుని జేవిడి.

ప్రవేశము:- జనకుఁడు, శతానందుఁడు, విశ్వామిత్రుఁడు, రామలక్ష్మణులు.

జ:-(సంతోషముతో) విశ్వామిత్రభగవానుఁడా!

క॥ భవదాగమనానందం
బవశ్య మగుపడనియల్లు నగుపఱచు చుమా
దివులు వ్వదల్చి కడును
త్సవమై సుదినం బొనర్చుత న్నే డనఘా!॥ 10

మఱియును,

ఆ॥ అద్దిరా! ప్రదక్షిణా ర్చిర్వితానుఁడై
కొను హవిస్సు లగ్ని జనపదముల,
నాంగిరసునిసుశిక్కనలయదు శాంతిక
పౌష్టికముల, నీప్రభ ల్వెలుఁగ॥ 11

వి:-మిత్రమా! సీరధ్వజా! చాలకాలమునుండియే నీయీజనపదములు శాంతములుఁ బుష్టములు నగుట మే మెఱుఁగనిదియా?

గీ॥ బ్రహ్మమీమాంసలోనితత్త్వం బెఱుంగు
నీవెకా దండధారివిగా వెలసెదు,
ఆంగిరసుని ప్రపౌత్రుఁడు నంతఘుటకుఁ
డీశతానందుఁడే పురోహితుఁడు కాదె॥ 12

(నవ్వుచు) అల్లుఁడు దొరుకునా యనునాందోళన మొక్కటియే మాసాయమునుం గోరుచు మిగిలియున్నది. కాకున్నను, నీబోంట్లకు దుఃఖసంతోషములన లోకసంగ్రహార్థమే కదా!

ఆ॥ అల్లతైత్తిరీయయాజుషంబుల మూర్తి
మంతములుగఁ బలుకుమంత యెవ్వఁ
డట్టియాజ్ఞవల్క్యుఁ డగుఁగాదె వేదాంత
సారమెల్ల నీకునూఱిపోసె!॥

ల:-(రహస్యముగ) అన్నగారూ! “విదేహపతియన సామాన్యుఁడుఁ గాఁడు. అతనిచరిత్ర మతిపవిత్రము నపరిమేయము నాశ్చర్యకరము” ననిగురువుగా రెప్పుడునను చుందురే, ఆయనఘు లీయనయే కాఁబోలు!

రా:-(ప్రమోదానురాగములతో) వత్సా! వాగేపిరోయి! శతపథము లనఁబడు వాజసనేయ బ్రాహ్మణములలో సంధికారిగ ముందు వీరిని జెప్పి మఱొకరిం జెప్పవలయును. యాజ్ఞవల్క్యభగవానులే వీరికి శుక్లయజుర్వేదముం గఱపినది. (కొంచెము తేఱిపాఱఁజూచి)

సీ॥ యతులనోడించి, తనగురువైన యాజ్ఞ
వల్క్యునకు వేయిగోవు లర్పణమొనర్చి,
వేవెలుంగుప్రశిష్యుఁడై వెలయునాతి
ధేయు మైథిలునకు సేవ సేయువాఁడ॥

జ:-తాము సెలవిచ్చినయన్నింటిలోఁదమ రేసమర్థులు. వేవెలుంగుశిష్యు లగుయాజ్ఞవల్క్యునొద్దఁ జదువుకొంటి ననుటొక్కటియే నాసకల యశస్సులకు మేలిపతాక.

వి:-ఓహో! యోగీశ్వరా!

ఆ॥ ఇంతవాఁడు జనకుఁ డిట్టిఁడు యాజ్ఞవ
ల్క్యుం డటంచుఁ గవులె కొలువలేరు,
మీప్రవాహిత్వతాప్రబంధముఁ బాడఁ
గాదె వేయినోళ్ళ వేదచయమె॥

శ:-భగవానుఁడా! ఇట్టివారేకదా! మూఁడుభువనములలో మహనీయ మగుమహిమ గలమనీషులు!

జ:-(లజ్జనైన చిఱునగవున) భగవానుఁడా!

క॥ తిమనుడు లఘుమర్షణబు
క్షమముగఁ బాపంబు లణఁపఁగలవని బహుకా
లముగా వినవలతును, దుః
ఖమె పెనుచు మదర్థవాదకల్పన మేలా?॥

ఇఁకఁ దాని దయచేసి మానుఁడు (లలాటాంజలిం బట్టును.)

వి:-(నవ్వుచు జనకునియంజలిని వదలించుచు) మిత్రమా! సీరధ్వజా చేమోడ్పు లేటికయ్యా! ఇఁక మే మామాటలనేయెత్తము. సరియా శివునివిల్లు నెక్కువెట్టఁగలనేర్పరి యగునల్లునిఁ బడయుటచేఁ బ పూర్ణప్రతిజ్ఞుఁడ వౌదువుగాత!

ల:-(అపవారించి) అన్నగారూ! వీరలొకరినొకరు పరస్పరోత్కర్షముల నెన్ను టెంతేనిరమణీయముగ నున్నది. ఈఋషిసంఘ మెంతపావన మైనది!

రా:-సోదరా! నీపలికినదే వాస్తవము.

గీ॥ లోకసంగ్రహమే యాత్మలోఁ దలంచి
శ్రుతులఖిలముల నీఋషుల్ స్మృతులొనర్చి
కీర్తిఁగని, రొండొరులమహోత్కృష్టమహిమ
మొండొరులకే సువేద్య మన్యులకుఁ గాదు ?॥ 17

జ.-(సంతసముతో) మిక్కిలి యనుగ్రహింపఁబడితిని.

శా॥ ఆహా మాగమసారమో! వెలిని లో నాపాపము ల్మాల్చుబు
గ్వ్యాసంగంబొకో! యాజుషం బయినమూలార్థంబొ! నా నెందుమే
లై సాక్షాత్కృతిగా ఫలంబు లిడునీయాశీస్సు నాబిడ్డ సం
తోసిల్లన్ వరుఁ డిందె యెందొ కలఁడన్నాచార్యవాక్యము నేఁ పెడిన్ ॥18

వి:-(వ్యంగ్యమందహాసమున) మిత్రమా! సీరధ్వజా! నిజమే.

మ॥ బహుదుష్ప్రాపము కంటె మిక్కిలియుదుష్ప్రాపం, బిహోముష్మికా
ఘహరం, బధ్యయనంబులేని శ్రుతినాఁగా నొక్కటౌ నిఖిలం.
బహహా! లో వెలిపావహారి, శ్రుతిమాతావ్యామున్. శుద్ధిక
న్యాహామున్ శుద్ధిని గూర్చు విప్రునుడి, వహ్వా! తప్ప టున్నె
యెటన్॥ 19

శ:-(తనలో) నిజముగ రామభద్రునే అల్లునిగా నిర్ణయించుకొనియే యీమహాత్ముఁ డీసీరధ్వజుని మాటిమాటికి వ్యంగ్యాలాపములచే భ్రమపెట్టుచున్నాఁడు. కానిమ్ము! ఈయనకనుకూలముగ నే నేమియు నెఱుఁగనట్లుగ నడిగెదను. (విశ్వామిత్రునితో) గరుడకేత నుని శ్రీవత్సకౌస్తుభములవలె నున్నయీకుమారు లిరువు రెవరి బిడ్డలో

వి:-(తనలో) వత్స! శతానంద! బలే! ప్రస్తావనమునకు మంచి తేవును గల్పించినావోయి! (ప్రకాశముగ) కుమారా! గౌతమా! వీరిరు వురా కాకుత్స్థకులోద్భవులు!

శ:-(గుర్తించినటుల) ఓహో!

చ॥ సవనపుఁదేజి నంటుకడుజాంఘికమైనస్వతంత్రకీర్తితో
భువి దుగదోయిహోతలకుఁ గొల్వగ నిచ్చి సుతేష్టి సర్వదే
వవరులఁదుష్టిగా సలిపెఁ బంక్తిరథుం డనురాజమౌళి, వి
ష్ణు వట స్వయమ్ముగా ఫలమును స్ఫలభోక్తయు నయ్యెఁగాదొకో!

ఏ రింతకు నాదాశరథులనినమాట? రామలక్ష్మణులే కాదా! తాటకారాక్షసిని జంపునట్టి మంగళమును సంపాదించుసమిత్రమై భగవానులగుతేసురు వీరిచే దివ్యాస్త్రమంత్ర పారాయణమును జేయించుటయు నందునకు గురుదక్షిణగ వీరు తాటకాదమనయాగమును నిరంతరాయముగ నల్పి మిమ్ము సేవించుచుంటయు వాసవము లేగదా!

వి:- కాకేమి.

జ:- (అనురాగబహుమానములతో రామలక్ష్మణులఁ జూచుచుండును)

శ:- మఱి, వీరిలో రాముఁడెవరు లక్ష్మణుఁడెవరు?

వి:- (రాముంజూపుచు) వత్స!

చ॥ రవికులజాతులై వెలయు రాజుల సంతనుతీవ వాడులే
యవ్వపడఁబోని మంజరుల స్వచ్ఛపరంపరలోన నల్వొరు
ద్భవమును గాంచి, రగ్రిజుఁడు తాటక పేరిటికాళరాత్రి వే
కువ తేఁడె రాముఁడయ్యె చెలఁగు న్వకథాంకురమూలకందమై॥ 21

(లక్ష్మణుం జూపుచు) ఇఁక నీతఁడో! లక్ష్మణుఁడు.

శ:- భగవానుఁడా! అవసిష్ఠువ్రిభావమున నీరాజవంశ మభివృద్ధి నందుచున్నదన్నమాట.

జ:- (నవ్వి) వ్యాసురా! బాగు! బాగు! తాము మావంటివారితోఁ గలసి మెలసి వినోదముగఁ గ్రీడించుచున్నారు, లేకున్న

మ॥ కౌనకాశ్రకుఁడు "హు"మ్మటం చవమతి న్మాద్వన్ద్రికంతుండు సి
గ్గునఁ బాటొందుటె నేతియాహుతిగఁ గ్వతో ర్గిధాగ్ని విశ్వంబుఁగా
ల్చునొ నా లేఁగఁగఁ దొట్రిన న్గదిసితోస్సున్ వృద్ధచాటూక్తులన్
మానవిన్ బద్మభవుండె సల్పుటఁగదా మానన్ దిగ్రిలోకావదల్!॥

అట్టి భగవానులగుతమకా యాగయాజమాన్యమున నన్మ్యల సంరక్షణము?

శ.-రాజర్షీ! అది సమంజసమే, ఇంకనేమనిన, దీక్షఁగొన్నవారు కోప
గింపరాదు కావుననే రాజులు రక్షణకిరియ నెన్నుకొనఁబడుట.

జ:-(సంతోషమున రామలక్ష్మణులఁ దడవుపలక్షించి రహస్యముగ)
శతానందభగవానుఁడా!

మ॥ పరమాత్మానుభవైకనిష్ఠ చలియింపన్లేమిసూ మున్న భా
స్కరశిష్యున్గనుఁ గొల్చుచోనయిన, విశ్వామిత్రుఁడే తానె యీ
వరుస న్నాయిలు జేరినాఁడనిన, వహ్వో! యేమి ప్రభావంబొకో!
మఱితున్ సర్వసుఖంబు లీదశరథక్ష్మాపాలు సంతు న్గనన్॥ 23

శ:-ఓరాజర్షి శేఖరా! విదేహాధిపా! అటులనే కనుపడుచున్నది. నాకుఁ
గూడ నీరాజపుత్రద్వయదర్శనమున సీతోర్మిళలు మనసునకుఁదగిలి
యచటివుండి తొలఁగుటయే లేదు.

జ: (విశ్వామిత్రునితోఁ) భగవానుఁడా!

క॥ ఈవయసుబింకము మనో
జ్ఞావయవముఁ బొందు వీరమద్భుత మగుగా
ధావిపులాంకూరంబట
ఈవీరులఁ గనుటఁ గృతిన యేననుకొందున్॥ 24

వి:-(దెవ్వాడు నగవున) సీరధ్వజా! ఎటులు కృతార్థుఁడవో నీమనసునే
తెఱచి యడిగికొనుము.

చ॥ రవియఁట, సర్వతేజములరాజఁట వీరలవంశకర్త! బ్ర
హ్మవిదుఁ డరుంధతీప్రియుఁడె యానఁట వీరల ధర్మనిర్ణయ
ప్రవరుఁడు! నచ్చె నీమనువు త్వన్మతి నామతినైన; నేమినే
యవలయు శుల్కసేతు వొకఁడడ్డము దారుణమై చెలంగెడిన్॥ 25

రా:-(రహస్యమున) మనకథల నేటికో తడువుచున్నారు?

వి:-(నవ్వుచు) శుల్కమన నది యొక్కటియే యంతరాయమైనచో
నదియెంతమాత్రపుదిలెమ్ము!

జ:-(ఖేదముతో వితర్కించి యువవారించి) శతానందభగవానుఁడా!

చ॥ పరమమునీంద్రుఁ డీజనకుపట్టికరగ్రహణం బదెంతొదు
ష్కరతరమూల్యసాధ్య మనుసంగతి సర్వముఁ దాను యూహిగా

నెఱిఁగియెఱింగి తెలికగ నిట్లువచించెడిభావ మేమియో
గుఱుతిడ లేక నామనము కుమ్మరిసారె యనన్ భ్రమించెడిన్
అదియుంగాక విచారింపఁగా

గీ॥ స్థాణు వంతటివాఁడు హ స్తముని దాల్చు
దీని నెక్కిడు టంత్రప్పెఁ బైనిగలదె !
యేకొనర్చినప్రతిన నేమేసిరంధ్రి
మొఱరు నే సాకుతోఁ దప్పఁగా నెడిరికి !॥

శ్రీ:- పాపము శాంతించుఁగాక! శాంతించుఁగాక !

గీ॥ హరుసివిల్లు దుర్లంఘమన్నా టదినిజంబు
నీప్రతిన మార్పరామియు న్నిశ్చయంబు
అయిన, రాఘవశిశుసహజానుభావ
దీప్తియు గభీరతయుఁ దేట తెల్ల మొకద

జ:-(విశ్వామిత్రునితోఁ) కౌశికభగవానుఁడా! ఎంతవితర్కించుకొనియు నీవాక్కులకర్థ మెఱుంగ లేకున్నాఁడ !

వి:-(నవ్వుచు) అయినచోఁ జంద్రకిరీటు కార్ముకరాజమును జూపెట్టుము రామభద్రుఁడే వలయునర్థమును వివరింపఁగలఁడు.

రా:-(సంతోషము నఁదనలోఁ) గొంతెమకోర్కులతో నన్ను నే నెట్లు వినోదపెట్టుకొనుచుంటిని! నాకుతుకములన్దీర్చుకొనఁ గేగురుఁడైశ్వరమగు కార్ముకముం డెమ్మనుచున్నవాఁడు. (జనకునిజూచి విమర్శతోఁ దనలో)

గీ॥ బాలురకు నింతపని యసంభావ్యమనుటా!
గట్టిఁగ మ్మిక మునినుడి న్గలుగుననుటా!
కానదుమది కన్ను నిజము యీధరణివిభుఁడు!
ఏమనునో యంచు బెదరు నాహృదయ మిపుడు॥ 29

జ: ఇంచుక యోచించి నిట్టూర్పుతోఁ) భగవానుఁడా! తమంతటివారి ప్రాపు దొరకునదృష్టమును మైథిలి నీరఘు రాజకుమారునకొకప్పటికైన నీఁగలుగునదృష్టము మావంటివారికే నాకల్గును? అట్టిచరితార్థత మాకుండునా.

రా:-(సిగ్గుపడును)

జ:-(శివుని విల్లువంకఁజూచుచు)

చ॥ తనభువనావనవ్రతవిధానము నింద్రధనుస్సదేఁ హా
జనపతి కార్ముకంబుల కొసంగి తుది న్హరుఁడయ్యెనట్టితేం
డ్లును. ముదివింటి దీనిఁగని, లోఁగడఁగల్గిన జ్యాకిణాంకమో
హానమృగనాభిసౌరభితహస్తములన్ వృథగాఁ దొలంగరే!॥ 30

వి:-మిత్రమా! మహాపుణ్యరాశివగునిన్ను నీవే యవమానించు
కొందువా?-

ఉ॥ అంతయుఁ బూర్వఁగాఁ గలుగునంతటి దేసుమి నీదుభాగ్య. మా
వింతలశోభనంబులకుఁ బ్రేక్షకు లౌదుము మేము, భూమి న
త్యంతము నందు సర్వభువనాభయదానసమర్థధారుణీ
కాంతులు, రామభద్రులనఁగా దగువారొకొ వార లందఱున్॥31

ల:-(తనలో) నే ననలయు ననుకొనినది గురువుగారే సెలవిచ్చిరి.

జ:-భగవానుఁడా! మణిమంత్రౌషధాములందువలెనే యీరఘురాజ
కుమారులందుఁగూడ నచింత్యప్రభావమున్నదనినమాట, ఈసంగతి
వినుఁడు.

చ॥ దివిజులశక్తులన్నిటిని దీసి విరించి సృజించెఁ, బార్వతీ
ధవుఁడె సమాదరించె, హరి దాన శరంబు, ఫణీంద్రుఁడల్లె, యీ
భువనము లన్నియుం గెలుచుపోరిడ, పురంబులు మూఁడె లక్ష్య, మ
ట్టివిలు మహాద్భుతంబును గడిందికి నేనిఁ గడిందియేసుమా॥ 32

శ:-ఇట్టి లిపినాశధనుర్విశేషతల నెన్నుకొను టెంతసేపని? విశ్వామిత్ర
భగవానులనే విశ్వసించి గౌరవింతము. అదికాకున్నను రామభద్రున
కశక్యమగుపని యొకటికలదా:

శా॥ ఏదో రాక్షసకోటిహోమమని యొం డేర్పాటుగాఁ బూని, క్రి
వ్యాదిన్ దాటక నాదిమేంధనముగా నాసామిధేనీపఠా
పాదాయంబునఁ బొల్చె బాలకుల యల్పప్రౌఢబాణాలనే,
కాదే స్పష్టము రావణున్ గెలుచు నీకం దంచు నిద్దానిచేన్॥ 33

[ప్రవేశము:- తెరప్రక్కగాఁ దొంగిచూచుచు నొకపురుషుఁడు,]

పు:-దేవా! దశాననపురోహితుఁ డగుశౌష్కలుఁడు రాజుగారింజూడఁ
గోరుచున్నాఁడు!

శ.-(ఉద్వేగముతో) ఆఁ!...రానిమ్ము! పురుషుఁడు-నిష్క్రమము)

రా:-(వ్యథతో రహస్యముగ) తమ్ముఁడా! లక్ష్మణా! ఈ రాక్షసరాజు కామారికార్ముకరాజపరిచర్యామహోత్సవమునకంతరాయమయ్యెనే

ల: ఉత్సవ మొక్కదానికే కాదనుకుందును. (నవ్వును)

రా:-(ప్రేమయుతరోషహాసములతోఁ గీఁగంటఁ జూచును)

శౌ:-(ప్రవేశించి, అందఱఁ బరీక్షకముగఁ జూచి తనలో) జనకశతానందులతో విశ్వామిత్రునకే కాక మాకును శత్రువగువిశ్వామిత్రుఁ డిందుండు లేల చెప్పుమా! (యోజించి) ఉన్న నేమగు నుండనిమ్ము హతకుని! (చేయిదక్షిణమునకుఁజూపి) ఈక్షత్రియబ్రహ్మచారు లిరువురు నెవ్వరో!

గీ॥ మౌంజి దండంబు మొదలైన వ్యంజనములఁ
దొలఁకు శాంతరసం బొక్కదోహదముగ
వెలయ విల్లంబుల న్వ్రాల్ల వీరరసము
గెలుపుచున్నారు పుణ్యాలక్ష్మి కరుచుల!॥ 34

ఈ బాలకు లిద్దఱు సహోదరులుగ నున్నవారే!

గీ॥ ఋగ్యజుస్సామములమూటి కేర్వ మూర్తి
మంతములుగాఁగ వెలుఁగొందుమంత్రవిధుల
నయ్యధర్వాగమంబొకో! యనఁగ వీరి
ముగురి చెంగట నురుతేజముల వసింత్రు॥ 35

(విమర్శించుకొని) నిశ్చయముగా లక్ష్మణద్వితీయుఁ డగురామహతకుఁడే అయ్యుండవలయు! విశ్వామిత్రుననుసరించి యీమిథిలం బ్రవేశించియుందురు. (క్రోధశోకములతో) అయ్యో! బిడ్డా! సుకేతుకుమారీ! తాటకా! ఇట్టిమానిసినిసుఁగుల చేతిలోనా నీ కట్టిదైవదుర్విపాకము! అనరణ్యవంశజాతుఁడగు నీక్షత్రియబ్రహ్మచారికే యింత మొడలెఱుంగనిశివమా! ఎంతకష్ట మెంతకష్టము!

ఉ॥ కౌశికయాగబాంధవుఁడుగాఁ జనుదెంచియు వీరసుందరై
త్ర్యేశకుమారరక్తమధుతృప్తి మదించుశరాళిచే దురా
వేశము నొంది, భ్రష్టసువివేకత నాఁడు దశాస్యవంశపా
లీశమహానిఁ జేసినమలిమ్లుచుఁ డౌవటు వీతఁడేమొకో!॥ 36

కానిమ్ము! ఇతనిభుజబలపరాక్రమములు చూతుముగాక!
(సమీపించి పరిహాసముగ) జనకమిత్రులందఱుం గుశలముకద!
జ:-రావణపురోహితులకు స్వాగతము? ఇట నాసీను లగుదురుగాత!
శౌ:-(కూరుచుండును)
జ:-ఏమి! మీరావణరాజునకుఁ గుశలమా? ఏలకాదు లే?

గీ॥ అయ్యధర్మాగమోపాయహవనదక్షు
లయినత్వాదృశు లెందఱో అందెసంగి
యెట్టియాపదనేన్నట్టుపెట్టుచుండ
నతడు కుశలము యనివేఱ యడుగనేల?॥ 37

శౌ.-(నవ్వి) మహాక్షోత్రియా! సీరధ్వజా! అతనికేనా ఆపదలు?
మేమా వానిని బాపుట? బాపురే! తనభుజదండములను మదపు
టేనుంగుల చేతఁజుట్టుకొనబడినవక్షస్థలమను సౌధమునసురక్షితముగ
నున్నత్రిభువనలక్ష్మిమహోత్కృపురమున వేంచేసియుండు నాలంకా
నాథున కెట్టియాపద ముట్టఁగలదు? ఇటువినుము!

ఉ॥ భీతిలి పాఱుచోనయిన వీపుఁగను ల్కడువిచ్చి యేనిచే
ఘాతతి నాజి వేగనులసామి కను న్దనమోఁల నున్నటుల్!
పాతు నగల్చి వెండిమల పై కెపఁ డింతనె యెత్తె నాగలో
కాతతజైత్రయాత్ర కన! నట్టెరు ముట్టునె యెట్టియాపదల్?॥ 38

ల:-(కోపముతో రహస్యముగ) అన్నగారూ! వాలిచేతను వేచేతుల
హైహయరాజమౌళిచేతను నాశమొందింపఁబడిన శౌర్యసారము
గలరావణుఁ బ్రశంసింతురేల?
రా:-తమ్ముగుఱ్ఱా! అట్లనరాదు! తాదృశు లందఱుం గొప్పవారే
సుమా! ఏమనిన?

ఉ॥ అతనియుద్ధసుస్థిరతయంతును వాలియె, కార్తవీర్యభూ
నేతయె కాంచిరన్నఁ గడునిష్ఠుర మాతనిమూపుపెంపువి
ఖ్యాతి! నరీల్ల గొంతు నఱుకన్ దరిఁ జిందిన యెమ్ముతుంపులన్
బ్రీతి స్వకేళచర్మమున వేమృడుఁడే తొలఁగించు టెన్నరే?॥ 39

మఱియు,

శ:-బ్రాహ్మణుఁడా! మేము చాలాకాలముక్రిందటనే ప్రతివచనము నిచ్చియుంటిమి

శౌ:-ఏమీ! రాజపుత్త్రిని సమర్పించుటకా కింకెట్టిదా ప్రతివచనము?

శ:- క॥ హరువిల్లెక్కిడి మము నె
వ్వారు సంతోషింపఁజేయువారలొ, కనన్
దురు వారె బహుమతిగ నీ
ధరణీసుత మైథిలిన్ యథార్థముగాఁగన్॥ 44

శౌ: హర! హర! పాపము శాంతించుఁగాత! శాంతిరించుఁగాత!
మీ ంటివారుఁగూడ నిట్టియక్షరములనా ఉచ్చరించుట? ఔరా!

చ॥ ఎవరికరాగ్రము ల్శతము నెత్తెకుబేరగిరిన్ గళోక్తిగాఁ
గవెస గడించెనో కులిశకందళసామ్యదృఢత్వకీర్తి! నా
ప్రవరమహేశ్వరుం డయినరావణుఁ డేడ? ననార్య మీదృశం
బవుపనిఁ జేయుటేడ? వినినంతనె మానస మోకిలించెడిన్॥ 45

శ:-(నవ్వి) బ్రాహ్మణా!
గీ॥ ఉత్తమక్షత్రియత జన్మమెత్తినాఁడు
ప్రతినఁ దప్పఁడు జనకాధిరాజితండు
ఎక్కిడఁడుగాదె దశకంఠుఁ డీధనుస్సు?
నెఱుఁగఁగాలేవె? మాజవాబేమొ నీవు॥ 46

శౌ:-(హసించుచు)
గీ॥ అంగిరసుఁడును మఱిపులస్త్యమునికూడ
నబ్జసంభవుపుత్త్రులైనందున, కహా
ఆంగిరసుఁడవు పౌలస్త్యుఁ డగుదశాస్యు
నందు విడనైతి జ్ఞాతివై రానురక్తి॥ 47

(రోషమున)
గీ॥ ఈదశాననుఁడేమొ మహేశ్వరుండె!
ఇతరనృపు లెంచఁ గడుక్షుద్రులే ధరిత్రి!
నీపినాకంబు నెక్కిడుటేమొ శుల్క!
మయ్యయో సీతగతి యేమియౌనో యింక?॥ 48

ఉ॥ ఇట్టిమహాద్భుతం బయినయీపరిచర్యకు దీటుగాఁగ నే
నెట్టివరంబునిత్తు సమునీశ్వరు మోమున విస్మయంబు గ
న్పట్టినఁ జూచి దాని నుడుపన్ భువనత్రయమాత్రమే వరం
బట్టులు కోరె నేనిదశమాస్యము నిన్నదె కోరు జానకిన్!॥ 52

శ:-(లేచి-తెరవైపుఁజూచి) (హర్షాద్భుతములతో తమ రెల్ల రటు
చూడవలయు!

చ॥ అలజగదేకధన్వి యగుఁనాభగవచ్ఛివమూర్తి కల్లయై
నిలచి యహీశ్వరుండు, తెగ నిండునలాగినఁ గర్ణభూషయై
తోలఁపఁగఁ గంకణంబయి ప   షము మున్నముకూర్చియుండెఁదే!

జ:-(ఉత్సేకమున)
భళిర! కదుత్థుఁ డెక్కుడెడి భార్గవదేశికచాప మయ్యహిన్॥ 53
[తెరలో-కలకలము-అందఱుం గలవరమునఁ జూతురు]
(మఱలఁ దెరలో)

చ॥ అలశివు నష్టమూర్తు లొకటై కదియుంబడె, నష్టదిక్తతుల్
పలపలమ్రోఁగె, నల్వ చెవుల న్గడుగింగురు సోఁకె, నెమ్మిదా
కులగిరు లయ్యెను, గ్గురగకోటికులాష్టక మక్కులాడె, దో
ర్బలరఘురామకర్షితపురాతన కార్ముకభేదనధ్వనిన్॥ 54

జ:-(హర్షవిషాదాద్భుతములతో) అహో! పిఱిగినదికూడ!

ఉ॥ సీతకుఁ బెండ్లికై ద్విజులు చెప్పెడియాజుపమంత్రనాదమో!
నాతులు పాడు శోభననినాదపరంపరితో రుగానమొ
కో! తతవైరినాశ మొనఁగూర్చు నుపశ్రుతి పెంపో! మింటనం
పాతిలె రామభగ్నశివభవ్యశరాసనవజ్రరావముల్!॥ 55

శౌ:-(విషాదాద్భుతములతోఁ దనలో) అహో! ఈరాచబిడ్డఁడు గురుపుత్రు
వన్నిట సమర్థమైనదిగ నున్నదే!

జ:-(సంతోషమున వి:-పాదములఁ (వ్రాలి) భగవానుఁడా! గాధినందనా!

క॥ కొనాన్నఁడు రాముఁ డాత్మగు
ణోన్నతినే జగ మెఱుంగ నుర్వ్యతనయన్

గన్నియ నాయుర్గ్నళి ల
త్కృన్నను నేధారవినుతు మాకులసీతిన్ ॥ 56

వి:-(నవ్వుచు) మిత్రమా! సీరధ్వజా! నీకెట్లభిరుచియో అట్లుసే చేయుదువుగాక!

శ:-(జనకుచెవి నేదియో చెప్పి) కౌశికభగవానుఁడా! చంద్రశేఖరు విల్లు నెక్కిడినసంగతిని మొదటఁజెప్పిననా కేమిబహుమానమో!

వి:-(నవ్వి) వత్సా! కోరుకొను మష్ట మేమి?

శ:-స్వామీ! కుశధ్వజునికూతుం డ్రిగుమాండవీశ్రుతకీర్తులకొఱకు భరతశత్రుఘ్నుల నడుగుచున్నాఁడను!

వి:-శతానందు చేతినిగ్రహించి నవ్వుచు) అంతయు మనచేతనే కావింపఁబడవలసిన దేగదా! దశరథు రావింపుఁడు!

జ:-అటులయిన భగవానులగునాంగిరసులు కోసలేశ్వరులఁ గొనివచ్చుటకుఁ బ్రియసుహృదు నంపఁగలరు!

వి:-ఆప్రకారమే కానిండు!

శ:-(లేచి) భగవానుఁడా! ఇంకఁజెప్పవలసిన దేమియుండును!

వి:-అన్నియునీకుఁ దెలియ నే తెలియునులే పద (శతానందుఁడు వెళ్ళును.)

వి.-(సంతోషము గపడఁ దనలో)

మ॥ శివువింటి న్విదళించి విక్రమమువాసిన్ బొల్చి ప్రూర్ణ ప్రతి
జ్ఞు విదేహాధిపుఁ జేసె రాఘవుఁడు. నాకున్ జూడనౌ నింక రా
ఘవవైదేహసుహృత్కులాల కగుమాంగళ్యోర్వ్తి వాహికో
త్సవముల్, నేఁటికి నాచుదీవెనలు ప్రాజ్యశ్రీలతోఁ బండెఁగా!॥57

శా.-(విన్న బాటుగోపమున నెలనవ్వున) మనుజునకుఁ బేరుఁదెప్పింపఁగలిగినది విద్వాంసులసంసర్గమే కాని కేవలవయస్సే కాదనుష్మా! అదృష్టవశమున సంప్రాప్తయగునీకన్యను బెండ్లియాడఁ గోరివచ్చిన పుల స్త్యకులసంభూతు వదలుకొనుటలో వయోవృద్ధుడయ్యుఁ బిల్లతనపుమందప్రజ్ఞ నే వ్యవహరించితివే! (విశ్వామిత్రునితో) ఓ ఋషీ! కౌశికా! ఇప్పటికైన నంతగామించిపోయిన దేమియు లేదు. తాటకావధచే నీవు లంకాపతి కొనర్చినయపరాధముం దీర్చుకొన నిదియే మిక్కిలిమంచియదను!

జ:-(అసడ్డ చేసి) భగవానుఁడా! రమ్ము! స్వయముగ రాముభద్రుదరి కేగి వాని వదనచంద్రచంద్రికాప్రవాహమున దొంగవిప్ర్వరుల మూలమున నైనసీతావిషయికప్రార్థనముల నింతవఱకు వినుచుండ మఱఁగి దుఃఖిత మగు నా మానసమును జల్లఁబఱచుకొనియెదను. చండకరు నేడికిరణములచే వాడిపోయినక్కైరవాకరమునకుఁ జల్లని చందమామ వెన్నెలకాక మఱొకమందు కలదా? (లేచి పరిక్రమించుచుండ)

కౌ:-(విచారమున నాశనముఁజూచుచు) అయ్యో! తపస్వినివగునో సీతా! పౌలస్త్యునంతవాఁడు ప్రార్థించినను వినక మీనమేషముల నెన్నుచు నిన్ను హింసింపఁజూచుచున్నారుకదా!

ఆ॥ వె॥ భూమి వ్రక్కలించి పుట్టితి వేచూడు
మస్వతంత్రవైతి! నఖిలభువన
విజయలక్ష్మికెలన నిలయు సపత్నిగా
నలువుస్వజన మెవరుఁ గలుగరైరి!॥ 58

(రోషముతో జనకునింగూర్చి)

ఉ॥ ఏరిపరాక్రమంబు వచియించుఁ బురాణములెల్ల నట్టియిం
ద్రారి భుజధ్వజాశనిభయాన మదం బఱుదేవహస్తిమై
జేరులుగాఁగ నెప్పుడు వసించుమధువ్రతపాళి చింద నా
వారణ మన్ని యేనుఁగులపాటిదె యయ్యెఁగదా గతోన్నతిన్॥ 59

అట్టిరావణ భుజాస్తంభము లుండఁగనే, ఓజనకరాజా!

క॥ అంధవృథాసజ్జనసం
బంధపరత సంభవించె వంచన నీ, కే
రంధ్రని నీ వెసఁగిన దశ
కంధరహస్తగత సీత కాఁగలదుసుమీ!॥ 60

(సాక్షేపముగఁ దెరవంకఁజూచి)

శా॥ చేరంబాఱుచుఁ జుట్టు నచ్చరలె చేఁజే వీవఁ దద్వ్యాయుభం
గారూఢి న్నిజ బాహుదివ్యపరిఘువ్యాపారసౌగంధ్యము

స్త్రైణం బాల్యదశాస్పుడే స్వామిని కామించెన్ప్రియా! జానకి
ఓరీ! రాముఁడ! పెండ్లియాడఁగలవేమో! మానుము మీపూనిక

(వితర్కించుకొని తనలో) ఓహో! ఈవిషయము మిగుల గ్రొ
దిగ పరిణమించినది. కావున మంత్రియగు మాల్యవంతునితోఁ గూ
సంప్రతించుకొని వారినింబోడఁ బురస్కరించుకొని లంకేశ్వరునకు
విన్నవించుకొననలసియున్నది. (నిష్క్రమము)

ఇది మూఁడవయంకము.



# శ్రీమదనర్ఘరాఘవము

నాల్గవ యంకము.

మిశ్రవిష్కంభము

రంగము - లంకాపురి, మాల్యవద్భవనము.

మాల్యవంతుఁడు:-(ప్రవేశించి ఆవులింతతోఁ గన్నులఁదుడుచుకొనుచు)
అరె! రాత్రి యిప్పుడే తెల్లవాఱినట్లే యున్నదే!

చ॥ రవి మెలఁగించుకించుకగ రానదె వెన్నెల మాయుసాగెఁ గో
కవితతి కాఁపురాల నెడకం దఱ దిక్కులు తెల్వినొందెడిన్;
దవిలిఁ భీతి యిప్పటికిఁ దగ్గమిఁ గాకులు గూటికొమ్మపై
చివరలనుండి "కా" వనియు జేద్పుడు వీనిడి మాఱుకూయికిన్॥ 1

మఱియు,

చ॥ వలపున దిక్తతిప్రియుఁడు వాసకసజ్జిక యైనప్రాక్సతిన్
గలిసెడివేళ యంచు నినకాంతముల న్నెగలూఱఁజేయు వె
ల్గుల, సిరి భోగనిద్ర లిడు లోకనిరంకుశసౌఖ్యము గ్రక్కమా
కలనగఁ గోకులన్ గుముదకాంతలఁ దాఁచెడిఁబో నిధానతన్॥ 2

(అన్నివైపులం జూచి, సంతోషముతో) ఔరా! దశవదను
భుజార్గళముల నిరంతరపరిపాలనమునఁగదా పౌరుల యీనిర్భరా
మోదసంభృతసంభోగపారవశ్యము!

చ॥ రవి తన వెల్గుక్రొన్ననల రాత్రితమంబును దూర్పునుండి మా
న్పువరుస వెల్లడించెడి మనోభవకేళివిలాసగేహము,
ల్నవరతి కందుఁ జేరఁజను నారులు నాథుల క్రొమ్ముటిమ్ముల,
న్దవులు స్వపత్రభంగరచనల్తమకొంగుల దీర్తు రల్లదే!॥ 3

మఱియు

చ॥ మృదునలినీవనుల్ తెలుచు మేలివిదూషకుఁడైన భానుఁ డి
టుదితుఁడు గాఁగ నాయకుల యుబ్బులఁబొమ్ములఁదారుమారుగాఁ

బొదలు నిజాంగనక్రియలను లక్కనుచుం గోడి యుత్పలాక్షులౌ
ముదితలచన్నులందు దళములొక్క నెడి స్వాంక లొప్పదింపోఁగన్॥ 4

ఇదిగో! ఈవైపున -

క॥ ప్రియునిల్లు వదలి తమచెయి
చెయికలుపున నిండ్లు కరుగు చెలిగమి కడునా
త్రయి పులకలు గల్గుండని
మెయిఁ గ్రమ్మ రహస్యకథల మేలమెగవుఁగా॥ 5

మఱియాదిక్కునసో!-

ఉ॥ కాఁదగుఁ గ్రొత్తశోభనపుఁగాంత, "రహఃకథఁ జిత్రమేమికే?"
నాఁదన నెచ్చెలుల్, త్రపపెనంగఁగ నుత్తరమీక వాల్చు మో,
మూదటఁ బత్రభంగముల నా చెలు లద్దుచు గోటిగంట్లపై
నూఁద జమత్కృతి న్దెలిపె నొందు నిశాసుఖపారవశ్యమున్॥ 6

(ఇంచుక యోచించి) సీతావరణమునకై పంపఁబడిన పురోహితునివలన నక్కాకుత్స్థకుమారుని మానవాతిశయమగునట్టిమాహాత్మ్యమును వినినప్పటినుండియు నామనస్సు క్షోభిల్లుచున్నయది.

ఉ॥ ఏలజనించు వింతలిడు నింతటి తేజు మానుష్యులందు? రాఁ
బోలు నెదో ప్రయోజనపుఁబూనికతో, నిజ మెన్న నమ్మెయిన్
గ్రాలుఁగదా చరిత్రలిట; రావణు వాలిట నెన్ను నాదునే
త్రాలిటు విప్పియుండఁగ నరాతియు వేఁగఁదొడంగె నిప్పరో!" 7

మఱియు

చ॥ వినఁ గటువైన యామిషలవింతఁ గుములొక్కను మానసంబు నే
ర్పునఁ బయిమందహాసము గబులొక్కన నద్దెసఁ జూడిక్కఁ గప్పియున్
నను నిపు డాదుకోవినఁడు నాబుమతండు దశాస్యుఁడౌర! నం
దనసుమబద్ధదేవవనితాకబరీరసహా సుఁడేనియున్

(విమర్శించి మిన్నుఁ జూచుచు) అయ్యో! మాయీ చిరంజీవిత్వ మెంత దారుణ మగుచున్నది!

చ॥ ఇతరులనుండియే యభయ మిమ్మని కోరితి ప్రీతుఁడైన గీ
ష్పతిని "మనుష్యులెంత" యనుపంబినగర్వము పేర్మి నాఁడు! నేఁ

దలితరసాము మర్మములనంటెడి నాహార పాటు, శాంతిక
ల్గుత! మదిగాక నీకు పటులున్నవ. వత్స! దశంబు శీర్ష మాల్ !॥ 9

(విమర్శించి) అహో! మిథిలాపతి యెంతయు చిత్రజ్ఞ తాశూన్యుఁడు!

ఉ॥ కౌశికుకుట్రి మామనువుఁ గాదనెనే ఎననిమ్ము, పూర్వమా
నీశపుల స్త్వవంశమనియో న్మదినెన్నఁడె! వారుపీరు నే
లా? శతమన్యుదొట్టి సకలావనిపాలకిరీటరత్న పా
ళీశుభజుష్టపాదుఁడె! భళీ! తగునల్లుఁడు కాకపోయెనే?॥ 10

(ముందుఁజూచి) మిథిలావృత్తాంతముకొఱకుఁ బంపఁబడినశూర్పణఖ యింకను రా కాలసించు టేటికో?

శూ:-(ప్రవేశించి) అహో! మనోహరంగా సీతావివాహంకొఱకై చేయఁబడినసింగారాలతో జిగజిగని మెఱయుచున్న రఘుకులకుమారుల ముఖరాజీవాల చూస్తూంటే, అసహ్యమైనప్పటికీ నేనప్పుడున్న మనుష్యాకారం నన్నుఁ గృతార్థురాల్నే చేసింది. విరోధులందే యైనా ఆగుణాలు నట్టిప్రకృతి యెంతో బాగుందనిపించిందే!

మా:-(చూచి, ఆదరముతో) ఏమి? అమ్మాయి శూర్పణఖేనా! ఇంకున్నాఁడ నిటురా అమ్మ!

శూ:-ఇదుగో! ఈ ప్రాకారశిఖరా మున్నగృహోపరిభాగాన్నే ఉన్నాఁడే నాపిన్నమాతామహుఁడు! అహో! దుష్కర కార్యలెంత దురనుసంధేయములో! కాకున్న, నిద్రమత్తుకనులతోఁ బ్రతిక్షణ మావలించుటతో నాస్వరంగాన పెంపెఱలాడు మనసులోని కఠినకార్యాల్లో నెవరో మఱొకఁడుగాఁగనిపిస్తున్నాడే! సామాన్యలొద్ద మంత్రిగనుండడమే గొప్పసంగతనవచ్చునే. అట్టాంటప్పుడు మితిమీఱిననాహసకార్యాల కురుకుచుండే ప్రచండచరిత్రుఁడైన మారాజురావణుదగ్గఱమాట చెప్పాల్సిందేముంది! నాకోసరంగానే కనుపెట్టుకున్నాఁ డనుకుంటా! ఇఁక దగ్గరకు వెళ్తా! ఆర్య! నమస్కరిస్తున్నా!

మా:-పిల్లా! నీకుశుభమగుఁగాక! ఇక్కడఁ గూర్చుండుము. భరతశత్రుఘ్నులతో దశరథుఁడు జనకునింజేరినాఁడా?

శూ:-(కూర్చుండి) తాతా! దశరథుండొచ్చి గోదానమాంగల్యాదులన్నీ ఐంతర్వాతే మిథిల న్నను చేరవచ్చింది.

మా:-(నిట్టూర్చి) దీనియర్థము తెలియుచున్నది. జానకివివాహమైనదనినమాట.

శూ:-మఱిఅంతే?

మా:-(విమర్శతో) ఓహో! దుర్గాత్ముండైన కౌశికుండగురాచబాపని మర్మాటక మేమనవలయు?

మ॥ సవరక్షార్థము కోసలేశసుతు బిచ్చం బెత్తినాం! డస్త్రవి
ద్య విశిష్టుం బొనరించి వాని దనుజధ్వంసంబుం జేయించినాం!
డవినీతిన్ విఱిపించి శంభువిలు సీతావాప్తి నొందించినాం!
డెవి మాయావటుమూర్తిచే నికను జేయింపంగనున్నాండొకో?॥11

శూ:-తాతా! అదంతా నిజమే, అమాయదారిబాపండుంగూడా వసిష్ఠమహర్షి ముందర్నే వెలిగిపోతూ కనబడ్డాండంటే

మా:-బిడ్డా! తపస్సులచే వీనికిబ్రహ్మర్షిత్వము వచ్చినను క్షత్రియకార్యనైజమును విడిచినాండు కాండు. పైంగాం బుట్టుకచేతను, నుపనయనముచేతను, బ్రహ్మర్ష్యవాప్తిచేతను మూండుపుట్టుక లెత్తిన యీమునికిగ్గఱ నధ్యయనము నొనర్చుటచే, సహజమధురాచారుండనందగు నాక్షత్రియబ్రహ్మచారిగూడ భ్రష్టాచారుండుగ గడిదేఱుచున్నాండు. అదియటులనే యగుచుండును విను!

చ॥ జననముచే మదోద్ధతుల జ్ఞానవిహీనుల దిద్దు విద్య, యై
న నది స్వభావకృత్రిమమునన్ జతకూడ ఖలత్వవృద్ధినే
పొనరుచు, జీంకటి స్ఫురితము వుచ్చెడి నాగమణుల్ఫణాగ్రవ
ర్తనముల సర్పభీతులకుం దద్ద భయంబును బెంచునేకదా!॥ 12

కానిమ్ము! దాంటిపోయినది త్రివ్వుకొనుచుండనేల? తానేచని సీతం దెచ్చుకొందు నను దైత్యేశు వారించుటెట్లు?

శూ:-ఆర్య! బలాత్కారం తప్పితే యింకోదారి కనపడంలే?

మా:-బిడ్డా! అటులకాదు. అంతటిధర్మవిజయుండైనయవీరబాలకునిచేం బరిగ్రహింపంబడినవై దేహిని బలాత్కారమునం దీసికొనివచ్చుట గొప్పదోషమగునుజుమా! చూడుము!

మ॥ ఇది దోస్స్తంభ ముగంపు సత్త్వకషణంబే యంచు భీతిల్లుటో!
ఇది సీత గ్రహియించుసూచనము యౌనే యంచు సిగ్గిల్లుటో!
హృదిలోఁ బొందమి తెల్లమం చలరి మౌనీంద్రాళి యీ నాతిన్
బొదివెన్ గ్రక్కొనె నెక్కువెట్టి విరిచెన్బో! శాంబువింటిన్ ద్రుటిన్॥

శూ:-(నిశ్శ్వాసించి) తాతగారు నిరూపించినట్లేవుంది. అబ్బా! కాలమాహాత్మ్య మేమనాలె? ఈవిధంగాఁ ద్రిభువనలక్ష్మిని బందిగా నొనర్చుకొనిన మహారాజగు రావణునియెడనా మీరిట్లువిచారించడం?

మా:-మఱి మనుమరాలా!

ఉ॥ తా మునియయ్యు దివ్యవివిధప్రదరాస్త్రగురుండుగాఁడె? ఆ
సోమధనుర్విభంగమున నుత్సవమయ్యెఁగదా సురాళి! కీ
రాము గుణావళుల్వెలిచె రాణఁ ద్రిలోకములన్! ప్రభుత్వపున్
దీనసమానఁగా మనకుఁ దేలుఫలం బొకదుర్జనత్వమే!॥ 14

శూ:-దానికి సందేహమా? ఆవివాహమహోత్సవాల్లో నంతా నాకు బ్రత్యక్షమే ఐంది.

మా:-ఇంకనేమి? ఒక్కనికిఁ జాలమందివిసురురాలచే మృతికాదా? మిథిలానగరమును బ్రవేశించి బలాత్కారముగా భార్యనపహరించుచుండ నారాజపుత్త్రుఁడెట్లోర్చియుండఁగలఁడు? ఎగయు నాతనితోఁ బ్రజలు, జానపదులు, మంత్రిప్రభృతులు నందఱుం దోనెగయకుందురా? ఇంక దేహసంబంధులమాట చెప్పవలయునా! అనివట్టులరణ్యాగ్నివలె కోపముతోఁ బుట్టిన భరింపరానిదుఃఖము పురుషునిలో నొకవిశిష్టమగు తేజోద్రేకమును కలిగించుంగదా! మండలమంతయు నట్టివారినే యనుగ్రహించునుజుమా!

శూ:-తాతా! అయితే యిప్పుడు చేయఁదగ్గదేమిటో?

మా:-బిడ్డా! కార్యసంబంధము నెఱిఁగినదానవు వినుము చెప్పెదను. వానరులమంత్రి జాంబవంతుఁడనువాఁ డొకఁడుకలఁడు. ఆతఁడు మతంగాశ్రమవాసులతోఁ గలిసి యచ్చటఁ బరివ్రాజికయు సిద్ధురాలు నగుశబరి యనువనచరమనుష్యజాతిసంభవురాలి నాశ్రయించినాఁడు. ఆవాలిచే నిరసింపఁబడిన క్షీణులు లుబ్ధులుపట్టణము నుండి వెడలఁగొట్టఁబడినవారు నగుప్రాకృతజనములు కిష్కింధకు

సుగ్రీవకుమారు నభిషేకింప నుద్దేశించి రామభద్రుని సహాయమును
గోరుచున్నారు,

శూ:-(అడ్డమువచ్చి) ఏమేమి! ఆరాచబిడ్డఁడు వాలింజంపడానిగ్గూడా
సహాయుఁడుగ యాచింపఁబడుచున్నాఁడా! ఆఁ!

మా:-తనసహపాఠి యగుయాజ్ఞవల్క్యు సేవించుకొని నిమిసముక్రిం
దనే యుబకుఁజేరిన సూర్యశిష్యుఁడగు హనుమంతుఁడు తెలుపుచు
న్నాఁడఁట! అయోధ్యనుండి భరతునివార్తతోఁ బంపఁబడినమంథర
యనుముసలిదాసి మండుటెండచేఁ గడుంగుడుస్సి యూపిరిచెడి
మిథిలాపురీపరిసరములఁ బడియున్నదఁట! "ఓశబరీ నీశరీరము హను
మంతునిరక్షణమున నునిచి పరకాయప్రవేశవిద్యచే మంథరాదేహ
మునఁ బ్రవేశించి నమ్మకము పుట్టునట్లు లీవార్త దశరథునితోఁ
జెప్పుము! ఈవిధమైన తండ్రియాజ్ఞసందర్భమును విని విషమకంటక
వృక్షోరగపంకాదులతో నిండియుండు దండకారణ్యాగతుఁడై! యా
విదేశ రాజపుత్త్రుఁడు సర్వవిధములఁ గార్యగౌరవము నెన్ని మఱలఁ
బ్రతిసహాయలబ్ధికవసరమును గుర్తించి వాలిని వధించిసుగ్రీవసఖుండు
కాని" మ్మని

శూ:-ఇంతకూ ఆవార్త యేమనో?

మా:- (చెవిలోఁ జెప్పును)

శూ: బలే! ముసలిభల్లూకం కార్యకుశలతా కౌటిల్యం యెంతుంది!
తరువాత?

మా:-అంతట నాశబరయోగినిగూడ సుగ్రీవుని గుణములందలి యను
రాగమున సర్వము నట్లేయని సమ్మతించి మిథిలవైపునకు బయలు
దేరినదని జనస్థాననిశాచరులు వచ్చిచెప్పిరి. ఈజాంబవంతుని సఫ
లముఁ కాఁగల యీప్రయోగముచే విరాధాదులచే నధిష్ఠితములైన
వింధ్యాపర్వతగహ్వరములలో భార్యాపహరణము సుకరముకాఁ
గలదు. దేవాసురయుద్ధమునందు ప్రథమగణ్యుఁడును విబుధపతిచే
నుపదేశింపఁబడిన మాయాపరిహారణమంత్రధారియునగు దశరథుని
దాఁపున మనమాయ లెక్కవుగదా!

శూ:-(విచారముతో) గృహాగతుఁడతిథిగదా! ఇట్లొనర్పవచ్చా?

మా: (నవ్వి) అమ్మాయీ! పెద్దలకుండఁదగు మేలివివేక మున్నది సుమానీకడ! వినుము! పెద్దలేమనిరి? దరిఁజేరినవాని యాలుబిడ్డల నపహరించువాని రాష్ట్రము చెడుననికదా! సహజతేజస్వియగునీతఁడు మనయాశ్రయముంగోరి రాఁడుగదా!

శూ:- ఊఁహూఁ! తాతా! ఇంకొకటి చెప్తావిను! రామభద్రుఁ డిట్లానే చేస్తాడ నడాని కేముంది?

మా:- దానికి సందేహమా! కీర్తికాము లగుక్షత్రియమహానుభావులు రాజ్యోపభోగముల ననుభవించుచు నగళ్ళనే నిలిచియుండఁగలరా?

శూ: ఇంకోటేదైనా సంభవిస్తేనో?

మా:- అదెట్టిది?

శూ:- జనకునిపట్టణమునుంచి వస్తూవిన్నాలే శంకరుని విల్లు రామభద్రుఁడు విరిచాడని విని క్రోధంతో దాశరథియందు బద్ధమత్సరంతో సకలరాజకులాలకు యమస్వరూపుఁడైనపరశురాముఁ డక్కడకు వచ్చాఁడని!

మా:- ఇఁక నేమి! అంతయు ననుకూలముగనే యొనఁగూ

మ॥ తన వేచేతుల నర్మద న్నిలుపుసందర్భాననక్రోళిచే
సినగాయంబులఁ గర్కశంబయిన మే న్నిద్దించె నెవ్వాని కా
ఘనుఁ డౌ నర్జునుఁ డేనిగొడ్డలికిఁ బ్రాగ్గ్రాసంబుగాఁబోయె నా
ముని యోర్వంగలఁడా స్వదైశికధనుర్మార్దన్యభంగక్రియన్॥ 15

శూ:- (అసూయతో) తాతా! పాల్గారుముఖంగల అబ్బాలరాజకుమారు నా యింతగొప్పచేయఁ చున్నావు?

మా:- (నవ్వి) అమ్మాయీ! నీకర్థము కాదులే! ఏమనిన?

ఉ॥ ఎంతటి మేటిరాజులకు నేనియుఁ దేటికనంగరాని భా
స్వంతమునై సమస్తసురసంఘకళాపరిపూర్ణ సారసం
క్రాంతి నెసంగు శంకరుని కార్ముకరాజము నెవ్వఁ డాతఁడిం
తింతలుగాఁగఁ ద్రుంచె నపుడే గెలిచెన్ జుమి మూఁడు లోకముల్॥

అట్టిచో నివ్వాడు,

గీ॥ ధరణినాయకరుధిరసాగరమునందు
త్రిషవణస్నాన మొనరించె దీక్ష నెవ్వఁ

డాఘనుం డగుపరశురామాఖ్యుఁడతాని
తారసిలె నేమగునో సుంత నేర మెఱుఁగ॥ 17

సరె! పద! రాజగృహమునకే వెళ్ళుదము! (నిష్క్రమింతురు)

మిశ్రవిష్కంభము.

రంగము - జనకుని సదనగృహము.

(తెరలో) ఓహో! జనకాగ్నిహోత్రగృహపరిచారకులారా! పాద్యము పాద్యము! అర్ఘ్యమర్ఘ్యము!

ఉ॥ ఆజననంబును స్వెటువెయి నిజబాహుశిలాద్వయంబుపై
రాజిలు నల్లెగీరలహారల్దరగెల్చినకీర్తిగాథ కాఁ
గా, జిగి పేరురంపు శరఘాతలకాయల నల్గుచూఁచువాఁ
డాజమదగ్నిపుత్త్రుఁడు నృపాటవివేఁటరి యొగుడెంచెడిన్!॥ 18

మఱియు,:-

ఉ॥ రాణుల చెక్కుకుంకుమపువ్రాఁతల కోర్వని బాహుపీఠిపై
రాణ సమస్తరాడ్విజయరావగుణాంచితచాప మానుచున్
దూణయుగంబు జాఱఁ దనదోవతి లాగినలాఘవపోఁగుమేల్
శ్రేణిఁ బొరిన్ గ్రసించుచును జేరెడి భార్గవుఁ డిందురౌద్రుఁడై॥ 19

జా:-(చింతతో) మృష్టభోజనుఁ డగుకృతాంతునికి నానాఁ డెంతటి యుద్ధోద్ధతులు దొఱకుచుండెడివారు! ఇప్పుడో?

శా॥ సగ్గెన్ బూర్వకథానకంబెయయి శస్త్రాశస్త్రియుద్ధం! బహో!
తగ్గెన్ వీరుల స్వర్గమార్గ మిఱుకై! తా భూమి గొడ్రాలుగా
వగ్గె యుద్భటశూరుల న్గనఁ!, దిపీ! భద్రేభగండంబులన్
మొగ్గాతేటులతోడఁగాక సిరి చేరు న్బద్మకోశాళులన్॥ 20

(విమర్శతోఁజూడిన యచ్చెరువున)

మ॥ చెవిసోకన్ హరుఁ డల్లెలాఁగఁ ద్రిపురస్త్రీ కర్ణభూషల్పడెన్!
శివుఁ డంత న్మణికట్టుఁజేర వదలన్ జిల్లైనదా కంకణా!
లవుగా! అట్టిపురాగికార్ముకము వ్రయ్యం బాఱుటా? బాలకుం
డవునీదాశరథప్రయత్నము:సనే! యాశ్చర్య మొందున్న దే?॥ 21

(రోషవికటముగాఁ బరిక్రమించి)

మ॥ అలుకన్ ద్రుంచిన కార్తవీర్యభుజసాహస్రాసిధారాళి జి
హ్వాలుగా క్షత్రియజాతి నెల్లఁ బొరినాహారించెఁ బూర్ణాహుతిన్,
దోలఁగ న్నాటినక్షుద్రభూపతుల నెంతో యాఁకటన్ నాదు గొ
డ్డలి యిట్లీతనికోసమై వెతకుఁ జెండన్ జండవహ్నిక్రియన్॥ 22

రా.-(ధైర్యసంభ్రమములతోఁ బ్రవేశించి)

ఉ॥ స్కందునితోడ శంకరముఖంబున సామము నస్త్రవేదమున్
గొందుగ నభ్యసించి మునిపుంగవులందును శూరవర్యులం
దుం దలమానికం బనఁగ దొడ్డయశంబు గడించు తేజమున్
బొందిన పూజ్యభార్గవులఁ బున్నముకల్మిని గాంచఁగంటిఁగా !॥ 23

జా:- ఖేదమున నాత్మనిందతోఁ దనను గూర్చి)

ఉ॥ చింకపుస్పర్థచే గరిడివేర్పటుల రోషమదాంధవృత్తి "భ
ద్రాంకుర!" యంచు నే నలుపడానను దిట్టినఁ గూడ మందహా
సాంకురము ల్జనింప నను నారసిరే శివమూర్తి! లిస్సిరో!
యింకనిగుండెతో వినెద నే నిపు డాశివచాపభంగమున్!॥ 24

(విమర్శతో) నే నేయడవియందో యుందునను లెటింగియుంటచే విద్దు
రాత్మ్నుఁడగురఘుకులసంజాతుని యార్పులు చెలరేఁగినవి. (బిగ్గ
ఱగా) ఓహో! కాకుత్థ్సులారా!

మ॥ అపచారుల్ పితృహంత లాదొరలపై నాకోపము న్దీర్చి సా
యవడెన్, ద్రుంచెఁ దిగ్సప్తవారములుగాజ్యాపాలకాంకూరముల్!
నృపనారీజనగర్భము ల్చిదిపి చెందె న్మాంసరక్తాదిగం
ధపరామర్శము మత్కుఠారము, వినంగాలేదె తత్సారమున్?॥ 25

రా:-(చూచి సంతోషబహుమానములతో) ఔరా! ఏమి యీభార్గవ
రాములు!

మ॥ గెలిచె న్దా దశకంఠు సర్వభువన క్రీడాజయశ్రీకిగా
నిలిపె న్స్వైరురమెక్క వేయికరము ల్నిశ్రేణిగా, నట్టిదో
ర్బలుఁ జంపె న్ఘృతవీర్యనేకలన స్పర్థన్ రేఁగుసేనాని, పో
రుల వెన్నిచ్చిన, వైరి మోముఁ గనుధీరుం డీతఁడే ధన్యుడో!॥ 26

(ఇంచుక నిరీక్షించి మందహాసమున) ఈతని శరీరాలంకారవిశేషములే యనేకరసముల జూపరుల మనంబుల విజృంభింపఁజేయు గంభీరతతో మనోహరములుగానున్నవి.

చ॥ తల జడచుట్టు, మూఁపులజతన్ విలు గొడ్డలి, చేత దండమం
బులు, మణికట్ల నక్షసరము, ల్భయదాహృతి బాణఘాతిసం
కులకిణయుక్తవక్షమునకున్ శను మీనెడి జింకతోలుక
ప్పొలయు. నహా! మహాత్ముఁ డితఁ డొప్పెడి వీరగభీరమూర్తియై॥

(సమీపించును)

జా:-(చూచి, తనలో) వినుచున్నదాని కనుగుణమగునాకారముతోడనే యున్నవాఁడీ దాశరథి! (ప్రకాశముగ) మే లోరీరాచకుఱ్ఱఁడా మేలు!

శా॥ హేలామాత్రముగా సమూలముగ భూమీశాన్వయస్తోమము
లుఱ్ఱూలం జేసిననా కుఠాంగటకు నేన్గునుమ్మాక కుంభస్థలా
ళీక్రీలం గొట్టుడి వాడిగోళ్ళనరు గంబేరోరుహార్యక్షమున్
ప్రమోలన్ లేడివిధాఁ జేసె, భళిరా! మోదంబుఁ జేసూర్చితో!॥ 28

రా:-భార్గవభగవానుఁడా! ముదుసలికి శిశువులకు నడుమ నంతరమిల్లేకదా!

మ॥ కనిపేసెన్మాడఁ బోగు నా భృగుమహోత్కర్షుండు!, విల్విద్యనే
ర్చినదో? ధూర్జటి!, పల్కనందనిమహావీర్యాన నీకీపె యీ
డనఁగాఁ గశ్యపముఖ్యవిప్రులకు నీయన్లేదె యుద్ధీవులుం
డినభూమి న్సకలంబు. సత్త్రితమకున్ వేవేల్నమన్కారముల్॥ 29

జా:-రాజబాలకా! నీయాపత్యసౌజన్యముల పెంపునకు నా మనము లోలోన సంతసిలుచునేయున్నది; కాని,

చ॥ అలకృతవీర్యనందనుని యన్నులకన్నుల నీటఁ బెంచుతూ
పుల నగురక్తవార్ధి జలము ల్వడి తండ్రులఁ దన్పి నుంతశాం
తిలు క్షితిపాలకాంతకుని తీరనికోపమహాగ్ని కీను పె
న్వ్రేలునటుతుంచి నీవయితి వేల్వఁగ నిష్టాకయింధనంబుగన్॥ 30

రా:-(నవ్వి) భగవానుఁడా!

గీ॥ బాల్యమునైనజాన సులభత న్మరఁగుతమిని
నిట్టె శివుని ల్లోకిం తెక్కు పెట్టఁబడియె
నంతటఁ దనంత విఱిగినదయ్య! విల్లు
మదిఁ దగులదయ్యె నపుడు నీమాట సుంత॥ 31

జా:-(రోషమున) ఔరా! రాచనిసుగా! ప్రమథనాథుప్రథమశిష్యుఁ
డగు పరశురాముఁడే నీమదిఁ దగులలేదుగా?

ఉ॥ ఏపుల మృత్యుదంష్ట్రలగునేరిశరంబులు వీడఁ దేరి దా
దాపుగ నార్మొగాలదొర తా మఱల న్మరజన్ముఁడయ్యె!; రా
రాపుల నిర్వదొక్కపరి రాడ్భుజకాననదుర్గదుర్గమ
శ్రీపృథివి న్జయించె బలశేముషి నెవ్వఁడు? వీఁడె కాఁడొకో!॥ 32

రా:-శాంతిల్లుఁడు! శాంతిల్లుఁడు! భగవాను లనుగ్రహింపఁజూడ
వలయు! విహుర్మలేమిచే గణింపనైతిని. గర్వమునమాత్రముకాదు.

చ॥ శయముల నీకుఁజిక్కినవిశాఖుముఖంబులఁ జూచి సిగ్గుహె
చ్చయి యెడఁద న్దహింప నచలాత్మజయే స్వయ మెంచెనాత్మఁగా
నయితినె నేను రేణుక నటంచును స్త్రీతతులందు నీదుమా
తయె తగు వీరమాత యనుదానికి మిక్కిలినూటి! భార్గవా!॥

జా:-(నవ్వి)

గీ॥ మాటి కేటికి మానుతి? మాను!, మింక
నగుపఱుపరమ్ము గాధేయు నస్త్రవిద్య!
వీరుల న్బొరఁ జేరగాఁ బాఱుపరశు
వూను నా చేయి జాగేమి యోర్వ దిపుడు!॥ 33

రా:-(తనలో) అరే! భగవానులగు విశ్వామిత్రులపేరుఁగూడ నెత్తె
డినే! కానిమ్ము! (ప్రకాశముగ ధైర్యమమరునగవున)

చ॥ ఇరువదియొక్కమారులు జయించి పయోధిపరీతభూమినే
దొఁరగితి నంటె!, విట్ఠఘునదోర్బలవీరుడ! వౌర! నీవు!, నేన్
జిఱుతను, గాన్నృతాస్తుఁడను! చెడ్డది వీరుం దీక్ష! క్రోధమున్
న్మఱచి ప్రసన్నత న్గనుము! మాకు సుపూజ్యుఁడవౌదు జాతినే॥

జా:-(తనలో క్రోధమున) ఔరా! దురాత్ముఁడయిన యీక్షత్రియ
పోతము యుక్తిప్రత్యుక్తుల మహావీరులు నడిచిన మార్గమును

సుంతయుం దోలఁగుట లేదే! ఏమియీ నై దర్ఘ్యము? (ప్రకాశముగా)
ఓరీ! పాపీ! ఈపరశురాముఁడు జాతిమాత్రబ్రాహ్మణుఁడ నేనా పూజ్యుఁడు
ఇంకను నిలుతువేటి కాయుధముం గైకొనక !

ఉ॥ నాకడ నేదో యక్రమము నవ్యముగా వెలిఁబుచ్చి చూపున
న్లైకడు నమ్రవాక్యముల నచ్చికబుచ్చిక లాడు నీ నుడిన్
గాకలు పై కొనన్ గ్రికచకల్పకృతాంతకఠోరదంష్ట్రసా
ళీకటమాకుఠారమును లీలగ మత్కరమూనెఁ జూడవే ?॥

(బిగ్గఱగనవ్వి) ఓహో! ఎల్లగు న్విసుఁడు !

చ॥ త్రిజగము లేలు నేర్పరి విరించిభుజంబులఁబుట్టుక్షత్త్రియు
ల్లజిబిజి నేని బాహ్వాశనిఘాతలఁ జచ్చి. రతండు శీతశై
లజకును ధర్మపుత్త్రుఁడు జ్వలత్త్రిశయాగ్నిశిఖాళియొక్కయం
చు జడత రక్కసుల్సురలు సూరెలబొఱగ రేఁగుఁ గ్రిమ్మఱన్॥

(తెరలో) ఓహో ! భార్గవభగవానుఁడా ! భార్గవభగవానుఁడా !

గీ॥ సలిపితివి క్షత్త్రవధ మహాసత్త్రయాగ
మొసఁగితివి దక్షిణగ మున్న వసుధనెల్ల
నపరిస్ఫుత్త్రికవిషయమే యయ్యె క్షాత్త్ర
మేఫలములే దిపుడు క్రైదు వేల? విడుపు?॥ 38

జా.-ఓహో! ఎవరి దీప్రశాంతిగంభీరస్వరము? జనకుని దే యౌనా! (జనకునివైపు జూచి) ఓరాజర్షి! సీరధ్వజా! భగవానుఁడు సూర్యశిష్యుఁడు పురాతనవాజసనేయియు నగుయాజ్ఞవల్క్యునొద్ద బ్రహ్మసిద్ధాంతము నభ్యసించి మహావాక్యముల సంగ్రహించుకొనినవాఁడవు నీవు సామాన్యుఁడవు కావు అయినను, శిష్టుల, ననుసరించు సమయము కాదిపుడు నాకు.

ఉ॥ మూఁకలనేకముల్ నృపులు మోద్భడ నిర్వదియొక్కమాఱు లు
ద్రేకిలి చెండి ధారుణి హరించి సమాంతముఁ గూర్చు భూసురా
నీకముపాలుగా నొసఁగనేర్చె నె! ద్వంద్వసమీరకచిత్రమే
లా కస, కీకుఠార మవల న్గనఁగల్గుఁ బ్రసిద్ధసారమై ?॥ 39

(తెరలో) గీ॥ ఓభృగూత్తమ! నతి! కోపముడుగుమయ్య!
మాఁకొఱౌఁడ! దయ న్గొల్పు మానసమున !

నభయ మీఁగల్గు జగముల కట్టినీభు
జంబు సుతసనురాముపై శరముఁ గొనుటె?॥ 40

జా:-(రామునితో) ఎవరి దీ యతిధీరకర్కశస్వరము!

రా:-(వినయముతో) భగవానుఁడా! మాతండ్రిగారు రఘురఘుపతులది.

జా:-(చింతతో) ఛీ! ఛీ! అన్నిచోట్ల క్షుద్రక్షత్రియోద్భవమేనా?
(తెరవైపు) ఓహో! రాజా! దశరథా! నాపేరే కలుగుటచే నాకు మిత్రసముఁడైన నీకొడుకుమూలమున నీవుమర్యాదాఖండవైతివి. కాని, వీరుల వ్యవహారములుమాత్ర మింకను దెలియనివాఁడవుగనే యుంటివేల?

గీ॥ శివునివి ల్లిట్లు త్రుంచుటచే జనించి
మండుఁ దీవ్రింపుకోపాగ్ని మాఁపు రేపు
కోరినంతఁ జల్లాఱునే వీరజనక
రాఘవకుటుంబబాష్పపూరములఁగాక? 41

(మఱలఁ దెరలో) ఓరీ! జామదగ్న్య! అతిప్రసంగముచే సన్న్యస్తశసులచేఁగూడ బలవంతముగ విల్లునుబట్టింపం జూచుచుంటివా?

జా:-ఓరీ! విదేహకులపాంసనా!

గీ॥ అహింమకరశిష్యశిష్యుండ వనుచుఁ దపసి
వనుచు, వృద్ధుండవని, యోర్చినందులకటె!
విల్లు పేరెత్తుటల్? రమ్ము చెల్లుక్షత్రి
యాగసుధవాదు నాయజ్ఞ మంతమొంద!॥ 42

(తెరలో) భార్గవా! భార్గవా! చ్యవనుఁడు మొదలగువృద్ధవాక్యములందలి గౌరవముచేత సమరసాభిలాషమును వదలుకొని పరబ్రహ్మానుభవసంపాదనమున వర్తించుచుండిన నీకు మఱల నిట్లు బుద్ధిచలించుటేల? విరమించవయ్యా బాబూ! ఈయుద్ధపిశాచమింకెంతకాలము ప్రాకృతునట్లు నిన్నాడించుట!

జా:-(నవ్వి)యాజ్ఞ్యుల పౌరోహిత్యసంబంధముచే శతానందుఁడాకులపడుచున్నాఁడు. కాని మ్మిట్లోదార్చెదను.
(శతానందునివైపు) ఓయీ! ఆంగిరసా!

గీ॥ పశుపురోడాశరసికులు పలదు, మాకుఁ
గలరు సహజోద్భటభుజప్రిగల్భరఘువు
లాముకొనుపీరివంశమ్ము నణఁచి పిదప
భృగుపతి యొనర్చు నీవుకోరినయదెల్ల !॥

(తెరలో) ఓరీ ! పాపీ ! క్షత్త్రియపుత్త్రకుఁడా ! రాజన్య భ్రూణహత్యామహాపాతక ! నీ వెట్లు చెడినను ఐక్ష్వాకులబాణములు నీపయిం బ్రసరింపకుండ జేసికొంటివి. బ్రహ్మతేజఃపూర్ణుల మగు మాబోంట్లంగూడ నతిక్రమించి పలుకుదువా ?

శ్రా:-(రోషముతో హసించుచు) ఓరీ బ్రాహ్మణబంధుఁడా! వ్యభిచారిణీ పుత్త్రకా ! గౌతమగోత్రము చెడఁబుట్టినవాఁడా!

చ॥ మనుకులను ర్త్యపోతములు మాటలనే శరగాఢతెన్ననీ !
కనఁ బయిచిన్నబ్రహ్మగణగామిగ నీవు యజింపనీ! ఇనీ!
జనపతులన్ సమిత్కుశలఁ జక్కొసరించు కుఠారధారణ
ఘ్నన గుణాధర్భకర్షణకిణస్రిజ మీకర మెంచనేటికిన్ ?॥ 44

(తెరలో) భార్గవ !

చ॥ చదివితి వెల్ల వేదములు, జ్ఞాతివి మాగురుమూర్తిబ్రహ్మయం
దుదితుఁడు నౌవసిష్ఠున, కహో! విధిపుత్త్రుఁడె నీదుతండ్రి, కా
న దయఁదలంచి నీపయి మనంబు వహింపదు కాక యెంతకేన్
వదలుము, తండ్రి! నీబహుళవక్రతలన్నియు నిప్పుడేనియున్ !॥ 45

జా:-(బిగ్గరగనవ్వి) దశరథ ! ఏమంటివి ? ఇప్పటికిని మనసు విఱుగ దనియా ? ఈగండ్రగొడ్డలి తలంచుకొనినఁగాని తెగదులే.

(తెరలో) ఏమి! జామదగ్న్యుఁడా! మాతండ్రిగారినిఁగూడ ధిక్కరింతువా ?

ఉ॥ తమ్ముఁడుకాఁడు వీఁ డనుచుఁ దా నను రాముఁడు రోయనీ! ప్రసి
ద్ధమ్మగురాఘవాన్వయపదంబుపరంపర కే న్దొలంగనీ !
దిమ్మనధీరుఁడే, మిగులధీరుఁడె యంచు జను ల్వచింపనీ !
సమ్మతిఁ గొంటి దీక్ష విరసద్ద్విజుపైఁదగుశిక్ష కిప్పుడున్॥ 46

జా:-(తిరస్కృతితో రామునితో) ఏమిరాయిది ? నీతమ్ముఁడు కాఁడటే!

రా:-(వెఱనించుకనవ్వి) స్వామీ! అనుగ్రహింపుఁడు! అపరాధమున నెద్దియో పోల్చలేనిమధుర బాల్యవయస్సున నుంటచే నెద్దియో యనినాఁడు.

జా:-(నవ్వుచు) ఇంతమాత్రమునకే నేరు కోపగింతు ననుకొందువా? నీతఁడు వాతివాఁడుగదా వాఁడు. (తెరవైపుచూచి) ఓరీ! లక్ష్మణా! మేలు మేలు! చిన్నవాఁడవయిననునీవే శ్రేష్ఠుండ వనిపించుకొంటివి. వీఁడు పేరునకే పెద్ద!

మ॥ నలిఁ గ్రొంచంబనుహ స్తి యుబ్బుదల ముస్నస్త్రంపుపెన్గోటఁ బ్రి
ద్దలుగాఁ జీలిచి యంచము త్తెములఁ దత్సానమ్మునన్ జిమ్మ సం
ధిలెఁ గంఠీరవమత్ర్పశ స్తి యయిన స్దిండిృంచునాపై సవా
ల్గొలుప న్సాహసమూని యైతివి భటాంకూరంబ వేపుణ్యమో!॥ 47

(తెరలో) భార్గవ! భార్గవ! వట్టిసాహసమో! గట్టిసంగరమో! ఇప్పుడేమి తెలియును లే డీకొనిసంగాక!

రా:-(రోషముతో) ఆఁ! ఆఁ! వత్సా! ఎన్నఁ డెఱుఁగనియీయదరిపాటు నీకెక్కడినుండి వచ్చినదోయి! ఈపూజ్యులపై నికే పేపించుచున్నదియా!

(తెరలో) అన్నా! ఇఁక నే మాటాటడనేమాటాడను! ఓజామదగ్నిగారూ! క్షమింపుఁ డన్నగారియానయైనది!

జా:-(నవ్వి) ఓరీ! రాముఁడా! ఎత్తిపొడుపుల సత్యప్రియములగు మాటలచేతనే నన్ననునయింపం జూచుచున్నాఁడవా? కవచముం దొడిగి యిఁకనాయస్త్రముల శస్త్రములతోడ నేప్రతికి యంజేయఁ జూడుము!

గీ॥ పుట్టినాఁడవు రవికులభూపులందుఁ
బట్టినాఁడవు కౌశికుపంచవింటి
నట్టినీ విల్లు ఖా త్రింబు నంటవదల
ముట్టదే నిన్ను జీడీగా గట్టిదూఱు?॥ 48

రా:-(గర్వానవవ్వుచు) స్వామీ! మీరంనినదనిశ్చయమే.

గీ॥ రవికులక్షోత్రియక్ష త్రిరాజిఁ బొడమి
యంతఁ గనుగొంటి గాధేయునస్త్రవిద్య

యశమొ, దుర్యశమో, వారె యర్థు లెన్న
విప్రుపై బాణమెత్తనే వెఱతుసుంత !॥ 49

జా:-(క్రోధముతో) ఆ! పాపీ! దుర్ముఖుఁడా! వసిష్ఠవిశ్వామిత్రుల వలె స్వస్తివాచనబ్రాహ్మణుం డయ్యెనా నీకీపరశురాముఁడు? ఛీ! ఎంతకష్టమెంతకష్టము! ఇట్టియుచ్చావచవాక్యముల నీరాజులవలన పడవలసివచ్చెనే (మిగులక్రోధమునఁజూపుచు) ఇదిగో వినుఁడో హో!

క॥ కొడుకుల నలువుర దశరథు
గెడపి జనకకులకబంధకీలాలలతల్
కడఁకఁ బతాకలుగా నే
ర్పడ రణభువి రుద్రుచట్టు రౌద్రి మొనర్చున్ ॥ 50

రా:-(రోషమున) ఆ! జామదగ్న్యీ! నీ బెదరింపుమాటలు మేరమీఱి పఱచుచున్నవే. ఐక్ష్వాకులకైన నొకప్పటికైనఁ గోపము రాక మానదు !

జా: (బొమముడితో) ఆపైనేమి ?

రా:-(గరువముతో) తరువాతనా ?

చ॥ ఇరువదియొక్కమార్లు నృపులనెల్లర గెల్చి భుజధ్వజంబుపై
బఱపితితోరణా, ల్తనివిబాఱక యిర్వదిరెంటి కిట్లు తోం
దరపడుచుంటి నీధనువుదర్పమదెంతయొ చూతు రమ్ము ! శం
కరువిలు నెక్కు వెట్టఁజనఁగా విఱిగె స్మదీఁదృప్తికల్గునే!॥ 51

జా:-(సంరంభముతో) ఏమంటివిరా ? ఏమంటివి ? "చూతునీధనువు దర్పమెంతో ?" (తలపంకించుచువ్యథతో) ఆయ్యో ! అన్నివైపుల కెగఁబ్రాకఁజూచుచున్న యీనారోషపావకున కొకవిదేహదిలీప వంశము లెంతమాత్రపు టాహుతి? ఓహో హో! సప్తద్వీపసప్తకుల పర్వతసంవాసి సమారిట్టలారా ! జాగ్రత్త.

ఉ॥ తల్లినిగూడఁ గోసి వసుధాపతిరక్తసుధారుచుల్కడుం
గొల్లగ మెచ్చి నేనిడుదగొడ్డలి నిర్నృపయయ్యె ధాత్రి, యే
భల్లముచేతఁ గ్రౌంచమున బర్వినగాయమునుండి నేటికిన్
ద్రెళ్లెడి నస్థులంచలుగ! రేఁగుసుమీ! యవి నేఁడు క్రిమ్మఱన్ ॥

రా:-(పరిహాసమున)

మ॥ ఎదుట న్లేనినృపాల శేఖరులపై నేలాప్రతాపా? ల్పురే!
యిదిగో ప్రోలని బాలకేళి హరువిల్లే తుంచినాతండు! దు
ర్మదబాహుం డగుకార్తవీర్యుని సహస్రస్థూలహస్తాళిపైఁ
బాదల్జేసిన నీభుజాబలముపెంపు న్జూపుమా! నావయిన్! 53

జా:-ఆఁ! పాపీ! సూర్యకులకళంక! మరలమరల హరువిల్లువిఱుచు మాట నుద్ఘాటించుదువా? ఆహా! కార్తవీర్యునిగెల్చినయీనా భుజదండము నొకక్షత్త్రియడింభకుఁడే నెవకుచున్నాఁడే! ఏమి కాలమహాత్మ్యము? వినరానివి వినునట్లు కనరానివికనునట్లుచేయును గదా! ఇఁక నో రాచపురుగా!

చ॥ తెలియును నీకు నాజనకుధేనువుఁ గైకొని హైహయుండు నా
విలు చకువంగఁజేసెఁ బృథివీవరక్షత్రవిద్య, దానవే
విలసిలు మీకుమాకుఁ గడువేరము సాజ, మదట్టులుండఁగ
న్బలివయిపుట్రిగా గురుధనుస్సును ద్రుంచుట పోద్రిదిఁ గూర్చెగా!॥

రా.-జామదగ్న్యుఁడా! ఎప్పటిదియో యగునీక్షత్రపతాక మిపుడు జీర్ణించినది. దానిబిగు విప్పుకుచూడవలసియున్నది. (తెరవైపుఁ జూచి) లక్ష్మణా! విల్లు!

జా:-ఓరీ! నీతర మెంతయో యెఱుంగని క్షత్త్రియబ్రహ్మచారీ!

గీ॥ శంకరుఁడు బిట్టువాడుట సారమెడలి
తునిగెవిల్లు నిమిత్తమాత్త్రుఁడవు నీవు!
వైష్ణవం బిది రాజన్యబహుళయుద్ధ
సాధనం, బేది! యెక్కిడు! చాలుదేని!॥ 55

ఎక్కిడి యీధనుస్సుతోడనే మమ్మోగుద్పుము! రాజవధసత్రి యాగమున జిరకాలము హోతగా నుపచరించిన యీగండ్రగొడ్డలి మాకుఁ గలదులెమ్ము! (రాముని చేతులలో ధనుస్సు నుంచును.)

రా:-(అందుకొని) భార్గవా! ఈస్థలము నిమ్నోన్నతమైయున్నది. యుద్ధ యోగ్యమైనసమతలి కేఁదము రమ్ము!

జా:-(రోషముతో వికటముగ బరిక్రమించి) క్షత్త్రతేజస్సులమని బ్రహ్మతేజస్సులమని స్తోత్కర్షలం బల్కుకొనినవారలారా!

గీ॥ శరణ మగుఁగాక నిఖిలాస్త్రసారమెల్ల
నెన్నియో గెల్పుదీవెన లెయ్యుఁగాక!
నతికుపితరాహిణేయముం దగుధరిత్రి
యదశరథము నరామంబు నజనకంబు॥ 57

(నిష్క్రమించును).

(తెరలో) ఓహోహోహో! పురవాసులారా! దేశవాసులారా మంగళవాద్యములు మ్రోగింపఁబడుగాక! జరుగుచున్న వైదేహీ వివాహమహోత్సవముతో జామదగ్న్యవిజయోత్సవముఁగూడఁగలిసి కొనుఁడు!

ఉ॥ ఇప్పుడికొక్కకన్నె పణమేమొకో యన్నయసూయఁ జప్పునన్
గుప్పినసీత కేగనుల కుందునఁ గందినమోముచాయ లా
యుప్పరమెక్క విష్ణువిలు నూఁపున నెక్కిడి తూపమర్చి రా
మప్ప పగిల్చె భార్గవవిహాయసమార్గ మమోఘబాణుఁడై॥ 57

(రామ పరశురాముల పునఃప్రవేశము)

రా:-భార్గవస్వామీ!

శా॥ ఘోర వైరులు పిల్లఁ బోనలయు లేపో నీతి, సాజంబుగాఁ
గా రైక్ష్వాకులు విప్రపత్తినులతోఁ గచ్ఛన్నృతాస్త్రి, ల్కడున్
దూరం బాచియు బాల్యచాపలమున న్గొన్నాఁడు రాముం డిటు
ల్నారాచంబును, మేటితాపసివి శాంతం బెంచి మన్నింపవే॥ 58

జా:-(నవ్వి) వత్సా! నీవు మాయెడల నొనర్చినయపరాధ మేమికలదు?

ఉ॥ నే నెటు వైష్ణవంబయిననీఘనతేజముఁ గాంతునంచు మే
లూపనిక నెన్నిపోకడలో పోవుచుఁ బెంచితి నీదుకోపమున్,
లో నిలుకొందియున్న నెగులు ల్సకలంబులు నీకృతంబుగా
మానుట నిర్భరుండనయి మానితశాంతి వహింతు నింతకున్॥ 59

రా:-స్వామీ! ఇటు! ఇటు!

జా:-(చుబుకంబు నెత్తి నవ్వుచు) అరణ్యవాసుల మగుమాబోంట్లకు జనపదములలో నెక్కువకాల ముండుట ప్రశస్తముగదా! అట్టిచో మరల నన్నిట్టిచోటికి కెట్లనుపదలంతువు?

రా:-భగవానులగు యాజ్ఞవల్క్యనిగ్రహమున నతిథిమర్యాద కను వులగుదివ్యములన్నిటితో మానాయనగారును జనకమహారాజగారును మీకొఱకై వేచియుందురు.

గీ॥ ఆసనముతోడ నర్ఘ్యపాద్యములతోడ
మహితమధుపర్క మచట నమర్చుకొనుచు
వేచియున్నారు తమరటు వేగవచ్చి
సలుపుడు పవిత్రుల విదేహసవిత్రుకులుల!॥ 60

జా:-వత్సా! శ్రోత్రియ క్షత్రియుల యాతిథ్యముత్రోయదగినదికాదు నన్నుపై భావనయోగ్యమగునాచారమునుండి తొలఁగిలిసే యనుభిడియము చేధర్మాచార్యులయినయాజ్ఞవల్క్యులసమీపించి దర్శింపఁజాలకున్నాఁడను. మరియాద దప్పనుండియే యొసంగఁబడినను జేరినసై (తెరకై బిగ్గరగా)

గీ॥ ఎవనిస్మృతికయి యెప్పుడు నెదురుచూతు
రలచతుర్వర్గచరమనీషు లగువార!
లట్టియోగికి యాజ్ఞవల్క్యపరమాత్మ
కాచరింతు నమస్కార మధికభక్తి॥ 61

(తెరలో)

గీ॥ త్రిపదగాయత్రియనుపరాదేవి నీదు
పాపసంచయముల నెల్లఁబాపుఁ గాత!
నిన్ను బావమాన్యములు పునీతుఁజేయుఁ
గాత! శమవృద్ధి బ్రహ్మ మీఁగాంచుగాత 62

జా:-స్వామీ! సిగ్గలముకొనుటచే భగవాను లగుమిమ్ము దర్శింపలేకున్నాఁడను. నావనగమనమునకు సెలవిందు!

(తెరలో)

ఉ॥ నీచనుదార్ల మేలగుత నీయిలునుండియె చేరు నీయిలున్
వాచక మన్యమున్నె ? తలపై విరిదండవు. కూర్తుముజ్జగా
ల్తోఁచిచెలంగబ్రింగఁ గుశలుం డగునాముధువై రినుండి యా
ంచును భార్గవాన్వయముసం దిటు లాడెదు చిద్విలాసివై॥ 63

జా: తండ్రీ! రామభద్రా!

రా:- ఏమి సెలవు?

జా:- ఇఁక నిలువుము! ఇప్పుడు కళ్యాణమంటపమున మంగళోపచారముల సిద్ధము లొనర్చుకొని నీకొఱకు నీమామలు వేచియుందురు.

(నిష్క్రమించును)

రా:-(ఉద్వేగముతో) ఎట్లు? స్వామి వెళ్ళనే వెళ్ళిరే. నేనుఁగూడ నింక నాయనగారిదరి కేగెదను. (పరిక్రమించి ముందుఁజూచి) ఇదిగో! నాయనగారు జనకులు నిటే వచ్చుచున్నారు. (ఎదురేగును)(జనక దశరథులు ప్రవేశించి ప్రత్యేకముగ రాముఁ గౌఁగిలింతురు)

జ:-

మ॥ ఇతిహాసంబుల వ్రాయువారి విడిపోనేపోదుసూ! నేఁడు నీ
సుతుఁ డీబాలుఁడు హేలగా నడుపు మెచ్చున్నచ్చరిత్రంబు; చూ
చితివో లేదొకో! భార్గవోత్తముని వాసింగన్నగొడ్డంటనుం
డి తనంత న్జయశీలమైనప్రభ చెందెన్ రాము నాకృష్టమై॥ 64

ద:-(ముందుఁజూచి) రామభద్రుఁ డప్పుడే రానేవచ్చినాఁడే

జ:- మిత్రమా! దశరథా! చూడుము!

మ॥ నిలిపెన్ క్షాత్రముఁ జాలకాలమున కేసిన్ మజ్జగా త్రేతఁగాఁ
గొలిపెన్ వంశభృతాళి నగ్రిణిగ నర్కున్, నాల్గువర్ణంబులన్
వెలయింపన్ బ్రభువయ్యె భార్గవభుజాభీలత్వమున్ రాచి, యు
జ్జ్వలవీరుం డమృతంబుఁగన్నులను నింప న్వచ్చె, సుశ్రీకుఁడై॥ 65

ద:-(ప్రేమతోఁజూచి) చెలికాఁడా! సీరధ్వజా! ఈబుడుతఁడు పసివాఁడయ్యు రఘురాజులధర్మపరిపాలనమునం దఖిలభారము న్వహించి నిర్వహింపఁగలదక్షుఁడుసుమా! కావునఁ బెద్దతనముచే నేను మోయలేని యీవర్ణాశ్రమపాలనాభారము నాతనిపై నునిచి యే యడవియందో దిలీపకులమునకుఁ దగినవిధితో మిగిలియున్నయాయువును వెళ్ళఁదీయుదును!

జ:- నేస్తుఁడా! దశరథా! నీహృదయ మెప్పుడును మంచిమార్గమును గలిగినదియే. ఇది క్రమముగ నొనర్పందగు.

రా:-(సమీపించి నమస్కరించును.)

జ:- బాలకా! రమ్మురమ్ము! (బిగ్గఁగౌఁగిలించుకొనును.)

ద: (ఆనందముతోఁ గౌఁగిలించుకొని) రాము నభిషేకింప జామదగ్న్య విజయకాలమే మిక్కిలి యోగ్యము కాలహరణమేల?

లక్ష్మణుఁడు:-(ప్రవేశించి) ఇదే ఆర్యులకు మంధర తెచ్చిన కైకేయీ మాత యుత్తరము!

జ: ద:-(ఒకరి నొకరు చూచుకొందురు.)

రా:-(సంతోషముతో) తమ్ముఁడా! లక్ష్మణా! అమ్మగారి సవరి వారముగా కుశలమని మంధర చెప్పినదా?

ల:-అటులే చెప్పినది.

రా:-మనప్రవాస మమ్మగారి నెంత యుమ్మలింపఁ జేసినదో!

జ:-(ఉత్తరము నందుకొని చదువును) స్వస్తిమహారాజు లగుదశరథు లకు కైకేయి విజ్ఞాపనము,

గీ॥ అడిగెదను మున్ను నాకు మీ రిడిన రెండు
వరము లిప్పుడు మీరాజ్యవైభవంబు
భరతుఁ డేలుత, ననుజుతో భార్యతోడ
నేగ రాముడు పదునాలుఁగేండ్లు వనికి॥ 66

జ॥ ద:-(ఇరువురు మూర్ఛిల్లుదురు)

రా:-(ఉత్తరమును దలధరించి) తమ్ముఁడా! లక్ష్మణా! అయోనిజయు నన్ను సేవించుటలో నీకుఁదోడగునీవదినె నీనుకుని ముందుపద!

(లక్ష్మణుఁడు నిష్క్రమించును.)

రా:-నాయనలారా! ఊఁటడిల్లుఁ డూఅడిల్లుఁడు. (పైకొంగుతో విసరును)

ద:-(తేఱి, నింగిఁజూచుచు)

గీ॥ చెట్టబట్టిన దే రఘుక్షితితలేశుఁ!
దరణి పాలించిన దేవుఁడే తనకుమామ!
స్వాయము జనకుండె కేకయచక్రవర్తి!
ఇట్టికర్మము తన? కయ్యో! ఏమిచెప్ప? 67

రా॥-(విసరుచుండును.)

ద:-(తేరి నిట్టూర్చి)

గీ॥ మంటమండుచు ముంచెడి మైకమందుఁ
జెప్పనూహింప, నిదియని విప్పరాదు
అనుభవించుచుంటి నావంతు ! అయ్యో ! రామ !
ఇట్టి నను వీడ నెటు లుత్సహించితయ్య ॥ 68

(విమర్శించి) బిడ్డా ! జానకీ ! నిశాచరుల కతిథివగుటకేనా యీ దశరథునిల్లు నీవు ప్రవేశించినది. (మూర్ఛిల్లును.)

రా:-తండ్రిగారా ! ఊఱడిల్లుఁడూఱడిల్లుఁడు.

ద:- తేఱి మిన్నుఁజూచుచు) మంచిది ! మిత్రమా ! కైకేయీ ! విశ్వంభరాపుత్రిక యగునాకూఁతుకుఁ బతియను గమనమునైనఁ బ్రసాదించితివి.

మ॥ విలుకాండ్రెన్ బసివాండ్రు పంక్తిముఖదుర్వీర్యంబుతో నిండుఁద్రో
వలు, మాసీతయొ లేఁతకూన. బహుళాపత్పూర్ణము ల్కానకా
నలు, నీభర్తయొ యీయకీర్తిఁ దుడువ న్ప్రాణంబుల న్వీడఁడే!
చెలియా ! కేకయునింటఁ బుట్టితివి నసౌచిత్యంబు నెట్లోర్చితో!॥

కష్టమతికష్టము. కైకేయిమూలమున కలిగినయీదుర్యశము పెచ్చుపెఱుఁగుచు రాఁగల భరతయావరాజ్యలక్ష్మీకర్ణముల్కు దమాలపల్లవంబై చెలంగుచుండ నేనుమాత్రమీజనపదంబులనెట్లు తలయెత్తుకొని తిరుగుచు లోకులముఖంబుల చూడఁగలను ?

రా:-(లేచి) మామగారూ ! మాతండ్రిగారిక్షేమము నాకుఁ దెలియుచుండునట్టు లొనర్పుఁడు ! (నిష్క్రమించును)

ద:-(తేఱిలేచి) బిడ్డఁడా ! రామభద్రా ! నన్నురక్షింపవటోయీ ! (జనకుఁడుపట్టుకొన నిష్క్రమించును.)

ఇది నాల్గవయంకము



# శ్రీమదనర్ఘరాఘవము

## అయిదవయంకము.

రంగము (కిష్కింధావనపరిసరము)

ప్రవేశము - శ్రమణయు, జాంబవంతుడు

జాం:- తరువాతఁ దరువాత ?

శ్ర:- అంతట మిథిలనుండి బయలుదేరి మంథరశరీరమును వదలి మారుతి సంరక్షణమున నున్న నాబొందిలోఁ బ్రవేశించి గంగదరి శృంగిబేర పురమునకు వచ్చియుంటిని.

జాం:- అటుపైని ?

శ్ర:- నే నటఁగాలు వెట్టఁగనే "యిరుగో ! రామలక్ష్మణులు ! నిదిగో ! సీత !" అనుచు నెల్లెడ వినవచ్చెను.

జాం:- (సంతోషముతో) ఆఁ ! ఆఁ !

శ్ర:- అటుపిమ్మట నీరామలక్ష్మణు లెవరని యోడనడపువాండ్రదొర నన్నడుగగా నిట్లుచెప్పితిని.

గీ॥ దశరథునికోర్కి మునీంద్రదయయుఁ గలియ
నాదిపురుషునికళ నాలుగై జనించె
నందు గుణమయుఁడగు నీతఁ డగ్రజుం డ
తండు ధీరోద్ధతుఁడు తృతీయుండునుమ్ము॥ 1

జాం:- శ్రమణా ! చక్కఁగఁజెప్పితివి. తరువాత ?

శ్ర:- పిదపఁ గలసివచ్చినబంధుగు లుదకాంతానుసరణమున మఱలి పోవఁ దత్తరముతో గుహుఁడు తెచ్చిననావ నెక్కి-

చ॥ శివుతలపూవుదండ సురసింధువు గంగను దమ్ముఁ డాలి తాన్
మువురె తరించి, కేవనుజుఁబోలిన మైత్రిగ నావికున్ గృప
న్దవిలిచి, బోయెత ల్ప్రృథులత న్బహువ్యామకుచాళి రొప్పుచున్
మిని లెడివేడ్క వెన్కఁన గమించెను జిత్రినగాన కాతుఁరిటిన్॥

జాం:- ఔరా ! ఎంతకరుణాజనకము !

శ్రీ:- స్వామీ ! తమకు దుఃఖాకరమగుననియే వారచట గారచెట్టు క్రింద జడలదాల్చినవైనమంతయుఁ దెలుపమానుచుంటిని.

జాం:- శ్రీమణా ! ఇదియంతయు వారి భావికళ్యాణమునకే కాఁగలదు లెమ్ము ! ఆ వెనుక నేమి జరిగె ?

శ్రీ:- నేను నూత్రము బోయ రాజును సంతోషపెట్టుటకై అందే ఆఁగితిని. అంతఁ బెక్కు రాత్రులు గడచినతరువాత మంత్రి సామంత పరిజన పరివృతుఁడై దశరథుని రెండవకుమారుడు తండ్రి స్వర్గస్థుడగుటను జెప్పి రామభద్రు నయోధ్యకుఁ దోడ్కొనివెళ్ళుట కాతోవనే చిత్రకూటమున కేగెను.

జాం:- (సందేహముతో) ఆఁ! తరువాత ?

శ్రీ:- అంత నో స్వామీ! "ఏవిధినుర్వివాశమున నో కేకయుల కపయ శముపచ్చు యోగముండి కాఁబోలు తండ్రి గారటుల మోసపోయిరి. అది శాంతముగ సాంతముగఁ దఱచిచూచి తమరు మఱలివచ్చి రాఘవరాజ్యముం గైకొనుఁ"డని భరతుఁ డెంతప్రార్థించినను, రాముఁ డాతని మేనునిమిరి "కా"దన జటాకలాపము తానుగూడ ధరించుకొని శరభంగప్రేరణమున రామపాదుకలు లభింపఁ గొని చని, భద్రాసనమున వాని నునిచి, ప్రజలపురోవృద్ధి నరసికొనుచు నల్ల భరతుఁ డానందిగ్రామముననే నిలిచెను.

జాం:- (సంతోషమున) అబ్బ! నా ప్రయత్నము నీ ప్రయాసము గట్టెక్కినవిలెమ్ము ! తరువాత ?

శ్రీ:- మైలవచ్చినప్పు డాయుధములఁబట్టుట తగదని, ఛిద్రములనే వెదకుచుండెడి జనస్థానవాసులగు ఖరదూషణాదులచే క్రూరుఁడగు విరాధుఁడటకుఁ బంపఁబడియెను.

జాం:- ఛీ! మూర్ఖులు. ఆఁపరాని కార్యము లమరినప్పుడు రాజుల కప్పటి కప్పుడే శుద్ధికదా ! పిదప నేమియయ్యె ?

శ్రీ:- విరాధుని జంపుటలో నుంతమఱపింపఁబడిన పితృమరణదుఃఖము పెద్దపెట్టునఁ దన్నలముకొన నెట్టులో యపరక్రియల నిర్వర్తించి, నాలుగుసముద్రములజలంబులుఁ బుక్కిటం ధరించినట్టియు, వింధ్యా

గర్వము నణపఁజాలినట్టియు, వాతాపి నంతమునొందించిన, మంగళ కలశమునందగు ఘటజన్ముఁడగు, నగస్త్యమహర్షి నివసించునరణ్యమునకై రామభద్రాదు లరుగుచుండ ధరాధరుఁ డనుకాకాసురుండు సాహసించి వైదేహి వెంటఁ బడియెను.

జాం:- (తనలో) ఎట్టి దుశ్శకునము? (ప్రకాశముగ) ఆవెనుక నేమి జరిగినది?

శ్రీ:- ఏమి జరిగినదనుచున్నారా? వినుఁడు?

చ॥ దనుజచయాభిచారచరుధారకభాండమనంగఁ బొల్చు నా
జనకజ చూచుకంబుకొనఁ జట్టనఁ గాకము చీఱ, వైళమ
య్యినకులజుం డిషీకను గ్రహించి మహాస్త్రము మంత్రితంబుగా
నొనరిచి యేసి తన్నయన మొక్కటి గ్రుడ్డిగఁజేసె నీసునన్॥ 3

జాం:- తరువాత?

శ్రీ:- తరువాత, నో స్వామీ!

క॥ క్రమత సుతీక్ష్ణుఁడు మొదలగు
శమి శేఖరులకును సేవసలిపి యగస్త్యా
నుమతిన్ రఘూద్వహుఁడు తా
వమరెన్ బంచవటి వాసమై స్థిమితముగన్॥ 4

జాం:- (సంతోషముతో) అటులయినచో మనచేతులలోఁ బడినటులే, ఋశ్యమూకమునకు జనస్థానమునకు నడుమ నెంతో దూరమా?

శ్రీ:- స్వామీ! ఇంతవఱకు వినవలసినముఖ్యాంశ మింకను విననేలేదు తమరు!

జాం:- అవహితుఁడ నేమియది?

శ్రీ:- అచ్చటఁ గాముకియై చుప్పనాతి రసముంగూర్చునని పతిచింతకుం బాల్పడి యప్పాపమునకుఁ బ్రాయశ్చిత్తముగ ముక్కుఁజెవులనుం బెదవులను మూఁడాహుతులుగ లక్ష్మణక్రోధాగ్నిని వేల్చికొని పునీతయైనది.

జాం:-(సందేహముతో) అయ్యో! పెద్దబెడదయే సంభవించెనే! చెల్లెలి యీభంగపాటు నెఱింగినఖరాసురాదు లేమయిరి?

శ్రీ:-ఏమయిరా? రామభద్రుఁడు విల్లందుకొన నేమగుదురో అదియే!

జాం:- (నవ్వుచు) వారికి సహాయముగఁ జేసినవారుఁగూడ విరాధునినడ
కచే నలిగినమార్గమునే పట్టిరా ?

శ్రీ: మత్తేనండి.

జాం:- శ్రమణా! ఇప్పుడుగదా! రామరావణులకు శత్రుత్వము బాగుగ
ముదిరినది.

శ్రీ:- (నవ్వుచు) ఆర్య! ఖరదూషణాదుల వృత్తాంతమంతయుం జెప్పు
టచే నీచుప్పనాతినోరునొవ్వనక్కఱలేకుండ దానిముఖముంజూడఁ
గనే రావణున కంతయును బోధపడఁగల దనుకొనియెదను ?

జాం:- (నవ్వుచు) శ్రమణా! నుంతలో వచ్చుకీడును బోల్చుకొనలేని
ముగ్ధుఁడ నగుచున్నాను,

ఉ॥ కౌశికయాగమే మొదలుగా పగ రాఘవసూనులందు లం
కేశున కిప్డు బంధువులునే స్వాతులైరి! త్రిశక్తిసంభృతా
వేశుఁడు మాయలాఁడు బలవిశ్రుతుఁ డెమ్మెయి ముక్కులుం జెవు
ల్నాశిలు చెల్లి మోముఁ గనిన న్మది నైఁచునొ సేఁగకుండఁగన్॥

మెల్ల మెల్లఁగా వీరియిరువురిమధ్యమున విరోధము పెరుగుచుండ
నసహాయతలోఁ దుల్యులుగ నున్న రామసుగ్రీవులకు సంధి చులకన
గనే పొసఁగఁగలదులే !

శ్రీ:- స్వామీ! ఇపుడు చేయఁదగినదెయ్యది ? నాశిష్యునికుమారుఁ
డును బోయవాఁడు నగుగుహునకు లక్ష్మణస్వామికి నత్యంతమైత్రి
కుదిరినదిగదా! ఈమెట్టుపాయమున రామసౌధము నెక్కరాదా !

జాం:- (సంతోషముతో) (నవ్వుచు) శ్రమణా! నిజమే! నీ వెప్పుడు
సుగ్రీవపక్షపాతివే! కావున, సత్వరమేగి బోయవాని లక్ష్మణదరి
కనుపుము! (శ్రమణనిష్క్రమించును.)

జాం:-(జాగరూకత నన్ని దెసలన్ జూచుచుండును.)

(తెరలో) (ఒకచెంప) ఓహో! లక్ష్మణా నేనెవడననుకొంటివి ?
వైశేషికకందళీపండితుండ! జగముంగెలుచుకొనుచు నిందువచ్చితి !

(తెరలో, మఱియొకచెంప) ఓరీ! సన్యాసీ! తేలుమంత్రగానికిఁ
దాఁచుపామును జడిపించునుబలాటము క్షేమః

జాం:- ఆహా! లక్ష్మణునకు సన్న్యాసికి జరుగునీసంవాదమునంతయు వినవలసినదిగ నేయున్నదే (చెవియొగ్గును.)

(తెరలో మొదటిచెంపనుండి) ఆఁ! లక్ష్మణా! నేను సర్వ విద్రావణుఁడనుసుమా! అటులగుట నేనేవానినోర్చి గౌరవదూరుం గావింపను?

(తెరలోనొండెడ) నీ వా రావణుఁడవా?

(జాంబవంతుఁ డపరిమత్తుఁ డగును.)

(తెరలో మొదటిచెంప) ఓ! చమత్కారీ! "సర్వ+విద్రావణ" అందఱిం బర్వులెత్తించువాఁడ ననుసమాసమును "సర్వ+విత్+రావణ"అని వేఱుగునర్థమున బల్కునెపమున నెదురగునిన్ను నిగ్రహించితిని. భిక్షుకు నన్నుఁబోవనిమ్ము!

(తెరలో-నొండెడ) నీతోఁగాని రావణునితోఁగాని నాకేమిపని? మదుద్దిష్టమునకై త్వరగనరిగెదను.

జాం:-ఔరార! ఇదియేమిగొడవ? పర్యవసానము తెలియుటలేదే! ఒకవేళ రావణుఁడే సన్న్యాసివేషమునవచ్చి రోషమునం బేరుఁదెల్పుకొని పిదప గుటుఁగుఁబఱచి చనియెనా? (చుట్టునుంజూచి) ఇదిగో! నాచిరకాలప్రియమిత్రుఁడు జటాయువే యనుకొందు నీదక్షిణదిశనుండి వచ్చువాఁడు? ఆతనిరాక వేచి యుండేయుండెదను. గ్రద్దలు కడుదూరముచూడఁగలవుకదా! ఇతనికి తెలిసిన తెలిసియుండవచ్చు నాలంకావృత్తాంతములు,

జటాయువు:-(ప్రవేశించి) ఇదిగో! పంచవటి! అన్నట్లు గోదావరి యలలతుంపురులచే నలవడిన సుకుమారతాసౌలభ్యములతో దీపించు వడవుల పరిసరములుగలజనస్థానభూము లవే?

ఉ॥ తేనెమదానఁ గోయిలలు తేపకు మావినసల్కఁదల్పఁ దో
డ్తో నలి రాలు పుష్పాడులదువ్వలు, లుబ్ధకభీతి నెట్టిచం
దాననొ దాఁటులేళ్ళకుఁ బదక్షతము ల్వాడిఁగప్పి క్షేమసం
ధానమొనర్ప, ముచ్చటలఁ దన్పు ధునీతటభూము! లద్దిరా!॥ 6

జాం:-(కొంచెముసమీపించి) ఇంతవడిగా నెటనుండి మిత్రమా?

జటా:-(చూచి) ఏమీ! జాంబవంతుఁడే! మిత్రమా! మన్నింపుము!
ఇప్పుడు నిన్నలరింప నిలువఁజాల. మలయాద్రిపైని గూటినుండి మా
యన్న సంపాతి కెరగివచ్చుచు, మారీచుఁడు తోఁడుగా నీయరణ్య
ముల సంచరించుచున్న రాక్షసరాజుం గంటిని. దీనివలన నెద్దియే
న్గీడు కలుగునేమో యని రామభద్రునందలి నాస్నేహము నన్నుఁ
త్వరపెట్టుచున్నది.

జాం:-(తనలో-నేనెఱుంగఁగోరినదిదియే!) (ప్రకాశముగ) మిత్రమా!
త్వరగఁజనుము! (నిష్క్రమించును)

జటా:-(పరిక్రమించి) ఆయగుపడునదియే పంచవటి! (వితర్కించి)

ఉ॥ బంగరులేడిమాయఁబడి పర్వెను దవ్వుగ రామభద్రుఁడ
న్నంగన వేగమేగె జతనంబున వెంబడిఁ చిన్నవాఁడు; భీ
తింగొని మెల్లగా నుటజదేశముఁ దూఱెను భిక్షుకుండు; లో
నం గొనెస్వస్వరూపముఁ; గన న్దశకంఠుఁడె వాఁ! డిసీ! యిసీ!॥ 7

అయ్యయ్యో!

క॥ హా! నాథా! నాథా! యని
జానకి యదె కురరివలె వెసన్గూయిడఁగన్
మానక రథమం దిడుకొనె!
నీనీచుం! డెందుఁబోవు నే నిందుండన్?॥ 8

(ఆటోపముతో) (పరిక్రమించి) ఓరీ! ఓరీ! రావణా! నిలు! నిలు!

శా॥ ఓరోరీ! దశకంఠ! అంటువడ నీయుర్వీసుతన్ రామభా
ర్యారత్నంబును దాఁకి తేజము నెదన్ బ్రాపించుకొన్నాఁడవే!
ఛీ! గోయన్నలదే భవత్కులము వాసిన్, ద్వద్గురూత్తంసదు
ర్వారస్థైర్యుల నాపులస్త్యముఖసత్తబ్రహ్మలన్? నీచుఁడా?॥ 9

ఓరీ! రాక్షసాధమా! వట్టియట్టహాసము లనుపొగలతో నీపది
మోము లనుపుట్టలు ధూసరితములుగ నేమియనుచున్నాఁడవు?

క॥ సకలజగద్బహుసమ్మో
హక మగుసీతాఖ్య వెలయునామిషమును నా

ముకరాలనుండి తాఁద
న్నుకొనఁదలచె ముసలిగ్రద్ద! నోత్తునా యేమో!॥ 10

అనియా! ఆఁపాపీ! ఇదియా? నీయిచ్చుప్రతివచనము! నిలు! నిలు!

గీ॥ కనులఁ గానవు భుజబలగర్వమెనసి!
దొంగ! యనిపిల్వఁ బాఱిపోవంగఁజూతు?
కుటిలనఖపాళి నెంతయుఁగ్రూరకర్మఁ
డీజటాయువు! నీహృది నెట్లుజీల్చు!॥ 11

(నిష్క్రమించును.)

ఇది శుద్ధవిష్కంభము

లక్ష్మణుఁడు:-(ప్రవేశించి) అయ్యో! దశ యెట్లుమాఱినది! అడంప రాని కఠోరమైనక్రోధమునకు శోకమునకు లజ్జకు నాస్పదమై గహనము విషమము నైనదిగదా! ఇదిచేసిన బాగన వీలిడుటలేదే!

ఉ॥ అంతటిపంక్తికంఠుఁడె దురాత్మత వంచనఁజేయఁ గ్రోధధూ
మాంతరితంబు లౌపదము లక్కఱము ల్నగమాడునన్న! యా
యింతజటాయు వీల్గెనన నేప్పుడువంత రుషాగ్నిహోత్రభా
స్వంతము లైనచూడ్కులిడుఁ జాపముపైనిఁ గడున్ స్థిరంబుగన్॥

రా:-(ప్రవేశించి మిన్నుఁజూచుచు కన్నీటితో)

మ॥ కులమా! శౌర్యమ! బాహుసంపదయ! నిగ్గున్నిష్ఠయా! మున్నురాఁ
గలకాలంబుల నీవలెన్ యశముకల్గన్ గాంచరెవ్వారు! నే
బలవద్యత్నము నెంతకాలముగ సల్పన్ జాలి వీరాధ్వసం
చలనన్ గూలితో చేతిమీఁదుగ! దశాస్యా! ఛీ! భ్రమాధీనతల్॥

(విమర్శించి, ఖేదస్మితమున) అహో! పౌలస్త్యుఁడా!

మ॥ తొరతో నాచెవినాచెవి న్వినినసిద్ధుల్నీదుదుర్వృత్తముల్
వెఱతోఁ దెల్పఁ బులస్త్యుఁ డోర్కఁడువినా, విన్నట్టిదేవర్షి భా
స్వరులెల్ల ర్నగ నీదుతాతపిత విప్రాగ్ర్యవృత్తిచే నల్వ యే
తెఱఁగై యీతలవంపుల న్గనుచునో దీపించులజ్జాభృతిన్॥ 14

(కొంచెముధ్యానించి) హా! ప్రియా! విదేహరాజపుత్త్రి!
(దుఃఖము నాపుకొనుటఁ జూపును)

ల:-(సమీపించి) అన్నగారూ! ఈశోకము మీయంతవారింగూడ నాక్రమించెడినే!

గీ॥ గుండె వ్రీలంగఁజేసెడికూ్రరగతిని
దైవవశముగ వ్యసనము ల్తారసిల్లఁ
గనె మహాత్ములమనములు కడఁకఁగొనవె
ధైర్య మనువజ్రకంచుకధారణంబు!॥ 15

రా:-(నిట్టూర్చి) తమ్ముఁడా!

గీ॥ కట్టుబడి యుండుహృదినిదుఃఖంబు రుషయు
సహజధైర్యంబు గలయట్టి చతురమతుల;
నిచట నస్నియపత్రప యెంతయేని
నొంచి చెలరేఁగు నేమొనరించువాఁడ!॥ 16

ల:-(ముందుఁజూచి) అన్నగారూ! జనకసముఁ డగుజటాయువునకు వీరలోకము నొసంగినసిద్ధక్షేత్ర మనఁదగునరణ్యప్రదేశ మిదియ కనుఁగొనుఁడు!

మ॥ సొరిది న్బిడ్డల తాతవక్రనఖచంచుక్షేపము ల్రావణా
సురు తేరున్ బహుఛిన్నభిన్నముగ నిచ్చోఁ గూల్చె వీక్షింపుమా!

రా:-(దుఃఖమున)
తరుణీ! హా! కడుధన్య వీవయిన సందర్శించి తాపంక్తికం
ధరమత్తేభదశాస్యభేదనహరిన్ ధైర్యాద్రిఁ బక్షీంద్రునిన్ !॥ 17

(లక్ష్మణు నానుకొని ధ్యానించుచుండును.)

ల:-(తనలో) అహో! మనస్సునంతటిని మిక్కిలిగ నాక్రమించుకొనిన యీశోకము మహాదోషమువలె బహుళానర్థదాయక మగునుగదా! ఇతరములపై కీయనమనముం ద్రిప్పఁజూతును (ప్రకాశముగ) అన్నా! అటుచూడుఁ డటుచూడుఁడు!

గీ॥ వింధ్యశుద్ధాంతకన్యలై వెలయునదులు
ప్రబ్బలు ల్వీచు లొండొండుఁ బఱచువడుల
గీతవాద్యనృత్తంబుల నాతతముగఁ
గొనుఁ బునఃపునరావృత్తి ననుపమముగ॥ 18

రా:-(కన్నులఁ దెఱచి, నిట్టూర్చి)

ఉ॥ రేఁ దలవడ్లుగా నుపచరించి తోఁగల్మ్రుదుఁగ న్విశాయ మ
గ్రోఁ దయబోధఁ బద్మతతు లూని పొసర్చెడియామికాన ని
ల్లేదయి వాఱు పీనుల మదేభచయంబుల తాళము, ల్మయూ
రాదుల నృత్యవిభ్రమము, లన్నిసరిత్తులనే న్మనోజ్ఞతన్॥ 19

ల:-అన్నా! మాల్యవంత మనుపర్వత మిదియే!

ఉ॥ దొమ్మిగ దుండగీఁడడవిదున్నలు కొమ్ములఁజిమ్మ దొర్లి గుం
డ్లిమ్ములఁ గూర్చు చూల్మృగుల కెప్పుడు గర్భనిపాతముల్! గుహా
గ్రిమ్ములఁ బ్రౌఢభల్లుకవరమ్ముల హిక్కల కుల్కి కాననాం
తమ్ములబోయలేని గళితమ్ము లొనర్తురు విండ్లునమ్ములున్॥ 20

రా:-(చాలసేపుచూచికన్నీటితో)

చుట్టు నెమిళ్ళగుంపు లెటుచూపెడినో తమయాదరంబు లే
తట్టునఁ దేంట్లజోడులు కదంబవిభూతుల నెట్లుగ్రోలునో!
పుట్టల భోగిదంపతులభోగము సత్ఫలదంబుగాఁగ నీ
గ ట్టెటు నూత్న మేఘములఁ గార్చెడినో నవనీతతోయముల్!॥

తమ్ముఁడా! లక్ష్మణా! నన్నానుకొనుము! మనసు నిలఁబట్ట లేకున్నాఁడను!

ఉ॥ ఉస్సులఁ దెంపు లేదు, మొగమో కడుగ్రుక్కె, నెలుంగు రాచె, మై
డస్సినయంగము ల్సడిపడన్ జెడి పాలె, ముసించె జాడ్య. మం
భస్సులు నూత్రెఁ గన్నుఁగవ, మ్రగ్గె నహో! స్మృతి, జానకీవ్యథన్
బుస్సనుశోక మిప్పటికి పొందెసుమీ పరివాకతీవ్రతన్ ॥ ౨౧

(లక్ష్మణుఁ డానుకొనియుండఁగనే కన్నులు మూసుకొని) హా! ప్రియసఖీ! దండకారణ్యవిహారసబ్రహ్మచారిణీ! (మాటి కిట్లు పలవించుచుండును)

ల:-(చింతతో-తనలో) దేనిచేత నీకరుణారస మింకొకటిగ మాఁజగలదోగదా! (తెరలో) ఆ! పాపీ! నీచ కబంధా!...పీఁ దుండఁబోవఁడు!

రా:-(విని-సంభ్రమముతో) తమ్ముఁడా! దురాత్ముఁ డగుకబంధరాక్షసునితోఁబోరు నితడు నీప్రియమిత్రుఁ డగుగుహుఁడనితోఁచుచున్నది

రాక్షసు ఁనేకమాయలుగలవాఁడు కావున దీ్వరగనేగి యీతని ననుగ్రహింపుము! (లక్ష్మణుఁడు నిష్క్రమించును)

రా:-(ప్రక్కలం జూచి సకరుణముగఁ గన్నీటితో) దేవీ! వామశీలా! జనక రాజనందినీ! నీయఖిలరహస్యములకు సాక్షీభూత మగునెట్టి గన్నేరుపొదలవరుస యిదిగో! ఇచ్చటనేకదా!

ఉ॥ నా మెయి నానఖాంకురము, నాసఖి! నీకృత మంచు నీసఖీ స్తోమముతో వచింతువనుచున్ భయపెట్టఁగ, మాని యంకిలిన్ నామదిఁ దృప్తినొందఁగ ననంగపరీమళముద్రి స్వేచ్ఛ నే నేమొనరించినన్ సయిచితే అలనాఁ డెటువిస్మరింతునో !॥ 23

(విల్లుఁబూని లక్ష్మణవృత్తాంతము వినుగుతూహలమున నిల్చును)
(గుహునితో లక్ష్మణునిప్రవేశము)

గు:- దేవరవారికి జయము జయము!

మ॥ అసురత్వం బొనఁగూర్చుపాపములు మాయన్ స్వర్గమున్ జేర రాక్షసుమ్రిందించె, జగద్విచిత్రచరితన్సాధించె, గర్విష్ఠులం దు సమర్థుం డగుశాస్త్రగా. నమరులందో? భీతిఁబోకార్చుదు ర్గసమానుండుగ నీసహోదరుఁ డహో! ప్రౌఢిన్విరాజిల్లెడిన్॥ 24

రా:-మంచిపనియే జరిగినది వానికి దేవలోకమార్గములు శుభములగుంగాక. అబ్బాయీ గుహుఁడా! మింట నెదియో పెనుకొండవలెం గనుపట్టినది అది యీయాముడ చేతులవాఁడు ధరించినయా యుధమే ననుకొనియెద.

గు:- గీ॥ అసుర నాథుని దుంకుభియ నెడివాని
వానరాధీశుఁడగువాలి పట్టిచంపె;
వానిదేహముకలగూ డది బాలుడితఁడు
కాల నెగజిమ్మెఁ, దమ రడికాంచియుందు్రి॥ 25

ఇయ్యది వాలి పోరునకుం గాల్ద్రివ్వ నొక్కకారణం బయ్యెడినేమో!

ల:- అయిన నేమి?

రా:-తమ్ముడా! అతులనకుము! పురాతనవీరు డయినదుంయిందరి సూనుఁడు మానసీయుఁడు సుమా! (గుహునితో) బిడ్డఁ జెందుండి వచ్చుచో నీయోజనబాహు నడ్డగింపు కలిగినది?

గు:- ఆకాశయానమున వడిగా రావణుఁడు సీతాదేవి...

రా:- ఆఁ! యేమైనది?

గు:- ఉత్తరీయము పడుచుండఁగా హనుమంతుఁడెగిరి యందుకొనియెను. గుణగ్రహణైకలోలుఁ డగు సుగ్రీవకుమారుఁడు మిమ్ముగూడ సంతోష పెట్టువాఁడై యాదీనిని మీకుఁ గానుకగా నాచేఁబంపెను (రాకిచ్చును)

రా:- (అందుకొని హృదయమున కొత్తుకొనికన్నీరు కారు) అయ్యో! దేవీ! వైదేహనందినీ! ఈయుత్తరీయ మొక్కటనే నాకు నిన్నుఁజూడ మిగిలెనా? (కన్నులు మూసికొని లక్ష్మణునానుకొనును)

ల:- గుహుఁడా! సుగ్రీవుఁడు కుశలియేకదా?

గు:- అతనిసేమము నీ వెప్పు డడుగఁ దలఁచితివో అప్పుడే యాతఁడతి కుశలి.

రా:- (తనలో)

చ॥ ఎటుఁగె దశాననుండు చనియె న్గొని సీతను, మున్నె చంద్రశే
ఖరుఁ గొలువన్ దనంతఁ దరుగండె శిరంబులదండ? దీనిపై
నుఱువగు శిక్ష వేయొకటియున్నదె వానికిఁ? జంద్రహాస సం
చరితవధాననే నడువ సమ్మతిఁ జూపునె నాశరం? బిసీ!॥ 25

ల:- అన్నగారూ! మనయెడల నీవనచరులుగూడ మంచితనమునే యవలంబించుచున్నారు.

రా:- ఏమంటివి? మనకు సుగ్రీవుఁడుజ్ఞాతికదా! మన యిక్ష్వాకురాజర్షి వంశమూలపురుషుఁ డగు వేవెలుంగుదొరయేసుమా యాతనిజనకుఁడు (ఎదపైనున్నయుత్తరీయముంజూచి), సోదరా! గుహుఁడా! సుగ్రీవహనుమంతులఁజూడవలయునని యున్నదోయీ! ఋష్యమూకమున కేదుదారి నగపడును!

గు:- (సంతోషముతో) (తనలో) జాంబవంతుని యాలోచన మెంత శీఘ్రముగ ఫలించినదీ! (ప్రకాశముగ) ఇటే! ఇటే! మతంగాశ్రమము మీఁదుగా (అందఱుం బరిక్రమింతురు)

గు:- చూడుఁడు! చూడుఁడు!

ఉ॥ క్రౌంబురదంమునుంకెనలు గుత్తులపూ ల్దొడుగంగ, నిత్యనా
ట్యంబులఁ గేకలాడఁ, గగురట్టులు జంబువు లీనఁబండ్లఁ బా
ర్వంబుల గుడ్డుకు ల్బబరభామల మన్మధదీప్తి రేఁపఁ జో
ద్యంబుల వింధ్యపర్వతపుదారులు కన్నులఁ గొల్పెఁబండువుల్॥ 27

రా:- (అంతటంజూచి. వగతో)

ఉ॥ అంతటఁ బుట్టుపెక్కులల నంగఁగొనంగలనేర్పుతో వడి
న్గంతిడు పంపగాలికి వికాసము లేలకులొంది చుట్టు నీ
చెంతలఁ దావులుబ్బఁగ, విశీర్ణమతి న్వోయిమాయశీతల
ప్రాంతిని ప్రాయమనన్నుఁ దెలుప న్వనభూము లొసంగునూఁతమున్

ల:- అన్నగారూ! ఇటుచూడుఁడు!

చ॥ కలిసెడిపోతు భీతిఁ జనఁగా విరహాన నహంబుఁదక్కి బె
గ్గలుహరిణి న్గన న్గరుణ కేళ్ళుఱుక న్నఖి గద్గదోక్తుల
"నైలువుఁడ! చాలు నేయు!" కనఁ జెంచపరాద్ధతకు న్దొలంగఁ డా
ములికియె సూటితప్పఁ జనెఁబో! అపరాధము లేనిపోబడిన్॥ 29

రా:- (కన్నీటితో) అయ్యో! దేవీ! వైదేహీ!

గీ॥ అల్లమారీచువేఁట నత్యంతదృష్టి
మునిచి నేనేగియుండ రావణుఁడు రాఁగ
నీవిభీతాంబకంబులు నిజము యిట్టి
హరిణినేత్రంబు లట్లుండె ననితలంతు॥ 30

ల:- (తనలో) అన్నగారిహృదయమును వినోదపెట్టుటకు వేఱొకయు
పాయ మేది చెపుమా!

(తెరలో) ఓహోహో! వానరులారా! చెప్పుఁడిప్పుడు! నాకీర్తికామినికిఁ
గ్రీడానగమనఁదగు నీదుందుభికంకాళము నెవఁ డిట్లుచిమ్మినవాఁడు?

గు:-(చూచి సంభ్రమమున) దేవా! కనుఁడు! కనుఁడు! జందెముగా
ధరించిన కనకమయసహస్రదళకమలమాలిక కాంతులెగవ, సహ
జారుణ దేహకాంతి దుందుభికాయము నెవ్వరోయెగఁజిమ్మి రను
తామసోద్రేకమున ముమ్మడుంగులుగ జేవురింప వానరపట్టభద్రుఁ
డయిన వాలి యిటేవచ్చుచున్నాఁడు!

ఉ॥ చంక దశాస్యు నంగములు జానఱ నల్పి క్షణాన స్వర్గమే
కాంకితము న్బొనర్చినభుజాధికవీర్యు సతంబుఁ జూచుమే
ల్పొంకముకై కనుల్వోయియుఁ బుత్రడితమ్ములమూలగా నిరా
తంకత నిందుఁ జీఘనుని దాఁగయిసేసె నటంచు నెంచెదన్॥ 31

ఈమహావీరుఁడు దేవరవారి ఋశ్యమూకయాత్ర కించుకవిఘ్నము కాఁగలడేమో! అందుచే నేను ముందువెళ్ళి సూర్యపుత్రున కుత్సవముం గూర్తును.

రా:- అట్లలే యొనర్పుము,

గు:- "మిత్రుఁ డనుపదముచాటున నీసేవఁ జేయఁగోరుచున్నాఁడు" నను సుగ్రీవువాక్యమును మఱువకుఁడు!

రా:- (అపవారించి) తమ్ముఁడా! లక్ష్మణా! నీమిత్రుఁడగుగుహుఁడు నిట్లు చెప్పుచున్నాఁడు అదిగాకపోయినను, మంత్రోత్సాహశక్తిసంపన్నులలోఁగూడ సిద్ధులగువారు ప్రభుశక్తినే కోరుచుందురు. అందుచేత నే నీసుగ్రీవుని వాలిస్థానమున స్థాపించి యతనికోశదండములూఁతగా సమగ్రశక్తినొంది పగఁ దీర్చుకొందును.

ల:- (నవ్వుచు) ప్రబలోపయోగ మొసఁగఁగల యిందిరినూను నుపేక్షించి రిక్తుఁడగు సుగ్రీవుసంధి నుపయోగించుకొని సిద్ధినొందుదు మనుకొనుట డొంకతిరుగుడుగాదా!

రా:- (నవ్వి) తమ్ముఁడా! నీవనినది కాదనను కాని,

ఉ॥ రావణునంతవానిని బరాజితుఁజేసినవాలి సంధిఁ దా
నేవరియించునే? యడుగ నిచ్చునె? సాయము రాఘిగాఁగ సు
గ్రీవునిమైత్రి గట్టివడఁ గీశపతి వ్యథయింతు, నన్యదా
రావరణుండె పుత్త్రుఁ డనికాఁగుశచీపతి వంతఁ దీర్చెదన్॥ 32

ల:- అన్నగారియాలోచన లెప్పుడుఁ గార్యజ్ఞతనే వెల్లడించును. అదియునుంగాక, శాపమోక్షమునుంబడసి స్వర్గమున కేగునారాక్షసుఁడు గూడ గుహునిమాటచొప్పుననే దేవర నిర్ణయింపఁగలరనియె.

రా:- అందుచేత నీగుహుఁడే యెదురురాయభారము నడుప నర్హుఁడు

ల:- (గుహునితో) సఖా! నామాటలుగ నీవాసుగ్రీవునితో నిట్లు పలుకుము.

మ॥ నినుఁగన్నట్టియినుండు మాకులగురుండే! మామనుత్సాప్రుఁ డ
య్యెను దా నీకును మాఋదల్లినుతుఁ డిల్లైన్నంగ సాజంబ నీ
కును మాకు న్గలమైత్రి; కోర్తిప్రకృతి న్గ్రింకింతువా దాని, వా
లిని బోకార్చుశరాళి కొంకవు నిను న్లేహంబుగా మార్చఁగన్॥ 33

రా:- బాబా! గుహా! మాలక్ష్మణుఁ డాపౌలస్త్యమీాదికోపముచేత
నేమియేమియో యనుచుండును లే! ఈరాముఁడో ప్రతిక్షణముజ్జ్వ
లితమగుచున్న యీజానకీవిరహానలము సాక్షిగ నగ్ని మోలి సుగ్రీ
వునితో సఖ్యమునొనర్ప సుముఖుఁడై యున్నాఁడు.

గు:- (సంతోషమున) సూర్యపుత్త్రుఁడు దేవరవారిచే మిక్కిలిగననుగ్ర
హింపఁబడినాఁడు, (పరిహాసమునవ్వుచు)

శా॥ ఆసుగ్రీవుని బక్షపాతమధురం బౌచూడ్కిఁ దా మాదుకోన్
మా సీమం బనుకొందొ్రియేమొ! సుతుఁడిమ్మాద్రిన్ బ్రిభుండౌట కెం
తొసంతోషముతోఁ దదీయజనకుం డుప్పొంగఁ దద్భానుపా
ళీసాహస్రిమహోత్కటోష్ణములు నల్లిన్గొలి మమ్మేర్చుఁజూ!॥ 34

ల:-(నవ్వుచు) ఏమిది ? సుగ్రీవునకు రాజ్యప్రదానముంగూడ మేమంగీ
కరించిన ట్లిప్పుడే యీగుహుఁ డనుకొనుచున్నాఁడే ?

రా:- (నవ్వుచు) వత్స! గుహుఁడా! ఇప్పుడే రాజ్యప్రదానవిషయము
నే నసఁదలపన.

గు:- (వినయమున నవ్వుచు) మహాపురుషులమార్గములిట్టివే.

క॥ సంకల్పమె సత్పురుషుల
నుంకింపఁగఁజేయుఁ గృతుల నుత్సాహమునన్
బంకజముల కేప్రితిన ను
టంకించె నినుండు ? తెల్పుడా! సిరిఁగూర్పన్॥ 35

(మఱిలఁదెరలో) ఓహో! సమీాపవానరులారా! వేగమ వెంటనే
చెప్పుఁడు! దుందుభియెముకలగూడు నెగజిమ్ముటచే స్పష్టమగు
చున్నగర్వమున నంధుఁడగునెవ్వఁ డింతకాలమునకిప్పుడు నాభుజ
కండూతిం దీర్చుకొన గురికాఁదలఁచెనో ?

గు:- (తనలో)

ఆ॥ బాహుగర్వరోగబాధ మెండున నిత్య
కోపియైనప్లవగకుంజరుండు
జాంబవంతు ప్రేరణంబున సుగ్రీవుఁడై
వచ్చినాఁడు బిట్టుక చ్చఁబట్టి॥ 36

అందుచే నేనుగూడ నొకముహూర్తకాల మీవీరవిహారసుఖము ననుభవింతును.

వాలి:- (ప్రవేశించి, ముందుజూచి) అరరే! ఎవ రీప్రసన్నోజ్జ్వలాకారులు! రాక్షసకళంకాళమసైగిరిపడుటకు వీరే కారకులా! (జ్ఞప్తి నభినయించి వితర్కముతో) నాప్రియమిత్రుఁ డగులంకాపతి చెప్ప నే చెప్పినాఁడు.

గీ॥ "జనకుఁడు త్యజింప హతభాగ్యమనుజుఁడొక్క
యలఁతిదార పెద్దబిడ్డఁ డిం దనుజతోడ
భాగలబ్ధంబు కాంతారవాస మూఁని
బ్రిమిసిచరియించు దండకారణ్యభూమి॥ 37

వారిరువురు వనులఁ జరించుచు మననిశాచరుల దోఁచుకొనుచు దొంగవృత్తి నవలంబించియున్నారు. వారిని వారింపఁ జూడు"మని. వీఁడు మఱివీఁడును వారే యైయుందురు.

రా:- తమ్ముఁడా! ఈమహావీరుఁ డేమిచెప్పునో!

ల:- (కొంచెముసమీపించి) చూచితివయ్యా యిచటిమమ్ము?

వా:- ఓహో! ఈమీరలెవరు?

ల:- మేము క్షత్రియులము రాఘవులము

వా:- ఆయుష్మంతుఁడా! ఆకారమే ఆజాతిం జెప్పుచున్నది. విశేష మున్నఁ జెప్పుము.

ల:- రాఘవుల మనియుం జెప్పలేదా?

వా:- (అసూయతోవలె) ఆఁ!

ఆ॥ రూపములె క్షత్రియత్వంబుఁ జూపఁగలవు
రాఘవపదంబొ వంశంబు క్రమమె తెల్పె
నామము లెఱుంగఁదలఁచిననాకుఁ గులముఁ
దెలిపిపంతనె కోరిక తీఱఁగలదె?॥ 38

ల:-(ధైర్యసంభ్రమమున) మే మారామలక్ష్మణుల మోయీ!

వా:-(సవిత్కారముగఁదనలో) ఆ యనుదానిచేఁ బ్రసిద్ధుల మనుచు
న్నాఁడు. శివునివిల్లును విఱిచినవాఁడు వీరిలో నొక్కఁడయియుం
డునా? కాని మ్మనిచూచెద. (ప్రకాశముగ నవ్వి).

శా॥ వేషాలో? సమరార్హసాధనములో ప్రేయస్వరూపంబులో!
భూపాతుల్యగభీరవృత్తులో! సమంబు లూహ్చడ మీలోన భూ
యోషాధీశవధవ్రతు నృభృగుపతిన్ వ్యగ్రత్వ్యంతదీక్షుండుగా
నీమద్వీరు నొనర్చు రాముఁ డేఁడీ? చూడఁగా వేడుకా!॥ 39

ల:-(వినయమున) ఆర్యా! సంక్రందననందన! నేను లక్ష్మణుఁడ!

వా:-కుమారా! ఈయింకొకఁడే దాశరథియుఁ గౌశికశిష్యుఁడు నదు
రాముఁడా?

ల:- కాకేమి?

వా:- (సంతోషోల్లాసములతో కొంచెముబిగ్గరగ)

మ॥ ధర త్రైవర్ణ్యమె చేయు భార్గవమహాస్త్రక్రాంతిలోనుండి భూ
వరజాతి న్దొలగించినాఁడవట! సేబా! సుప్రభాతంబు! క
క్షత్రరసం బార్పిన పంక్తికంఠసమగోత్కం బైనకండూతికిన్
దొరకన్గల్గితి. నేఁడు నాకనులు నెంతో తేఱు రా! రమ్మిటుల్!॥ 40

రా:- (చూచి, హర్షమున) ఈమహాబాహుఁడేనా సంక్రందననందనుఁడు?

క॥ ఈవీరవరుని రక్షం
జేగినకిష్కింధనైన శ్రీవసుమతి యా
రావణపరాభవంబుల
హావడికి న్దొలఁగి యూర్పులాడ నెసంగున్॥ 41

(పరిక్రమించుచు)

ల:-ఓమహాభాగుఁడా! వీరే మాయన్నగారు రమ్ము! ఇటు! ఇటు!

వా:- (సమీపించి) రామభద్రా!

గీ॥ ప్రాణమొడ్డి పోరాడునురాసురులకు
సభితుఁ డైయున్న నారదసంయమీంద్రుఁ
డిపుడు నీవు నాభుజముల కింతయగ్గ
మాకతన మేలిసంతుష్టి నందుఁగాఁత!॥ 42

రా:- ఓమహావీరుఁడా! ఏమనుచున్నాఁడవు? యుద్ధమందు నిరర్గళ
వ్యాపారు లగువారి మూర్ధాభిషిక్తుఁడవుగదా!

మ॥ అమరీవేణుల నేఁచువైరితతిపై నత్యంతమై రేఁగుద్వే
షముచే నెల్లెడ భీకరం బయినతేజం బొప్ప నిండ్రిందు దే
హమున న్నాఁడెడితూపు లూడ్చినవరిణాళి వేకను లో హరూ
క్షములై మండఁగ నిన్నుఁ బుత్త్రికునిగాఁ గాంచెన్గదా! వానరా!॥

మఱియు

మ॥ జగము ల్మాఁటి జయించుబాహుపరిఘ ల్పందీనిరక్షోపతిన్
వగ చెంద నిజకక్షఁ బట్టి తతితో వారాశుల స్సంధ్యవా
ర్వఁగఁ, బ్రత్యక్షముఁ గాఁ గ్రవీర్యునిప్రతాపం బెన్న రేవ న్విడన్
జగము న్దక్కినసంద్రము ల్వదులు నాశ్చర్యంబుదా 44

వా:- (వికటముగ, నవ్వి)

క॥ రక్కసివీరులమూఁకల
నుక్కడఁచెడి మేటిద్వంద్వయుద్ధంబునఁ జే
రెక్కి యిటఁ బెక్కునాళ్ళకుఁ
దక్కితి, వీ తేనెనుడులఁ దనిసి విడుతునే?॥ 45

వినుము!

శా॥ దేవ స్సర్వనృపాలమారకధనుర్దీపంబుఁ గైకొంచు, వం
శాన న్జానగురుక్కు భార్గవుకయి స్సంధిల్లఁగాఁ జేసి త
ద్దాని, న్వీరుఁడ! మూఁడులోకముల హృన్మాలిన్యము ల్దీర్చుమం
దౌ నీతేజఁ గన న్జిరంబుఁ గుతుకంబందుండె నీహ సముల్॥ 46

రా:- (నగుమోమున)

గీ॥ దనుజకులలక్ష్మికి న్మాలమును హరింపఁ
గదనజయసంపదల నిడఁ గాణయాచి
నారి సంధింపఁబడియె యున్న యది నిజము
కనుమ! కుతితీఱఁగా నాదు కార్ముకంబు!

కావున, మహాభాగులగు తమరుగూఁడ శస్త్రముంగొనుఁడు!

వా:- (నవ్వి) బళె! మహాక్షత్రియుఁడవు. కాన, బాగుగఁ బల్కితివి.
ధర్మానుసారముగనే యున్నది. కాని,

గీ॥ బాహుబలశాలు లగు యుద్ధభటులలోన
నాత్మజాతికి ననుగుణ మాయుధంబు
ఇనుపముక్కలు కైదువులే కపులకు?
గోళ్ళు, దంతములు, ముష్టులు న్గదిరియుండ॥ 48

ల:- ఆర్యా! ఈ మహాభాగుఁడు చక్కఁగ వచించినాఁడు. తిర్యగ్జాతికి స్వాంగాయుధములు సర్వసిద్ధములే గదా!

రా:- (నవ్వి ధనుస్సు సారించి) అహాహా!

ఉ॥ గౌతమశాపదీప్తి భుజగర్వము మాసినయిందుని, నెన్నొ మే
లూఁతము లొప్ప రావణియె యోరిచి దుర్యశమీా న్దశాననున్
స్వీతగఁ జంకలన్నిలిపి, వీరుఁడ!, తండ్రిపగ న్దొలంచి యు
త్యాతతసౌఖ్య మిచ్చితి మహాత్ముఁడ! పుత్త్రి డవన్న నీవకా! 49
అంతటి నిన్నే దైవము నాశరము బారిం గూర్చనే!

వా:- (రోషమున) ఆఁ! కాకుత్స్థ!

శా॥ అడ్డాదిడ్డిగఁ జేతు లిర్వదియుఁ గీళ్ళార్త్రిన్బడ న్జంకలం
దొడ్డారింపఁగలేమి నార్చెఁ గొనవయ్యో సర్వజద్ఖ్యాతి సం
చుడ్డాటన్బడి రావణుండు!, ఘనమా! యోడంటె మున్నైహయుం
డడ్డ! న్భార్గవు గెల్చుని న్గెలువ కానా నాకు నేయున్నతుల్? 50
కావున, సమరమునకుఁ దగినతావున కరుగుదము రమ్ము!

(వాలి, రాముఁడు నిష్క్రమించు.)

గు:- (తనలో) అదృష్టముండుట చేతనే నాయభీష్ట మీడేరుచున్నయది.

ల:- (తెరవైపుఁజూచి) ఇదియేమి? ఇంకొక వానరులజంట అన్నగారి వెనుకఁ దగులుచున్నారే! నేనుగూడ ధనువు నెక్కిడుకొని సిద్ధముగ నుందును. (అట్లొనర్పనుంకించును).

గు:- (చూచి, సంతోషమున) లక్ష్మణకుమారా! తత్తఱపడకు! రాముగుణములపై ననురాగాధిక్యత చేతను వాలిపై కసిచేతనే నిజముగా రెట్టించిన యుత్సాహముతో సుగ్రీవుఁ డిట్లు వాలికలనునకు దూకుఁట.

ల:- ఓహో! ఈతఁ డల సూర్యపుత్త్రుఁడా? మంచిదే. అరెండవవాఁ రెవరు?

సు:- అంతేకాదు కిష్కింధేశ్వరస్కంధావారమునకెల్ల నేకవీరుఁడని పేరొందిన హనుమంతుఁడు, భగవానుడగు వాయుదేవునిపుత్త్రుఁడు సుమా!

ల:- (సంతసమున) ఎట్లెట్లా? ఆంజనేయుఁ డనఁగా నితఁడా!

ఆ॥ నలువ శాపబలమున నదనలావుఁ దా
నెఱుఁగ లేనిజడత నెసఁగియుంట
జగతి వారివీరి మగతనా ల్వెల్లంగఁ
దనను గానియట్లు తనరు నితఁడు॥ 51

నిశ్చయముగ నీతనికౌశల్యముచేతనే మామనశ్శల్యంబులు విడిపోఁగల వనిపించుచున్నది అదిగో! జరుగుచున్నదే వాలికినన్నగారికి ద్వంద్వ యుద్ధము! జయలక్ష్మీపరిగ్రహోత్సవమున నీయనకుగాని నాకుఁగాని పాలిభాగము దొఱకునట్లు లేదు.

సు:- (సంభ్రమమున) కుమారా! చూడుము! చూడుము!

క॥ సాలము లేడును వసుధ
న్గూలుచుటయెగాక వాలిఁగూడ జదిపి పె
న్వాలమ్మదె తూణమ్మున
వ్రాలె మఱల రామకరపరామర్శితమై॥ 52

ఆహాహా!

ఉ॥ దిక్కులఁ బిక్కటిల్లి జగతి న్బయిపొంగుయశంబు వెల్లితో
నెక్కొను నాదిమాద్రి యగు నేర్పరి వాలి యుసుర్ల మేలిమి
న్జొక్కపుఁ దమ్మిదండ మెడఁ జూన్పి మహాతిథియైనరాముని
న్జక్కఁగఁ దన్పి వీరశయనంబున నొందెడిఁ బెద్దనిద్దురన్॥ 53

ల:-(అనుతాపమున) అయ్యో! దేవా! సంక్రందనా! వేకన్నులుండియు నింతటిమహావీరవ్రికాండు నింకెందుఁ గనఁగలవు!

తెరలో - దుందుభిధ్వని-మంగళగీతములు

సు:- (హర్షమున) ఏమిది! ఈనీలుఁ డవ్వాడే జాంబవత్ప్రముఖులచే నభిమంత్రితంబులైన బంగరుకలశములతోఁ గుమారసుగ్రీవు నభిషేక మునే చేయుచున్నాఁడే! దాశరథియు స్వయముగ నతనికంఠమును బంగరుపద్మములచే నలంకరించుచున్నాఁడు!

ల:- ప్రియము! కడుంగడుప్రియము !

(తెరలో) వానరసేనాధిపులారా! భల్లూకచమూనాథులారా! గోలాంగూలవాహినీనాయకమణులారా! ఆలకింపుఁడు మిమ్మెల్లర నీసుగ్రీవమహారాజు జ్ఞాపించుచున్నాఁడు. సమస్తయువరాజోపకరణములను సిద్ధపఱపుఁడు! సీతయునికి నెఱిఁగివచ్చుట కీహనుమంతు ననిపి నేనీపై ముహూర్తమున నేయంగదకుమారు యౌవరాజ్యమున నభిషేకించెదను.

ల.

గీ॥ ఎల్లవిధముల మనముల కింపొనర్పు
చున్న దీయుత్సవంబు మా కున్నపాట
వాలి లేకుండెనే యనువంతయొకఁటె
కలఁచుఁగాఁబోలు నొకవేళ నలశచీశు !॥ 54

అంతరిక్షమునుండి పుష్పవృష్టి - తరువాత

తెరలో-జగత్పతియగురామభద్రునకు జయము! జయము!

శా॥ ద్వైరాజ్యంబున సౌఖ్యమేమి యనుచింతం గొన్నవై రాగ్య మా
స్వారాజాత్మజు శోకచేత శమియుంప న్దాను గిష్కంధదే
శారాధ్యుండయి సూర్యసూతి సిరి డాయన్ యౌవరాజంగదుం
డై రాజిల్లుట నింద్రు వేకనుల ముత్యాలయ్యె మోదాశ్రువుల్॥

ల:-ప్రియము లన్నిట నిది మాకు మిక్కిలిప్రియము!. మిత్రమా! పద! మనముగూడ నియ్యుత్సవములలోఁ బాల్గొందము! (నిష్క్రమము)

ఇ ది అ యి ద వ య ం క ము



# శ్రీమదనర్ఘరాఘవము

## ఆఱవయంకము

లంకలో (ప్రవేశము) మాల్యవంతుఁడు.

మా:- (అంతటం బరికించి, దుఃఖముతో) అయ్యయ్యో! ఎంతకష్ట
మెంతకష్టము!

ఉ॥ ఆచెడుకోఁతి యాహనుమ యట్టిటు తోఁక తృణం బొకింతగా
వీచినమాత్ర నంటుకొని విస్తృతి నొక్కటెనిప్పుకొండగా
రేఁచినయగ్ని ముంచుకొన "రి" వ్వనుహారున నుండి లంకఁ బే
ర్చోచిన పైఁడిమేడనగరుల్ చెడి ముద్దలుకట్టె నక్కటా!॥ 1

మఱియు,

గీ॥ పల్లము మెఱకయు రూపను
లెల్ల పనితనములవిధము లేర్పడక మణి
పొల్లసితసౌధముల శిఖ
లల్లఁగ వేండ్రించె తెలిపె నవి జ్వాలలుగన్ 2

(విమర్శించి) ఆహా! కానున్నవిధి నాఁపతేమి యుట్లేకదా!

చ॥ ఘనకరపాళిక్రిండఁ ద్రిజగంబులలక్ష్మి విధేయగాఁగ రేఁ
గునతిశయాన వెండిమలఁ గ్రూరత నెత్తుదశాననోరుర
క్షన యమరావతీపురికి సైతము వంద్యగఁ బేరుమ్రోఁగు లం
కన! యొకక్షుద్రవానరము కాల్చుట! లిస్సిరో దైవభావ్యముల్!

రావణుని దుర్ణయముల కిది యణుమాత్రముంగాదు (చింతతో
మిన్నుఁజూచుచుఁ దనలో) అయ్యో! పౌలస్త్యా!

ఉ॥ నాలుగె నాముఖాలు పదునాలుగువిద్దెలఁ దాల్చుకస్తికిం
బాలగుపేటి కంచు మునిమన్నని నిచ్చదిమోము లిచ్చుచున్
మేలొనరించె నల్వ, మిడిమేలపుజడ్డమునింగినీ విట
గ్గాలి కుమారిల స్టలఁపుఁగొంటి! విదెచ్చటినుండి వచ్చెరా?॥

(ఇంచుక ధ్యానించి) మనకుల మేల యీలీల వ్రీలిపోయెడినో

గీ॥ రాముచేత ఖరాదిమారణము కలిగె
మారుతియె చంపె నక్షకుమారు నిందె,
స్వయముగా రావణుఁడె విభీషణుని నింటి
వెడలిపోవంగఁ దరిమెనే కడలిదాఁటు॥ 5

దుర్బుద్ధియగురావణు నెంతదూఱిన నేమిఫలము? సముద్రపు టుత్తరతీరమున స్కంధావారము నేర్పఱచికొనినదాశరథి యేమేమి చేయ మొదలిడెనో యెట్లు తెలియుట? (ముందుఁ జూచి) ఇదిగో! రాఘవప్రారంభంబుల నెఱింగిరాఁ బనిచినశుకసారణులలో సారణుఁడే ముందునచ్చుచున్నాఁడే!

సా:- (ప్రవేశించి) చిన్నతాతగారికి జయము! జయము!

మా:- (అగ్గించి దగ్గఱఁ గూర్చుండఁ బెట్టుకొని) అబ్బాయీ! సారణా! సుగ్రీవు శిబిరమునుండి యిప్పుడేవచ్చుచున్నట్టులున్నదే!

సా:- అవును తాతా!

మా:- అచ్చటి నీయనుభవ మంతయుం జెప్పుము!

సా:- వనేచరులచే రాఘవున కెంతపాటిసాయమో నీకుఁ బలుమాఱులు వినిపించియే యుంటినిగదా! ఇప్పుడు సేతువును నిర్మించుటకై చేరిన సైనికులలో నేనుఁగూడ వానరరూపమున నుండ మహారాజుగారగువిభీషణకుమారులు (అర్ధోక్తిలో భయమున నటునిటు చూచును) తాతా! చాలకాల మటనుంటచే రామరాజధానిలోఁ బ్రబలిన ప్రవాదము నన్నలముచున్నది.

మా:- ఆచిన్నతమ్ముఁడు రాఘవునిచే నభిషిక్తుఁ డయ్యెనా యేమి?

సా:- నిజమంతియ.

మా:- (ఇంచుక సేపుమాత్రిన్పడి, నిట్టూర్చి) కుమారా! నిర్భయముగాఁ దెల్పుము!

సా:- విభీషణరాజకుమారుఁడు నన్నుఁ బోల్చుకొని బంధించి రాము నెదుటం బెట్టెను.

మా:- (శంకతో) తరువాత?

సా.- తాతా! తరువాత నాదాశరథి తనమంత్రులకంటె మిన్నగా నన్ను గౌరవించి బహుమతులనొసఁగి పోయిరమ్మనియెను.

మా.- (హర్షమున) ఏమంటివి ? జయశీలు రఘువారి కీర్తిఘనగుణ మాజన్మాంత ముండునదియేకదా! అందులో నట్టిది రామభద్రుని కడ విశేషముగ నున్నట్లున్నది.

చ॥ తనయెడిలోనివే యనుచు, దాయసరోజమునుండి లేచివ
చ్చినవని భేదమెన్న కొకచెన్నునఁ దేఁటులనెల్లఁ దేర్చుక
ల్పనియతి సాధు లెప్డుఁ దనవా రొరులం చెడసేయఁబోవకే
వినుతురు సేవ నెవ్వరికి నేని సుధామధురక్రియాఘురిన్॥ 6

అదిసరియెకాని నీకుఁ డెందున్నాఁడు ?

సా:- నాకును వానిజాడ తెలియలేదు.

మా:- (వితర్కించి) కుమారా! విభీషణుఁడు రాముని పక్షము నవలంబించుట మనకులమున కేహాని యని కుంగిపోవుచున్నాఁడను.

సా:- తాతా! అంతటిధర్మదృష్టిగలవాఁడే! ఆర్యసంతానమే! విభీషణ కుమారుఁడు! మఱి జనకసముఁ డగుపెద్దన్నగారిని బరిత్యజించి శత్రువులఁ జేరవలసివచ్చు టెట్లు ?

మా:- ఏమో! ఆదశగ్రీవునేయడుగుము! (నిట్టూర్చి) లేకున్న నాదైవమునే యడుగుము !

సా:- అదికాదుతాతా ! వినఁదగినచోఁ దెలుపుడురని

మా:- పిల్లఁడా ! విను ! కేసరిభార్యయందుఁ గాలిదేవునకుఁ బుట్టినవాఁడున్నాఁడే-హనుమంతుఁడు - వానిచేత ధ్వంసముచేయఁబడిన యశోకవనింగని రావణుఁడు విభీషణునితో "కుమారా! చూడుము! ఆమనుజబాలికద్వయముచే దగ్గఱకుఁ దీయఁబడినక్రోఁతిపు ర్వెట్లు విజృంభించినదో! అనియెను.

సా:- తరువాత! తరువాత!

మా:- ఆమాటమీాద విభీషణుఁ డన్నకు నమస్కరించి యిట్లనియెను.

మ॥ నరజాతి న్నరిజూడు! హైహయునిజస్యం బింత లోనెంచి, వా
నరజాతి న్నెరసింతె! వాలిభుజబంధంబున్ స్మృతింగొన్న! న
ధ్వరివే ! ని న్నిటు వేడుకొందును, పులస్త్యబ్రహ్మపుత్రా ! త్వరన్
ధరణీపుత్రి నొసంగుమీా! దివిజసంఘంబుం జెఱ ల్బాపుమీా !॥ 7

సా:- (బహుమానముం గూడిన వింతతో) తాతా! వాలిభుజమున జ్ఞప్తికి వచ్చినది.

ఉ॥ సేతువుఁగట్ట మోసికొని చేర్చెడి శైలశిఖాళి రాపు ముం
జేతుల రోమహీనములఁ జేయఁ జరించు ప్లవంగవీరవి
ఖ్యాతభుజాధ్వజాళి బరువైనను సైఁపదు మేరువై రవి
ద్యోతితకోమలోరుశిఖరోగ్రము వింధ్య మదేమి సెప్పుదున్॥ 8

(భీతితో) తరువాత! తరువాత!

మా:- ఆ వెనుక రాక్షసేంద్రుఁడు కన్నులుగాననిరోషాతిరేకమున బరువము లాడి విభీషణకుమారుని విరోధులనేనిఁ జేరునట్లొనర్చెను.

సా:-(ఖేదమున నింగిఁ జూచుచు) అయ్యయ్యో! మహారాజా! పులస్త్యనందనా! వైధర్మమునందు నిన్నే దృష్టాంతముగఁ గైకొని జనులిక ముందు తమకు మూలచ్ఛేదనముం గూర్చుననుననుమానముం గల పనులేనిఁ జేయకుండఁగల రనుకొందును. (ప్రార్థనముగ)

క॥ సిరి యనుభ్రమరికిఁ జరణము
లరిషడ్వర్గములె యగుట సందోకదానిన్
విఱిచి వెసఁ గుంటిదానిగఁ
బఱప గదే! తండ్రి! స్థిరతఁ బడియుండునటుల్॥ 9

(మంత్రితో) రామునిచేఁ బన్నఁబడిన వానరవాహినిం గనుంగొనిన తరువాత మనకులమున కిఁక విభీషణుఁడొక్కఁడే మిగిలియుండఁగల యంకురమనుట సత్యమనిపించుచున్నయది.

మా:- (నిట్టూర్చి) వత్సా! రెండుకటములసంగతి నీ వానుమట్టుగ నెఱుంగుదువుగదా! ఇపుడుచిత మెద్ది?

సా:- నాతలంపిది. రాజపుత్త్రుఁడైనయంగదుఁడు పసివాడు కొ్రత్తకుండవంటి బుద్ధికలవాఁడు. చెప్పినదెల్ల నమ్మఁగలడు.

మా:- అయిన నేమగు.

సా:- రావణునాజ్ఞగా రహస్యముగ వేగువానిచే నంగదునకొకవార్త. ఏమందువా? వానితండ్రికిం బగవారైన రామసుగ్రీవులఁ జంపి కిష్కింధారాజ్యమున కంతటికి నతనినే యేకచ్ఛత్రాధిపతినొనర్తుమని చెప్పి ప్రలోభింపఁ జేసినచో నతఁడు సుగ్రీవుశిబిరమును విడిచి

రాఁగలఁడు సుగ్రీవుఁడో తనయిల్లే యహిభయభేదశిథిలితముగఁ దలంచి రామప్రయోజనము నుజ్జగింపఁగలఁడు !

మా:- (నవ్వి) కుమారా! నీయూహ చక్కగనే యున్నది. కాని, యంగదుఁడత్యంతముం బసివాఁడై యున్నాఁడు, యౌవరాజ్యసుఖాదికములచే బంధుగులచే మిక్కిలిగ నుపలాలింపఁబడుచున్నవాఁడు. అట్టివాని విడదీయు టసాధ్యమేగదా! అందుపైని వీనిమాతాపితృబంధువులు సుగ్రీవునకుంగూడ దగ్గఱబంధుగు లగుటదలంపవలదే! వీఁడొకవేళవిడిపోఁబ్రయత్నించిన జూచుచు నూఱకుందురా?

సా:- తాతా! తమ రనినదియు వాస్తవమే. దండనీతి నుపయోగించుటకుఁ గాలముఁగూడ ననుకూలముకావలయునుగదా! కపివీరుల సేతునిర్మాణోత్సాహము న్దలంచినచో నీపాటికే రాముఁడు మహార్ణవమును దాఁటి సువేలాద్రిసానుప్రదేశములలో విడిసియుండు ననుకొనవలసియున్నది.

మా:- (విమర్శఁదగులు నద్భుతమున)

ఆ॥ ఓహో యబ్బురముగ నొకనరమాత్రుని
వలన నుదధి దాఁట వలనుపడిన
నెట్టిమనుజుచేతనే న్దశకంఠుప
తాపమెల్ల నింక దాఁటగాదె! ॥ 10

(దుఃఖమున)

మ॥ మును దేవాసురపూజ్యరావణపదంబు ల్నేఁడు నిర్మాల్యత
న్గనఁగా రాముఁడు సేతునిర్మితిని నెగ్గన్గాంచె న్దీప్తి హె
చ్చున సూర్యుం డలరించుఁ బద్మవితతిన్, జొక్కంబుగా నూరసా
గు నవీనేందుసుధన్ యథేచ్ఛఁగొని తాగు న్సర్వదేవౌఘముల్ ॥

(విమర్శించి) నాయనా! సారణా! మును పే వాలినిసంహరించి తనసేనను వెనుకపాటుగఁ జెనకువా రెవరు లేకుండఁజేసుకొనియెంగదా! లెక్కింపరాని యుక్కుతునియలవంటి మర్కటసైన్యములకు నాయకుఁ డగుసుగ్రీవునకు యూపిరాడనీయని సాహాయ్యమునొనర్చి తనకత్యంత మిత్రునిగాఁ జేసికొనియెంగదా! తన కత్యావశ్యకుఁ డగుహనుమంతునిచే నిచటి యానుపానులన్నియు మూలముట్టుగ

నెఱిఁగికొన్నాఁడుగదా ! ఇఁక నాతఁడు దాఁడి వెడలుట కిదిగాక
మంచిసమయ మింకొకటఁటి యుండునా ?

సా:- నిజమే తాతయ్యా ! అదియంతియు. ఆత్మద్రవ్యామాత్యసంపన్ను లగువారె ప్రభువు జయసమృద్ధిఁ గలవారగుదు రనువాక్యమునకు నీదాశరథియగు రఘురాముఁడే ప్రథమోదాహరణముగ నున్నాఁడు.

మా:- (మార్పాటునభినయించి)

ఉ॥ పెట్టనికోటవాలి పడఁ; బోపఁడనుండెడిమాటు, సంతతం
ద్దిట్టము వార్ధిసంవృతముఁ దేఱికనంగనురానిదుర్గమే
పట్టగునన్న ! లక్ష్యము ? ప్రపంచవిచక్షణసద్గుణాఢ్యుఁ డా
జెట్టికి రామభద్రునకిసీ ! శతయోజనవార్ధి దాఁటుటల్ 12
(వేడినిట్టూర్పుతో నింగిఁజూచుచు)

శా॥ రెంట న్నిస్త్రనయుగ్మదుగ్ధముల నార్తిం ద్రావుచో నాలుగా
జంట ల్మస్తము లేర్చుచు న్గొనల జ్వాలాన్మల్కల న్నాక వా
ల్గంటీ ! కేకసి ! పెంచి తీవ్రశగుణాగ్రిము న్దశగ్రీవు ! నా
కంటఁన్నె జెడి. వీరసూ ! భగవతీ ! కాంచంగనౌనోకదా !॥ 13

సా.- (డగ్గుత్తికతో) పాపము శమించుఁగాక ! శమించుఁగాక ! అమంగళము ప్రతిహతమగుఁగాక, ప్రతిహతమగుఁగాక ! బంధుహృదయము లెప్పుడు నాపదల శంకించుచునేయుండు నూఱడిల్లుఁ డూఱడిల్లుఁడు! ఇది యునుంగాక,

గీ॥ బాహుపురులెల్ల కావడిబద్ధలగుచు
గుణగణంబుల ప్రాపు నెక్కుడుగ నిగుడఁ
బటుధురీణతఁ దానె రావణుఁడు మోయ
జాతెనే రాజ్య మది దాని సాజమయగు॥ 14

మా:- (కన్నీటి నాపుకొనుచు)

గీ॥ తెగి నశించెను నాభాగధేయ మింక
నాది యొకప్రజ్ఞ యని యెట్లనంగఁగలను ?
నీళ్ళు వదలంగ నొక్కఁడే న్మిగిలిన, నది
విశ్రవసు సత్తపోబలంబే యగుఁజుమి !॥ 15

శుకుఁడు— (తెరఁజిమ్ముచుఁద్వరతోఁబ్రవేశించి)

గీ॥ అలమహోదరు, ధూమ్రాక్షు నాప్రహస్తు
సచివవరుల సేనానులఁ జక్కడంచి
వసుధ కప్యేకజలధిగాఁ బఱపి బిట్టు
ముట్టడించెను లంక రాముండు నేఁడు. 16

మా:- అనుకొననే యనుకొంటిమిగదా! అట్లే జరిగినది,

సా:- తెలియవలసిన విషయములెల్ల నద్దములోని ప్రతిబింబములవలెఁ బెద్దలబుద్ధికి దేశకాలభేదములులేక తట్టుచునే యుండునుగదా!

మా:- (వితర్కముతో మిన్నుఁజూచుచు) రామభద్రా! మంచిది! మంచిది! జయశీలు రగువారికార్యసానుకూలతకు దీర్ఘదర్శిత్వమే కదా ముఖ్యము!

సా:- శుకా! రాక్షసేంద్రుం డేమొనర్చుచుండెనో చెప్పవదా?

శు:- (దుఃఖశ్మితమున) మిత్రమా! ఏమని చెప్పుదు?

ఉ॥ చిత్తరువందు సీత కుచసీమలఁ బత్త్రము నుంచ నేర్చి పె
న్మత్తున రావణుం డమరిన న్వినవచ్చె సువేల రాముపై
రొత్తిడి, సంభ్రమానఁ గరయుగ్మములం దొకకొన్ని దూసెఁ బె
న్గత్తులఁ, గొన్ని మీటెను గుణంబులఁ దక్కిన వ్రాలె దిద్దఁగన్ !॥

మా:- (ఊపిరిఁ బుచ్చుకుని) అయ్యో! సారణకుమారా! ఇప్పుడుగూడ హృదయచంచలత్వము సడలఁగూడదా (శుకునితో) నాయనా! శుకా! పురద్వారముకడఁ గాపుంచఁబడిన శౌల్కికయూథాధిపతి నరాంతకుఁ డేమెంచెనో?

శు:- (నిశ్వసించి) ఆకుమారుఁడు ద్వారమర్యాదను జేయనే జేసెను. కాని అంగదునిచే (అర్థోక్తిలోఁ దలవంచి కన్నీటితో నిల్చును.)

మా:- అయ్యో! బిడ్డా! దశగ్రీవకుమారా! ఇట్టివన్నియుం జూచుట కే కాఁబోలు నాకీచిరాయువు.

నేపథ్యమున-ఓహో! మహాపార్శ్వుఁడు మొదలగు సైనికులారా

శా॥ జ్వాలాస్య జ్జగని న్మహాస్త్రమయి నాస్థ న్గాల్చి మర్లుం డిసీ!
గోలాంగూలపశు ల్కనందగునె మీకోలెమ్ముల. న్లక్ష్మణు

స్థూలంద్రోయఁగ మేఘవాధుఁ డదె కైకొన్నాఁడు దీక్ష, నసి
న్వాలు నైకొనెఁ గుంభకర్ణుఁడు. భయంబా! యింక నారాము చేన్!

సా:—(విని, సంతసమున) తాతా! మనబలముల కిపుడు మంచియవ
లంబనము లభించినది. తనంతట మేల్కొనిన కుంభకర్ణకుమారుఁడు
మేఘనాధుం బురస్కరించుకొని శత్రువుల నెదుర్కొనుట కలిగెఁ
గదా!

మా:- (నిట్టూర్చి) జయింతురిగాత రామలక్ష్మణుల కుంభకర్ణ మేఘ
నాదుల!

శు:- (వగపుతోఁదనలో) అయ్యో! అమంగళము శాంతమగుఁగాక
శాంతమగుఁగాక! కర్తృకర్మభేదము స్పష్టము కాకుండ పలికినాఁ
డేమిగతి!

మా:- (దుఃఖముతో) శుకసారణ కుమారులారా! ఈరాక్షసరాజ్య
లక్ష్మి కుంభకర్ణునిపై నాధారపడియున్నది నేఁడు.

గీ॥ అన్వయవ్యతిరేకంబులందు బలియుఁ
డెవరి నభిషేక మొనరించు నెఱుఁగరాదు
తనకు నగ్రజుఁడైనయీదశవదనునొ?
తన కనుజుఁడైన యావిభీషణునొ యేమొ?॥ 19

(నేపథ్యమున)

ఉ॥ రావణు నాన! యోశమతరాజ! భుజంగపతీ! భయంపడ
నోపకుఁడయ్య! యిప్డు పడఁబోవఁడు పెద్దభరంబు భూమిపై

శు:- (సంతసమున) నిశ్చయముగ మనవారెద్దియో విశేషపరాక్రమ
మును జూపియుందురు

మా:- (అవధానమున జెవి యొగ్గును మఱల నేపథ్యమున)
లావు కరాదు లొక్కొక టిలన్బడ, మిన్దల చొచ్చెఁ, దేలికై
మావరకుంభకర్ణు మెయిమాత్రమె యల్లన ధారుణింబడెన్॥

మా:- అయ్యో! కుమారా! (మూర్ఛిల్లును)

శు సా:- (కన్నీటితో) ఊఁటడిల్లెఁ దూఁటడిల్లుఁడు.

మా:- (తేజి) కుమారులారా! రాముడు బ్రతికియుండఁగనే సీత యెప్పు డపహరించుకొని రాఁబడినదో అప్పుడే యిట్లగునని దివ్యదృష్టి నెఱింగియుంటిని. ఇఁక నూఱడిల కేమున్నది ?

సా:- ఛీ! యెంతకష్టము దాపురించెను! కుంభకర్ణుని యొడలు పడునను వారల కూడ రావణప్రభునాజ్ఞయా ?

మా:- వత్సా! సారణా! ఇటువంటిచో రావణునాజ్ఞయేమిటోయి! హాస్యపరులగునేకవులో రావణు నిష్ఠుత్తిపాడిచియుందురు

సా:- ఏమియీనీచత !

గీ॥ వీర్యముండిన నుండనీ !, చర్యయొకటి
గాదె లోకాన దానిపరీక్షఁ దెలుపు,
నింక మామేఘనాదు జయింప కపుడె
ఛీ ! పరిహాసవిభీషిక నేపసిద్ధి ?॥ 21

(నేపథ్యమున:- ఓహో ! సేనానాయకులారా ! లంకాపట్టణప్రాకార తోరణములం దెగ్రింపివేయుఁడు !)

శా॥ ఏదుష్టగ్రహ మడ్డుగా దొడరఁగా నిన్నాళ్ళు నిందాగ్రయుధ
ప్రాదుర్భూతిని దేవనాయకసువర్షం బాగుట ల్కాల్గెనో !

మా:- (భయమున) అయ్యో! ఇపుడింకేమివినవలసివచ్చునో! (చెవుల మూసికొనును)

మఱల నేపథ్యమున :-

ఆదర్పాంధుఁడు మేఘనాదుఁడు హతుండయ్యె న్నరాపూర్ణమా
నేదోయిష్టిని వీరయజ్వయగు నాయీలక్ష్మణస్వామిచేన్ 22

మా:- నిండుగమునిఁగినఁ జలి లేదన్నట్లు దుఃఖాతిశయము దుఃఖమే కాదనుట నిశ్చయమే దుంప తెగునంతటి యిట్టిమాఘాతమునఁగూడ నాయూపిరి యాఁగుటలేదే !

శు:- (పైనిఁజూచుచు) గగనచరుల విమానశ్రేణులచే దిశాగ్రభాగము లన్నియు నాక్రమింపఁబడుచున్నయవి. అణఁపరాని దారుణక్రోధానలముచే నిగిరిపోయిన దుఃఖసముద్రము గల రాక్షసేంద్రుఁడు దాశరథి జయముకొఱకు సన్నాహపడుచున్నవాఁ డనుకొందును.

మా:- (లేచి) అటులయినచో ముసలితననును దువ్వలో మునిఁగిన నాయొడలును సయితముగడిగికొన వస్త్రధారాతీర్థము దొరికినట్లే పద! (ఎల్లరు నిష్క్రమింతురు)

ఇది శుద్ధవిష్కంభము

(రంగము-రణరంగముపైని యాకసమునఁ బ్రవేశము- విమానములలో నిరువురు విద్యాధరులు హేమాంగద రత్నచూడులు)

ర:- ఆహా! ఎంతకాలమునకు మఱల నిరాతంకముగా నాకసమున సంచరింపఁగలుగుట సంభవించె!

ఉ॥ వాసవనందనోరుసుమ భాసితతోరణ! రావణాంకవి
ద్యాసఖి! లంక! దానఁ గను! మంతట రథ్యలఁ బోరుజూచును
ల్లాసము మీఱు వీరసతుల న్గలకేళిరథాల నిండు! నా
రా! సరినిండతో దివియు రాజిలు దేవవిమానపంక్తులన్॥ 23

(వగచుచునబ్బురపడుచు) సఖా! హేమాంగదా!

ఉ॥ ఏనదినీటఁగాక దివిజేశసహస్రదృగస్రవారి నే
పూని నవాభిరామగతి నున్నపలాదపురోపకానన
శ్రీ నటుచూడు! వైరిబలశేముషిపైని వితండవాదనా
స్థానముగాఁగఁ గ్లప్తసురసైన్యజయంబట నాడు డింభకుల్॥ 24

హే:- మిత్రమా! రత్నచూడా! ఏమంటివి?

మ॥ దనుజేంద్రుల్మనులేరె ముజ్జగముల న్దర్పాన నిత్యావద
న్మనుఁగన్జేసిరె బాహువిక్రమకళాస్ఫూర్తి న్మహావీరత
న్ఘనుఁడో రావణురీతిఁ? దజ్జయమయగ్రంథాక్షరప్రాయతా
తనవేళన్నల నింద్రుఁడే నిలువఁడే ద్వారాన స్తంభాకృతిన్॥ 25

ర:- చెలికాడా! చూడుము! చూడుము! పౌలస్త్యపట్టణవీధులలో యుద్ధసన్నాహమునకై మ్రోగించురణదుందుభిధ్వనుల!

సీ॥ దిగ్దంతిదంతమౌక్తికమయద్వారస్తంభ
తోరణాళి సరాలఁ దొడగువారు,
మనసురాధిపునకే న్దనరెలే నిగళంబు
లని చెఱ న్బడు సుఖ మాఁగువారు,

పటువీరలక్ష్మీసంబంధంబుఁ బొంసు కే
లీసుహృద్గణిగ హాళిఁ గొనువారు,
మండోదరీబంధుమహిమ గర్వితదైత్య
వనితల గుణగౌరవములవారుఁ,
గీ॥ గలుగు రాక్షసవరగృహాంగణములందు
భయదదుందుభిశతకృతోద్భటనినాద
మన్నిరథ్యలనుండి పెల్లగుచు రేఁగ
నెంతవింతసంక్షోభ మందెగసె నరరె!! 26

హే:- (నవ్వి) నిజమేనోయ్! ఇప్పుడిచటనో!

మ॥ దనుజారణ్యముఁ గాల్ప రాముఁడె స్వయందావానలుండంచు వి
న్నను, ప్రేమాతిశయాన సీత నెపుడుం గాంక్షించు నాత్మేశుఁ గ
న్నను. మండోదరిముగ్ధయై గెలుపె యౌనా! నాశమేయౌన! యం
చు నెద వ్వ్రీడతొట్రుచేతఁ గను మచ్చో నార్తి నెట్లున్నదో!

ర:- (జాలిఁగూడిన చిఱునగవున) దేవతాసార్వభౌమునిపై గెలుపుం గొనిన మగటిమిచే విలుచఁబడిన చిత్తము గలవృద్ధప్రపితామహుఁ డగువరమేష్టిచే నామావశిష్టుఁ డైన యింద్రజిత్తువంతటివానిని కొడుకుంగాఁ బడసియు, దుఃఖభారహతిచేఁ జేష్టలుఁదక్కియున్న దియ్యమ! విరోధియే యనుకొనుము. అయినను నీయిట్టిపరిహాసము మిక్కిలి యనర్హముసుమా! (ముందుఁజూచుచు) మనకు దక్షిణముగ ననతిదూరమున నున్నయీజనసమూహ మేలరెండు పాయలుగ విడఁబడుచున్నదో? (పరీక్షించి, భయకౌతుకములతో) మిత్రమా! చూడుమటుచూడుము!

సీ॥ నడచుచో నడుగడ్గునకు భారభీతిచే
మ్రోఁత నించించుక భూమికుంగ॥
జంద్రహాసము దూయుసంరంభమున నొక్క-
సారి యుర్వదికరా ల్బంక్రమించి
విరవకాశంబుగా నిగిడ దిక్చక్రవా
ళాంతరంబులనెల్ల నాక్రమింపఁ

గోత్రధము నూత్రరత స్థగియు నిర్వాదికన్ను
లరుణోత్పలసరంబు నాకసంపుఁ
గీ॥ దోరణంబున నిడినట్లు తోఁపఁ జేయు
జేవురించినపదిమొగా ల్చేనమించఁ
బగఱ మార్కొను బెడిదంపువడియు హెచ్చ
భయదగతి రావణుం డదే బయలు దేఱె॥

హే:- (నిదానించిచూచి) సఖుఁడా! ఇదివరకు చూడఁబడినవాఁడే యైనను నవనవస్ఫూర్తిచే నతిభయంకరుఁడుగ నున్నాఁడుసుమా!

చ॥ మఱచితె! వజ్రిమొక్కతుత్రిటి మాత్రమెగా మిసిమింతుఁ జేసె ను
ప్పరము నుదగ్రనైజబలభాక్కగ మ్రింగెడిపీనిఱొమ్ముపై
నొఱసి, సురేంద్రలక్ష్మిని భుజోగ్రవనంబున సంచరించు భీ
కరకరిణి న్బొనర్పెఁడె! సఖా! యిపుడెట్లయినాఁడొ! చూచితే!॥

ర:- మిత్రమా! చెప్పుటకు సాధ్యమా! మహిమాధిక్యాలం దెల్ల నీరావణుఁడు మొనగాడుగదా!

మ॥ అనయం బిందుఁడె కొల్వఁడే? అసుకర వ్యాజంబు లౌశల్పప్ర
క్షనికాయాభరణాళి నిత్య మిడుచున్; స్కందోపనేయోరుస
న్మణుల న్మెట్టికొసంగుచు న్జలధి దీనత్వంబుతో వట్టిపో
యినరత్నౌఘ దండభీతి నెమకండే మించుపొల్లాసలన్॥ 30

హే:- ఔరౌరా! ఈమహావీరుఁడు మాఱులేనిపోరుసంబరాన వనాయుజానేయంబులు దండధరుతత్తడి యగుమహిషంబునకుంజీదరంగొల్పు దీర్ఘహేషలతో రథము న్గడువడి లాఁగుకొని పర్వెత్తుచుండ ధనుష్పాణియై యేతెంచెఁ జూచితే!

ర:- (భయవిస్మయములతో)

మ॥ ప్రళయార్కున్వలె మండనాస్యములు, ద్వంద్వం బిస్సి మర్త్యాళిన
గ్గలమౌ నాకని యుబ్బుబాహుతతుల న్గర్వాన గన్గొంచు ది
వ్యులశౌర్యానకు మచ్చుకల్ల గుదశాస్యుం డాజిరంగంబు వై
రుల నాత్మీయుల సంకులాస్త్రసమురకూత్రంబుగాఁ జేసెడిన్॥ 31

హే:- (కౌతుకముతో) రత్నచూడా! అటు దక్షిణముగా జూడుము!

ఉ॥ ఆన నగస్త్ర్యండీ స్పెటుగ నాఁగుట గొగ్గతి యైనవింధ్య నె
త్తాని శిఖాళి సేతుపథంబునకు స్తగ నంట నొంచుచో
వానిని వైచుకోఁతిగమి, వచ్చుదశాననుఁ జూచుకౌతుకం
బూని ద్రుతానఁ దగ్గతి, సముద్ధతభీతిఁ బలాయనించెడిన్. 32

ర:- (చూచి, హర్షముతో) అదియేమంత విస్ఫార మిటుకనుము!

శా॥ రక్షస్సైన్యముపైఁ జందనతరుగ్రామంబుల న్వానరు
ల్గక్షు న్దందడినేయఁ దద్గతమహాగ్రవ్యాళరాజంబు లా
పక్షంబం దురగాస్త్రభూతభుజగప్రాయంబులై కిన్కతో
దీక్ష న్దానవదేహయష్టులను బంధించు న్మహాతూర్ణకృతిన్॥ 33

హే.- ఇచట నింకొక వింత!

చ॥ వలచితి ని న్నటంచు బలవంత మొనర్చ నరాదుపూన్కికి
న్దొలఁగి సుమప్రపూర మగుదోయిలిఁ జిమ్మదు వానిపై నిలిం
పలలన, యారె! వానరులు వైచినవృక్షహతి న్గతించుదై
త్యులపయిఁ దత్సుమప్రతతు లుంచుచుఁ గౌఁగిలి గారవించెడిన్. 34

ర:- (తడవు పరికించి)

చ॥ తమతనుదీప్తిచేఁ బవలు తద్దయు దీర్ఘ మొనర్చువానరో
త్తములను నీలరాక్షసవితాన మకాండతమస్వినీసమా
క్రమణ మన స్బడ ద్రబలకప్యనలోపరి నైత్యధూమచం
క్రమణవిజృంభణం బనఁగ రాజుచునున్నది చూడు మద్దెసన్! 35

హే:- (నగుచు) మిత్రమా!

శా॥ చెల్లే శస్త్రములయ్యు నీకపికుల శ్రేష్ఠు ల్పోరిం గూర్చి ని
క్కట్ల న్దెల్ప నశక్య. మట్లుకను! మా కాశాంతరా లన్నపె
న్జట్ల న్గర్షితదైత్యు లుద్విఁబడఁ నిండంజేయఁగా లేక న
ల్త్రట్ల స్బర్వీడునా దశాననుని మాద్యత్కిరిసందోహముల్॥ 36

ర:- (సంభ్రమముతో) అయ్యయో! అట నెంతదారుణస్థితి దావ
రించినది!

ఉ॥ కోతిపదాతులే విసరుకొండల దైత్యులు పిండిఁజేయ సం
పాతిలుదుప్వ నుల్కలక్రమంపు దశాస్యగుపాట్టహాసవి

గ్రోధము నూ్రరత స్ఫురియు నిర్వాదికన్ను
లరుణోత్పలసరంబు నాకసంపుఁ
గీ॥ దోరణంబున నిడినట్లు తోఁపఁ జేయ
జేవురించినపదిమొగా ల్పేవమించఁ
బగలు మార్కొను బెడిదంపువడియు హెచ్చ
భయదగతి రావణుం డదే బయలు దేఱె॥

హే:- (నిదానించిచూచి) సఖుఁడా! ఇదివరకు చూడఁబడినవాఁడే యైనను నవనవస్ఫూర్తిచే నతిభయంకరుఁడుగ నున్నాఁడుసుమా!

చ॥ మఱచితె! వజ్రిమొక్కతుృటి మాత్రిమెగా మిసిమింతుఁ జేసె ను
ప్పరము నుదగ్రసై జబలభాక్కగ మ్రింగెడివీని ఱొమ్ముపై
నొఱసి, సురేంద్రలక్ష్మిని భుజోగ్రవనంబున సంచరించు భీ
కరకరిణి న్వ్యావర్పఁడె! సఖా! యిప్పుడెట్లయినాఁడో! చూచితే!॥

ర:- మిత్రమా! చెప్పుటకు సాధ్యమా! మహిమాఖ్యులం దెల్ల నీరావణుఁడు మొనగాఁడుగదా!

మ॥ అనయం బిందుృఁడె కొల్వఁడే? అసుకర వ్యాజంబు లౌకల్పవృ
క్షునికాయాభరణాళి నిత్య మిడుచున్; స్కందోప నేయారుస
న్మణుల న్మాటికొసంగుచు న్జలధి దీనత్వంబుతో వట్టిపో
యినరత్నౌఘ దండభీతి నెమకండే మించుపొల్లాసలన్॥ 30

హే:- ఔరౌరా! ఈమహావీరుఁడు మాఱులేనిపోరుసంబరాన వనాయుజానేయంబులు దండధరుత త్తడి యగుమహిషంబునకుంజీదరంగొల్పు దీర్ఘహేషలతో రథము నడువడి లాఁగుకొని పర్వెత్తుచుండ ధనుష్పాణియై యేతెంచెఁ జూచితే!

ర:- (భయవిస్మయములతో)

మ॥ పృళయార్కన్వాలె మండనాస్యములు, ద్వంద్వం బిస్సి మర్త్యాళిన
గ్గలమా నాకని యుబ్బుబాహుతతుల న్గర్వాన గర్జించు ది
వ్యులశౌర్యానకు మచ్చుకల్లగుదశాస్యుం డాజిరంగంబు వై
రుల నాత్మీయుల సంకులాస్త్రసమరకూ్రరంబుగాఁ జేసెడిన్॥ 31

హే:- (కౌతుకముతో) రత్నచూడా! అటు దక్షిణముగా జూడుము!

ఉ॥ ఆన నగస్స్యూఁడే స్నేటుగ నాఁగుట గొగ్గిటి యైనవింధ్యని
త్తాని శిఖాళి సేతుసుపథంబునకు న్దగవంట నొండుచో
వానిని వైచుకోత్రిఁతిగమి, వచ్చుదశాననుఁ జూచుకౌతుకం
బూని ద్రుతాన డగ్గఱి, సముద్గతభీతిఁ బలాయనించెడిన్. 32

ర:- (చూచి, హర్షముతో) అదియేమంత విడ్డూర మిటుకనుము!

శా॥ రక్షస్సైన్యముపైనిఁ జందనతరుగ్రామంబుల న్వానరు
ల్లక్షు న్దండడినేయఁ దద్గతమహాగ్రివ్యాళరాజంబు లా
పక్షంబం దురగాస్త్రభూతభుజగప్రాయంబులై కిన్కతో
దీక్ష న్దానవదేహయష్టులను బంధించు న్మహోత్పాతకృతిన్॥ 33

హే.- ఇచట నింకొక వింత!

చ॥ వలచితి నిన్నటంచు బలవంత మొనర్చు నరాదుపూన్కికి
న్దొలఁగి సుమద్రవపూర మగుదోయిలిఁ జిమ్మదు వానిపై నిలిం
పలలన, యారా! వానరులు వైచినవృక్షహతి న్గతించుదై
త్యులపయిఁ దత్సుమప్రితతు లుంచుచుఁ గౌఁగిలి గౌరవించెడిన్. 34

ర:- (తడవు పరికించి)

చ॥ తమతనుదీప్తిచేఁ బవలు తద్దయు దీర్ఘమొనర్చువానరో
త్తములను నీలరాక్షసవితాన మకాండతమస్వినీసమా
క్రమణ మన స్బడ బ్రబలకప్యనలోపరి నైత్యధూమచం
క్రమణవిజృంభణం బనఁగ రాజుచునున్నది చూడు మద్దెసన్! 35

హే.- (నగుచు) మిత్రమా!

శా॥ చెట్లే శస్త్రములయ్యె నీకపిఁల శ్రేష్ఠు ల్పోరిం గూర్చ ని
క్కట్ల న్దెల్ప నశక్య. మట్లుకను! మా కాశాంతరా లన్నపె
న్గట్ల న్గర్షితదైత్యు లుర్విఁబడఁ నిండంజేయఁగా లేక న
ల్త్రట్ల న్బర్విదునా దశాననుని మాద్యత్కీర్తిసందోహముల్॥ 36

ర:- (సంభ్రమముతో) అయ్యయో! అట నెంతదారుణస్థితి దాప
రించినది!

ఉ॥ క్రోతిపదాతులే విసరుకొండల దైత్యులు పిండిఁజేయ సం
పాతిలుదువ్వ నుల్కలక్రమంపు దశాస్యరుపాట్లహాసవి

ద్యోతిత వహ్నిలో మెఱుపుతోఁ బ్రవ నిగుచ్ఛశరాళి రావణా
ఖ్యాతపయోద మంథతమ మంతట నించుచు దాఁచె నింగికిన్. 37

హే:- (క్షణము నిదానించి, చూచి) ఓహో! క్షుద్రులనేకులు కలిసినచో నెంతటిఘటకునైన నంతలన్వాల్పబచ్చు టొకవింతకాదు. ఎందుల కనిన వినుము.

ఉ॥ దర్పపుదిక్కరేణుఁగు మదంపుఁబ్రవృష్టి కవగ్రహంబులై
యేర్పడు కన్నుతాఁరకల నిట్టటుత్రిప్పుచు దిగ్విదిక్కులం గ
న్నార్పక, అట్టునాచుచు దశాస్యుఁడు కన్గొన, సేతుసృష్టికి
న్గూర్పని కొండలూని ప్లవగుల్వడి దాఁటెద రుత్తరాశకున్ ॥ 38

ర:- (విషాదమున) అమ్మో! కఠినతరమైనయాపదయే వాటిల్లునట్టులున్నది! దయారహితము లగుకృపాణములచేఁ బగతురరొమ్ములు పగిలి నెత్తురులు ప్రవహించునపుడెల్ల సంతోషాతిశయంబున బులకించుచుండుకపోలపాళితోఁ దమదెబ్బలచే నెడతెగకపడిపోవువిరోధిసైనికుల నెత్తురుటేర్లచే నపారముగఁ బెరుగు వీరపానగోష్ఠిమహోత్సవమున నెల్లెడం దామయై యీరక్కసులెట్లు ప్లవంగసేనాధిపతుల మీఁదికిం దుముకుచున్నారో!

హే:- (ఆనందమున) మిత్రమా! దుఃఖమింకేటికోయి! ఇదిగో!

గీ॥ అల్ల దశకంఠు శరపీడ కాఁగలేక
తోఁకలాడించుచు న్బారిపోక నెన్ని
కపుల నోదార్చి ధైర్యంబుఁ గఱపి వైరి
నెదురుచున్నాఁడులే! వానరేశ్వరుండు ॥ 39

క:- (చూచి, హాసఖేదాద్భుతముగ)

ఉ॥ ఏసెను గొప్పచెట్టుఁ బ్లవగేశ్వరుఁ డస్త్రముగా, దశాస్యవ
క్షోజసమపీఠిఁ దాఁకె నది, యాపెనుజాపిడి చిప్పనం దడే
మాసె; నయారె! పెద్దగిరి మంతున వానరనాథుఁ డేయ రా
కాసుల రేఁడు చేతఁబినుకన్ దననీటనె పిండమై చెడెన్ ॥ 40

హే:- (నవ్వి) సఖుఁడా! దశకంధరునంతవాని కిదియొక గొప్పపనియా?

శా॥ ఆకైలాసము నే యెట న్ధరణి కేయంబైన లేకుండఁ బె
న్వ్రేక న్వ్రేఁకఁడె మున్న రావణుఁడు! తద్విచ్ఛిత్తి నే కాదొకో

(శ్రీ)కంఠుండటఁ దాండవించుటకుఁ గా ల్చిందించి చిందించ కే
రేకెత్తు న్జలనంబు లన్యగిరులన్ రెట్టించు నుద్రేకతన్ ॥ 41
కొంచెము విచారించినచో
గీ॥ కపివరుఁడు శస్త్రముగ నేయుకడిఁది చెట్టు
పడియె బిసకాండమ్ముదుత రావణునురానఁ
దద్గతసుమాళి నాసుమధన్వి పెలుచ
మోదె సీతావియోగపశ్రిముగ్ధు నతని ॥ 42
ర:- (నవ్వి) సఖుఁడా ! రావణుంగురించి కొల వేమిచెప్పఁగలము ?
మహాసత్త్వసమేతుఁడుసుమా !
ఉ॥ వేల్చిన యాత్మశీర్షములు వేలి వెలిన్బడ దేలుమోముల
న్బొల్చిన దేవతాలిపిని మున్నె యెఱుంగఁడె రాముగాథ?, లోఁ
దాల్చెనె భీతి ? హెచ్చుతమి ధాతను గొల్చెనెకాని; వీరుల
న్గెల్చినయట్టి వీరవరు గిట్ట కెదుర్కొనువాఁ డెవం డిలన్ ? 43
మిత్రిమా ! అటు చూడుము ! చూడుము ! భయానక మైనయద్భుత
విషయము !
గీ॥ విశిఖతతిచేతఁ గొండలు పిండిగాఁగఁ
దోమరాదులచేఁ దరు ల్తునిఁగిపడగ
రజనిచరనాథునకు కపిరాజునకును
జేఁజఱచు సంకులమహాజి చెలఁగెఁ బొలిగ ॥ 44
ఇప్పు డిదిగో.
చ॥ కపిపతిపాదఘట్టనల ఘాతల నూపిరియాడమి న్గళం
బు పెలుచనుబ్బ హారమణిపుంజము త్రెస్సి పడ న్ఫణాళి ర
త్నపతనభీతిచే భుజగనాథుఁడు, కర్ణము లుండమి న్నిరా
ల్నిపుణతమైఁ గదించి ధరణి న్దల లన్నియువంగ మోసెడిన్ ॥ 45
హే:- (విషాదముతో) అరరే! బాహుయంత్రిముచే సుగ్రీవుం బీడించి
దశగ్రీవుం డేమోయనుచున్నాఁడు.
గీ॥ ఓరిశాఖామృగుఁడ ! నీనియుద్ధగతుల
మిగుల డస్సితికాఁబోలు వగవఁబోకు !

దొరకులే ! నాదుభుజవనాందోళమంటు
సులభముగ నీకుఁ దగు మేలుఁ గొలువుఫలము ॥ 46

ర:- (హర్షముతో) మిత్రమా! ఉపాయముల మెలకువ మేలిమిచే దనను దా వదిలించుకొని పగతుని యెత్తిపొడువులచే నులుకుఁగొను హృదయముతో వానరేంద్రుఁడు హృదయంగమమగు నుత్తరమునే యిచ్చువినుము !

ఉ॥ పట్టదశంబుఁ గోయఁబడి ప్రౌఢకరంబు లెసంగియున్దల
లొక్కట్టి తొకొక్కటే, కొసకుఁ గొట్టవుగా తుదిదాని !, నిప్పుడే
న్పట్టి పదింటి నాదుపదివాఁడినఖాంబుల నొక్కమాఱుగా
నెట్టనఁ దున్మెతు!, నేనునుఖినే యెవుడే, న్దడవంగ నేలరా ? ॥ 47

అదియునుంగాక, ఓరీ ! రాక్షస !

గీ॥ రావణవధాంత మహాప్రకరణమునందు
సూత్రధారుఁడు రాఘవసూనుఁ డైనఁ
బారిపార్శ్వకుఁడను నేనెతేం ! సఫల
బీజభావుకామృతభుజప్రీతి కిదిర !॥ 48

ఇటులు దానవునంతరంగం బుచ్చిపోనాడి యొక్క యెగురున నిర్గమించి రావణశిరంబు లదర బాడున రథధ్వజదండంబు నూఁతగొని దశవదనుం డెట్ట కేలకు న్దేఱుకొనుచున్నాఁడు

హే:-(అంతటంగలయంగనియానందమున) నెచ్చెలీ ఈచుట్టుఁజూడుము!

ఉ॥ కల్పసుమాళి రావణునికై ( జనఁ జిక్కినవాని మాలగా
నల్పి దశాస్యభీతి మును చాటుగ నిందుపిగ న్బిగించునా
వేల్పులమాల కార్లసురవీరు దొసంగుల కాదినూచిగాఁ
గొల్పు తలంటుచే భయముక్రుంగ విమానపథాళిఁ గేరెడిన్ ॥ 49

(విషాదముతో) తేఱుకొనినదశకంఠుని చేఁ గొట్టంబడి మూర్ఛిలినసుగ్రీవుని హనుమంతుఁడు నీలుఁడునోదార్పుమాటలతో వేఱొక చోటికిం గొంపోవుచున్నారు !

ర:- చెలికాఁడా ! యుద్ధమందునతొలితాఁకున మహావీరు లనేకపర్యాయము లోడుచుందురు, గెలుచుచుందురు, ఆమాత్రమునకుఁ జింత యేల ?

హేమ:-(ఇంకొక చోఁ బరికించి) నీయదృష్టము నీకుఁ బెంపునే చేకూర్చు
చున్నది. ఇపు డిట కెవరు వచ్చుచున్నా రనుకొందువు !

మ॥ ధృతిమైఁ గౌశికుఁ గొల్చి నేర్చుకొనియె న్దివ్యాస్త్రమంత్రంబుల,
న్బ్రతిమై భార్గవుతోడ డీకొనియెఁ బోర, న్వీరభోగీణబా
హుబలి న్భానుకులైక కేతు వగుచు న్యోధ స్తుతుం డైనవాఁ
డతికౌతూహలియౌచు విల్గొనినవాఁడై రామభద్రుండ దే ! ॥ 50

ర:- (సంతసమున రాముంజూచి రావణున్ద్దేశించి) అహో ! రాక్షస
రాజ

బాలుఁడుగాఁ ద్రిశూలివిలు భగ్న మొనర్చి, భుజోష్మఁ జెమ్మట
న్దోలి మనోహరార్జవము దూఱిచె భార్గవహాని, కిప్పు డి
య్యాలమునందుఁ దారసిలె నన్యము లెయ్యవిహాని నిన్న న
వాఁలిసమానుగాఁ గెడప వహ్వారె! యెం 51

హే.-(కౌతుకమున) నెచ్చెలీ ! కొంచెము నిశ్శబ్దముగ నుందుము !
రావణుఁ డేమనునో విందము.

ర:- (చెవియొగ్గి) ఏమియిది ? రావణుం డిట్లుపలుకుచున్నాఁడు ? "ఓరీ !
క్షత్రియబాలకా ! బాగు ! బాగు !

చ॥ హరగిరి నెత్తి దింపిన బలాఢ్యున కాముడివి ల్లదెంత ? శం
కరవరభక్తి సీతపయిన న్గలభ్రాంతియు వీడి మానితి
న్వియుచ; నికెంత కాలమె యుపేక్ష నినున్ క్షమఁ గావఁబోవు ది
క్కరిమదవారకాస్మదురుకాండశిఖ ! ల్కను నీపస న్ద్రిటిస్ ! 52

హే:- (విస్మయముతో) ఔరా ! త్రిజగంబుల నేని గడ్డిపఱకగఁ జూచు
వీనియహంభావాధిక్య మిప్పటికిఁ గూడ నశేయున్నదియే !

ర:-(విడ్డూరమున) చెలికాఁడా ! ఇంతమాత్రమునకే నీవు విస్మయము
నొందుచున్నాఁడవా ?

చ॥ ఒకతలమాత్రమే మిగిలియుండినవీనికి నర్ధనారిగా
నికటమునందు శంకరుఁడె నిల్చిన, వీనిమదంబుచావ, గా
రికడియ మున్న కా ల్విడిచి హ్రీఁగొన కుబ్బిన దక్షిణంపుఁగా
లొకటికె దండమీ న్బడఁడటోయి ! హరుండును వింతఁ జూడఁగన్ ॥

(పైకిఁజూచి వితర్కముతో) ఒలే! భగవానుఁ డగు వాసవుని తేరు వలె నున్నది! దాశరథిం దఱియుచున్నది!

హే:-(చూచి, సంబరమున) నెచ్చెలీ! నిజముగా నదియే నోయీ యిది! చూడుము! ఇంద్రుఁ వేగన్నులకు సరిపడున ట్లమర్చఁబడిన రంధ్రము లే నెమిలిపురికన్నులుగ నగపడఁజేయు కవచముతో నతఁడే మాతలి! (కొంచె మభినర్ణనాదృష్టి గరపి)

శా॥ పైనఁ గ్రక్కలఁ దేరుచప్పరమున న్బద్ధంబు లౌ చాల్పర
త్నానేకంబుల యున్కి వేతరబడి న్వ్యాపించు బింబాళి నా
లోన న్దోఁచెడి నిందుచాపవిల్లుచిత మాలోచించి మేలూన్నాస్ఫర్తి నౌ
రా! నిండుంబసఁ జూపె వజ్రి కసిమర్యాదల్విజృంభింపఁగన్ । 54

(చెవియొగ్గి) రావణ ప్రతీహారికాఁబో లెద్దియో యనుచున్నవాఁడు? "ఓరీ! ఇంద్రసారథీ!

శా॥ ఆ దేవాసురసైన్యబాహునికరవ్యాప్తోరుకండూవిషం
బీద్దైత్యేంద్రభిషక్కు పెల్లడఁచునాఁడే నీపనిం బట్టమిన్
న్నీదర్పంబటరా! యిదెల్ల? దొసఁగు న్దేర్చుచున్నాఁడ, వ
బ్బో! దీనార్భకుఁ జేర్ప? ద్రోహి! గతులేమో యింకనీస్వామికిన్ ॥

ర:-(వినుటనభినయించి) రామభద్రుఁ డేమియనునో? (విని) వింటివా? "యథా రాజా తథా ప్రజాః" అనులోకోక్తి నిజమేసుమా! కాపునసే తమతేని మూలచ్ఛేదనముల నొనర్చుదుర్ణయములఁ బొగడు కొనుచు దుర్నీతు లగుచున్నారు.

హే:-రావణుఁ డేమిచెప్పునో దీనికి? (నింగికిమీనుంద్రిప్పి) "ఓరీ! అరణ్యముల నుండుతాపసబాలుఁడవు. నీ కేమి తెలుసునురా నయానయములు?

ఉ॥ ఓపనివాసికోప మధరోష్ఠము చే టనునట్లు నాపయి
జ్ఞేపినయింద్రుతామసమె చిందెను వేఁగనులూర్చునరుద్రలన్,
ఓపి త్రిలోకజేతలయియుండి నయాపనయాళి దక్షతన్
బ్రాపగునామదీయభుజపంజర ముండ నసాధ్య మున్నదే?॥ 56

ర:-(నగుచు చెవియొగ్గి) రామభద్రుప్రతివచన మదిగో! "ఓరీ! రాక్షసీపుత్రా!

మ॥ భుజశక్తి న్ననుముజ్జగంబుసిరి యెవ్వ న్నీకియా నంటయే
నిజమైన న్నిన్ను నేల గొట్టింతల లీవట్లు యాచించితో !
అజపౌత్రప్రభవుండవే ! సృజనఁజేయున్నెరవే ? యిప్పుడా
భుజసంఘంబె యొసంగునంటివి యగుంబో తెల్ల మావీర్యమున్ ॥ 57

హే —(వినునట్లుండి) రావణుఁ డేమనునో ! “ఓరీ ? రాచనిసుఁగా ! నీముత్తాత యగు ననరణ్యునకు మున్ను తెల్లము కానేయైనది. నీకిప్పుడు బహుళముగాఁ దెలియఁగలఁదు !॥

ర:-(వినినగుచు) ఎట్లుండునో రామభద్రు ప్రతివచనము! విను మదిగో!

ఉ॥ ఈవనరణ్యు నాజి వధియించితి వంటకుఁ జింత లేదు, యు
ద్ధావని గెల్పుఁజావు నగలం దవమానమె ? దానికేమి ? ము
న్నావున హైహయుండు నిగళంబుల నిన్ జెఱనుంప హీనభ
క్షావిధిగాఁ బులస్త్యుఁ డడుగన్ జనుట ల్వ్యథ బిట్టుకూర్చెడిన్॥ 58

హే.-(విని) రావణుప్రత్యుత్తర మెట్లో ! “ఏమిరా! క్షత్రియవటువా ? వాఁగుబోతా ! ఏమినీయపూర్వశిల్పము ? రాక్షసేంద్రుని చరిత్రచంద్రమండలముననే మలినముల నెక్కొదవా ! ఇంక నీవుండవు !” (సంభ్రమమునఁజూచి) అరరే ! మండోదరీభర్త అప్పుడే మొదలుపెట్టనేపెట్టినాఁడు శరసహస్రప్రయోగమున దినము న్దుర్దినంబు నొనర్చుట.

ర:— మిథిలాకుమారీభర్తయుఁ బ్రతిప్రయోగముల సాగించినాఁడులే (నవ్వి)

గీ॥ రామభద్రుండు పనుపుశరములవలన
నరకఁబడినట్టి రావణునారసముల
ములుకుఁలున్న ముందటిసగా ల్నేఁదుపడఁగ
బిఱ్ఱఁదియ్యాఁకెలసగము లావెనుక రాలు॥ 59

మఱియు

క॥ ఇరుసుపయి జెండాల
న్గాలుగడలపైని, సూతవరుపై మఱియు
స్తురగంబులపై విడువని
తఱమన రఘువంశవరు పతత్రము లాపున్ 60

హే:—(భయమున) అయ్యయ్యో!

ఆ॥ మిన్ను నెల్ల నాక్రమించి చీఁకటిఁగూర్చు
రావణీయపటుశరప్రవృష్టి
రాముఁ డెక్కియున్నరథరాజ మైంద్రమ్ము
పొడయె కానరాక మునిఁగిపోయె! 61

(చాలసేపుచూచివిస్మయమున) మిత్రమా!

గీ॥ బహువిధము లగుబాణప్రపంచములను
బహువిధవిశేష బాణప్రపంచగరిమ
వీరు ప్రతిహతిఁ గూర్చుచున్నారు పోర
హెచ్చుఁ గుం దొక్కయింత యెందేని లేక॥ 62

ర:-సఖా! సత్యమే! కాని,

క॥ ఇరువదిచేతుల రావ్రిం
చరుకృతి నిరుచేత రాముచంద్రుఁ డొనర్చున్
సరి యని సగటున దోఁచిన
నరవరుపనితనము దశగుణం బనవలదే!॥ 63

పే:—(నవ్వి) నెచ్చెలీ!

క॥ ఇరువదిచేతులతో నీ
యిరుచేతుల బాలు నరుని నెదిరెనయేనిన్
నరభోజనుఁ డగుదశకం
ధరుఁడు తొలగనట్టివాఁడె ద్వంద్వాజి మితిన్॥ 64

(దుఃఖభయముల)

గీ॥ కడిఁదిచేవలఁ డెక్కొవున్నడను వెలయు
లాంఛన మ్మగుమాయూరపింఛ మింద్ర
నరదమునుండి యర్ధచంద్రాంబకమునఁ
బటుమదోద్వేగ రావణుం డెటుల నతికె! 65

ర:-(సంతసమున) సఖుఁడా! కనుము! కనుము! రామభద్రురణకేళి!

మ॥ పడెనే కేతన మన్నలజ్జ రుషఁ బొంపంగా విజృంభించు రా
ముఁడె గెల్పొందుట నిక్కమంచు దిగిభంబు ల్పెన్మదాసారము

ల్లజేఁ గూర్ప నస్సరభించువాయువులు రెచ్చంగా, శచీబాష్పము
ల్మిడుఁగ, న్దైత్యులజ, న్దదీశుతలకాపు ల్రుబ్బంగ, నేసెన్నెలల్‌॥ 66

హే:—(ఖేదాద్భుతమున) కిరీటపతనావమానము నోర్వలేనిరాక్షసరా
జ్యేట్లు కుంభీపాతముగా శరవృష్టిం గురియుచున్నాఁడో !

క॥ అర రే ! తొలుతటిజన్మన్
బరిచితమై సీతబిగువుపాలిండ్లకు ని
బ్బరమైనసాక్షి కౌస్తుభ
మొఱసెడి రఘురాము నెదని యొకతూపు పడెన్‌॥ 67

(చక్కఁగఁజూచి ఖేదమున)

ఉ॥ ఎవ్వరినామమే జగతి నెల్లవ్రణంబులఁ దీర్పజాలునో
యవ్వసువంశ్యు రాముసుర, మద్దిర! నాటిన దొక్కబాణమే
జివ్వన వేయిగాయములఁ జిమ్మెడి రక్తము! లిందువ్రివర్మమం
దవ్వెడవేయితూటుల, దశాసను శస్త్రవిశేష మట్లనన్‌ ॥ 68

ర:—(సంబరమున) రాఘవుపనితన మేమీయుసదా ! కనుము !

చ॥ పరమపవిత్రి సీతకుచపత్రము మాయఁ గవుంగిలింపఁ ద
త్ప్రఆపదుపాపి రావణు నెద న్మను పిందవ్రిగజంబు దంతము
ల్బోఱఁబడ నాల్గుకాయలుగఁ జొప్పడుగుర్తుల మధ్యమందుఁ గ్రి
చ్చఱ రఘురాముబాణము పసందుగఁ దూఱెఁ గనుంగొనన్నదే!॥

హే:-(చెవియొగ్గివిస్మయమున) ఎడమపదిచేతులలో నొకదానితోడనే
తచ్ఛరముం బెఱికివైచి రావణుఁ డేమియో యనుచున్నాఁడు !
"ఓరీ ! మనుజపోతమా ! బాగు ! బాగు !

క॥ దానవజీవవవిద్యకుఁ
దానటర ! సమాప్తిలిపి సుదర్శన ? మదియే
యీనాపక్షమునఁ దునిఁగి
నానాజ్యోతిర్విభూషణం బయ్యెఁజుమీ ! 70

అట్టి నావక్షస్సీమంగూడ నెత్తురుఁ గాఱఁజేసిన నీచేతిచుఱుకు
సురాసురవీర్యముల మించినది.

ర-అహాహా ! విరోధివాక్యముల బయలఁగుచున్న గర్వాతిశయముచే
మిక్కిలి కోపమొ ...

క॥ ఘనచంద్రహాసమే చే
సినవ్రణముల కిణములన్ హసించెడి హారా
ళిని రావణగళముల రా
మునిమార్గణగణము లొక్క మొగిఁ బఱఁ గనె జే!॥ 71

హే -(చమత్కృతిగ) నెచ్చెలీ! చూడుము! సరిజోడైనవానితో యుద్ధము లభించెఁగదాయని రెట్టించిన మదోద్రేకమునఁ ద్రిభువనముల సంక్షోభింపఁజేయు దశగ్రీవుని చే సిరంతరాయముగఁ బ్రయోగింపబడు శరజాలంబుతే పంజరముగ వెలయ రామభద్రుఁ డందు పెంపుడుచిలుకవలె నైనాఁడు.

మ॥ భుజకేళి న్వడిదాఁటు రావణు పదప్రోద్ఘాతల న్గ్రుంగి తే
చు జగచ్చాలన మాళిరత్నములరోచు ల్మెర్పుచదంబులై
నిజ మానాగధరన్ క్షణంబె తనువు న్జైడ న్మలుంగన్గొనన్
బ్రజ లార్తింబడ రోజ చుండవలయు న్బాతాళ శేషేంద్రుఁడున్॥ 72

ర:-(భయముతో సరసి) నెయ్యుఁడా! అది యట్లేయనిపించుచున్నయది.

చ॥ అసురుని దాఁట్ల పెన్వడుల కబ్ధిజలం బెగయంగఁ దోఁచు పె
న్మొసళుల నీటిపొయేచుఁగులఁ బోరఁగ దిక్కరు లేగ భూభరం
బుసకల మొక్క శేషుపయి మ్రొగ్గిన గుజ్జగునంగయష్టిచే
ముసరువళు, ల్ఫణాళివస బోఁ బెనులావయి మోసెడి న్ధరన్॥ 73

(పైకిఁజూచి) విమానము లిటునటుం బర్వెత్తుచున్న వెందువలననో!

హే:-(చమత్కారసహితముగ) అహో! మహావీరుల ద్వంద్వయుద్ధము త్రిభువనభయంకరముగఁ దేలుచున్నయది!

గీ॥ అహహ! కౌశికదత్తదివ్యాస్త్రవిద్య
ధ్యాన మొనరించుచున్నాఁడు తరణికులుఁడు
దేవతారాతి బ్రహ్మోపదిష్టమైన
శస్త్రవిద్యను గోరెడి జ్ఞప్తిఁ గానఁగ॥ 74

కావున, మనమును దటిఁ జేరుకొందము! (అంతటంజూచి) మిత్రమా! సకలభువనసంక్షోభ మగునట్లున్నది. రామరావణుల సంకులసమర మెట్లు సందీక సాగుచున్నదియో కనుఁగొనుము.

చీఁకటియలుగు, సూర్యాస్త్రమునఁ జెడ, సూర్యాస్త్రము రాహవీయాంబకమున, నియ్యది నైష్ణ సాయకమునను, వైష్ణవంబు పౌష్పకేతమున, నియ్యది పాశుపతమున, ని ట్లాయాయాస్త్రంబులు నాయాయస్త్రములచేఁ బ్రతిహతంబు లగుచున్నయవి.

ర:- నేస్తుఁడా! ప్రయోగించుటలో నుపసంహరించుకొనుటలోఁగూడ హెచ్చులొచ్చులు గమనింపఁబడజాలకున్నయవి. రాముఁడో గెలవవలయు ననుపట్టుదలతోడనే ప్రయోగించుచున్నాఁడుగదా! అటు రావణుండో రాముం బిలుకుమార్పు తెగువతోడనే విసరుటగపడుచున్నదిగదా! కాని, యుభయాస్త్రాధిష్ఠాన దేవతలలో నీయుక్రోపములు కనిపించుట లేదే!

గీ॥ రావణశరాధిదైవము లాప్రముపైని
స్నేహభరమున మృదురీతిఁ జేరుచుండ
రామభద్రాస్త్రదేవత లాత్రితునేంద్రు
భీతిచే సల్లన స్సమీపించు నతసి!॥ 75

(తెరలో)

చ॥ ఒకతలఁ గోయ దానిప్రభ లున్నశిరంబులఁ జేరుచున్న వా
కొకచెయిఁ గోయఁ దద్రిధిమ మున్నకరంబులఁ జేరుచున్నదో
పిక రఘునందనుం డిటులు బిట్టు శిరాలుఁ గరాలుఁ ద్రుంచుచో
నిఁకఁ దెగకున్నవే మొదటియేపును మించి పరాక్రమించెడిన్ ॥ 76

ఇరువురు:—(సంతోషగోమాంచము లడరవిని) అహో! ఇట్టిశబ్దజ్ఞాన ప్రవర్తకముచే నెవరయా సకలలోకశ్రోత్రానందంబు సమకూర్చు పుణ్యాత్ములు? (తెరలో) కలకలము.

ఇరువురు:—(భయాద్భుతములతో) అమ్మయ్యో! ఏమి యీప్రచండ ధ్వని? మాయానారసింహుండైన నారాయణదేవు కఠినకంఠకాహల కోలాహలములతోఁ దుల్యమై యిట్టి యకాలముననే బ్రహ్మాండభాండమనే పటాపంచలుగఁ బగులునట్లు ఘోషమగుచున్నది!

ఉ॥ ఉగ్రహాలాహలానలము నొండొకమాఱు గ్రసించి యా తిద్ధన్
వ్యగ్రమహోగ్రవృత్తిఁ గొను భైరవమూర్తి యజాండభాండస

మ్మాగ్రిటనస్స్వరత్కహాకహార్బటియా ? యని బ్రహ్మత్రిచ్చవోఁ
బాగ్రిమునన్ గ్రిమక్రమవిపర్ధితరావము శేఁగ నెద్దియో !॥ 77

(తెరలో)

మ॥ అహిమార్త్యామరలోకభీకరణ దివ్యాస్త్రాళిఁ బోర్కొల్పి బా
ణాహతి న్దైస్సి వధంబుఁ జొచ్చుతల న్నవ్యార్కు తేకాదశ
స్వ్ర హాఁ జేర్ప న్నరయోగపీఠిక సమాకృష్టాజదివ్యాస్త్రస
న్నహ నైత్యాకుఁడు త్రోయ రావణకబంధం బాజిశయ్యస్వదెన్ ॥

ఇరువురు:-(సంతోషసంభ్రమములై చూచి విస్మయముతో)

ర:-సంగడీఁడా ! కనుము ! కనుము ! ప్రపంచమంతయు సంతరించు సమయమందలి భయంకరప్రళయాగ్నిహోత్రజ్వాలాకలాపమట్లు పింజరితము లగు రావణుతలలు !

హే:-(త్వరతో సమీపించి క్రిందికిఁజూచి జాలితోఁగూడినవిషాదాద్భుతములతో ) అక్కటా ! మహావీరుండ వగునో లంకేశ్వరా ! కడతేఱితివా !

శా॥ మత్తైరావణనాగకుంభతలము న్మర్దించుచోఁ జిందు మే
లుముత్తెంబు లోకని పెక్కులోకవిజయంబులాక్కవ్యము ల్పార్పవే ?
సత్తి న్మించుభుజాళి నాకనలినాస్యాగండకాశ్మీరప
త్రాత్త్రశ్రీల హరింపవే ! చనితె ! యంత్యంబందు మన్మన్నతిన్॥

(ఎన్నికతోఁజూచి) మిత్రమా ! రత్నచూడా !

మ॥ కడుఁ బర్వాదశకంఠు మొండె మటు మొగ్గన్ద్రాభారాన కే
నదుమ న్దొప్పగ నేలక్రింగఁగఁ గ్రిమాన న్జుక్కగ న్బెంతోపై
కొడయ న్గూడుమి ! యర్ధకుండలితదేహుం డౌచు శేషుండు వే
పడగ ల్నిక్కగఁజేసి తొంట్రిసఁగ భూభాండం బెటు లోర్చునో!

ర:- నెయ్యుఁడా ? ఈరావణుని శరీరమొక్కటే కాదోయి యిట్లతిశయమైనది వాని చేష్టలన్నియు నంతియ తెలియదా ?

మ॥ మును లోకా న్గెలువ న్బయలెడలు నిమ్మూర్ధన్య పాదాహతిన్
బెకుకొండ ల్చలియింప నమ్మెఱిలిరా ల్బిట్టాడొఱుం దాఁకిమ్రో
సిన సద్దీనుస్వమాళికత్నములతో, సిబ్బందిభీతిన్ బెనం
గినమేన్గంబముతో నహీంద్రుఁడు ధరన్ గ్లేశంబుతో మోయఁడే॥81

ఇప్పుడు; ప్రాణములుగూడఁ బోవుటచే మిగులబరువెక్కిన రావణుని బొందికట్టె నిజముగా మోయశక్యముకాని దే.

హే:- (ఇంకొకవైపు దృష్టిసారించి) అబ్బా! శోకవైక్లబ్యముతో. దశకంఠుకబంధము దెసకు వచ్చు మందోదరిని రాక్షసవనిత లెట్లవలికింగొంపోవుచున్నారో! (నింగికివీనిడి) ఎంతకష్ట మెంతకష్టము ! చపలులగు క్రోతిమూఁకలు క్రొంజెతనాన వెక్కిరింపఁ గరుణాకారుస్వరంబునఁ గాతరభావంబు గడలెక్క నేడ్చుచు నేమియోయనుచున్నది, యీమహావీరాగ్రణి యగురావణుని పట్టమహిషి యగువరవర్ణిని!

శా॥ ఓలంకేశ! సతీత్వభంగ మెదిలే కోనాథ! ఆప్యాయతన్
నీలావణ్యపుమోముల న్బదిటి నేనే ముద్దుల న్దేల్పఁ బె
న్బాళి న్నీకరవింశతి న్బొదువుచు "న్నాగాస్యకుంభస్థము
క్వాళు ల్నీ కొకపేట" నావె? నిదురా? ఆముద్దుఁ జెల్లింపవా!॥ 82

ర:- (దుఃఖమున) మిత్రమా! ఇది కనుటకు వినుటకైన దుర్భరమయ్యెడి, విరోధులయందైన నత్యంతదుఃఖముఁగూడ హృదయమర్మము లూఁటకవీలకుండునా! (వితర్కమున) అయ్యో! కాలునకుఁ జేయలేనిది యని యెక్కడేనిఁగలదా?

గీ॥ పూజ లిడఁదగు వేల్పుగుంపులను గలిసి
బందిఁ బడినమందారాల ప్రసవతతుల
నుబుకు మకరంద మల్ల మండోదరీప
దముల దువ్వాలతోడఁ గర్దమముగాదె!॥

అట్టిమందోదరికిం గూడ నిట్టిదశపట్టవలయునా?

(తెరలో)

మ॥ చనుచున్నా ర్వన దేవత ల్దివిజవృక్షా గ్రొంచు నానందనం
బునకు, న్వాహిణి వేల్పులాయమునకు న్బత్తెంచు నుచ్చైశ్రవం
బును, స్వస్త్రీ ఎల విభీషణానుచరు లాపూర్వామరు ల్బంది మా
న్పిన, వారం గనలేక వాసవుఁడు వాల్చె న్మోము లజ్జాభృతిన్ ॥

ర:- (ఆనందమున) నెచ్చెలీ! పదవోయీపద! లంకేశ్వరుని కారాగృహములలో, జాలకాలమునుంచి పడియున్నబందుగుల నందఱుం జూడగలము.

(ఇరువురుం బరిక్రమించి చూచి హర్షముతో-నొండొర్లతో)

సఖుఁడా! కనుము! కనుము! యుద్ధమునఁ దగిలిన దెబ్బలతోఁ దబ్బిబ్బు లగుచున్న వానరుల గొండముచ్చులఁ గోలాంగూలముల, నెలుఁగు బంట్ల నొక్కచోఁ జేర్చి తేర్చ సుగ్రీవునిఁ బంపి విల్లులక్ష్మణున కందిచ్చినవాఁడై విభీషణుని కైదండతో. విజయలక్ష్మి చేకూఱుటచే నెంతయేని నుబుకు రమణీయత వెలుగుచున్న రామభద్రుఁడడుగో!

శా॥ ఆపౌలస్త్యుని శక్తిఘాత నురమం దాగాయపున్గాయలన్
మోపౌలజ్జ శమింప, దేవవనితల్పుష్పాళి వర్షింప, లం
కాపట్టంబు విభీషణుండె కనునుత్కర్షన్ బులస్త్యుండునే
నే పొందన్, మనరామభద్రుఁ డదె లోకైకాభ రాజిల్లెడిన్॥

(అందఱు నిష్క్రమింతురు)

ఇ ది అ ర వ యం క ము



# శ్రీమదనర్ఘరాఘవము

## సప్తమాంకము

(తెరలో)

ఉ॥ శ్రీరఘువంశకర్త, నిశఁ జీకటిచేఁ గడుమూర్ఛ ముజ్జగా
ల్బ్రాకుకునొందఁ దెల్వినొసగూరుచువె, జ్జదయించి, దిక్పతు
ల్చేరఁ, బురస్థితి న్వెలయు, సీత పరాంగణావాసభాషణాం
గారము నిప్పగుండమునఁ గల్పి పవిత్రిత మీఱ వెల్వడెన్ 1

మఱియు,

మ॥ తన తేజోఽనలమం దొకొక్కఁడుగ దైత్యస్వాముల న్వేల్చి, గో
బ్బున నాపై దశకంఠుమస్తకతతి న్పూర్ణాహుతి న్సల్పి, నిం
డినస్వస్తి న్బరిపూర్తిఁగాంచి కడు బందిన్వీడి యేతెంచు సీ
తను గన్గో, వగ సిగ్గు రేఁగ, జడత న్దట్టాడెడి న్రాముఁడేన్ ॥ 2

క్రమముగా,

గీ॥ సరస సుగ్రీవుఁడును విభీషణుఁడు గొల్వ
గెలన సీతయు లక్ష్మణుం డెలమి వెలయఁ
బోవుఁ బుష్పకమునను రాముఁడు రవికుల
వృత్తిమేధ్య కయోధ్యకు వేడ్కనిగుడ॥ 3

(ప్రవేశము:-విమానారూఢులై సీతారామలక్ష్మణ సుగ్రీవవిభీషణులు)

సు:- (రామునితో) రామభద్రా!

చ॥ జలధి, దశాస్యకింకరత, జల్లుల నించు గృహోపకాననం
బుల, నదె!; లంక, క్రొంజిగురు మొత్తములన్ రఘురామ విక్రమం
బులఁ దమిఁ జాటు!, నొక్కతలపోవ శతాక్షుల లెక్క వేయిక
న్నుల శతమన్యుమోదము మనోహరమౌ దశకంఠు చావునన్॥ 4

రా:- దేవీ! విదేహతనయా! కనుంగొను మల్లసువేలాద్రిపడమటను,
లంకకుఁ దూర్పునంగూడ

ఉ॥ వానరదైత్యసంచయకబంధము లేగతి నిప్పుడైన లో
కానకు భీప్రదస్థితులఁ గన్పడునో! వెయి నెత్తురేరు లం

భోనిధి క్రొత్త భార్యలుగఁ బొల్లునఁ బాలునో! వేలవేలుపుం
జానలు నూత్నవీరవరసంగతిఁ గాంచునో! నీకతంబుగన్!

మఱియు.

ఉ॥ తోఁట్టుల మౌళిరత్నములె తోఁచఁగఁ బాపపడంతు లుండుచో
నట్టున గంధవృక్షములసంఘము లూర్చ్చిగ్రహించి వానరు
ల్పట్టుచుఁ మింటబర్వెనెడ, మూఁగిన రావణియిర్లుటమ్మునె
న్పట్టుచుఁ గ్రిమ్మువీఁకటుల వెల్గె మిణుంగురులట్లు లమ్ములుల్ ॥ 6

సీ:- ఈసీతకై యిచట నే కాఁబోలు మీకు భుజగపాశబంధనము కలిగినది.

రా:- అవును మిథిలాకుమారీ! అవును

గీ॥ నాగతతి నెల్ల నమిలి యానల్లఁదాఁవి
కటకటన మౌళిరత్నసంఘముల నమిసి
భుజగబంధవిమోచనంబును గావచ్చె
మాకు నపు డొక్క త్రుటి గరుత్మంతుఁ డిచట 7

(వితర్కించి:- ఎలనగవున) ఈపాముజాతిస్థితి లోకసామాన్యమున కెంత విరుద్ధముగ నున్నది?

చ॥ అవయన మొక్కటేవ విన నారయఁ? దిండికి రెండు నాల్కలా?
కవియు నురంబ? కాళ్లెచటఁ గన్పడకుంటయు? ఉన్న యెన్నొవా
యువుల జగత్తుప్రాణము నె యుగ్రతఁ గొంటయు? తల్లి సాధుక
ద్రువ! కనునీడు కాన్పు లిఁకఁ దోఁచుట యేనియు నీదృశంబె కా! 8

(ఎల్లరు నవ్వుదురు)

సీ:- (స్నేహాస్మితముగ లక్ష్మణుంజూచి రామునితో) నాథా! లక్ష్మణుని విలక్షణకీర్తికిఁ స్థానభూత మైన క్షేత్ర మెటనున్నదో?

రా:- (ఆనందరోమాంచమున) దేవి! మైథిలీ! నాకుడిచేతికి నూటిగ నున్న సువేలాద్రిప్రాంతభూమిం గనుము! ఇటుమిన సేనలకునటుదను జవాహీనులకు నేకై కవీరు లనంబోల్చు లక్ష్మణమేఘనాదుల కచటనే ద్వంద్వయుద్ధము జరిగెను.

సీ:- ఆర్యపుత్త్రా! మగనిపైఁగల ప్రేమాతిశయముచే గగుర్పాటుతో వెడలు చెమటజలముచే చితాగ్నికిఁ గ్రమముగ శమనము నుద్దీపన

ముం గలిగించుచు నెవరో నిశాచరవనిత లనుగమనవిధిం దీర్చు
కొనుచున్నవారు. అదిక్కడనేనా?

రా.- అవును. జానకి! అవును అదియే లక్ష్మణుని వీరలక్ష్మి వరించిన
వివాహమంటపము మఱియు, నచ్చటనే

గీ॥ మూర్ఛ మునిఁగినలక్ష్మణు ముంపుఁ దేర్పఁ
జాలు సంజీవిగిరి నిమిషమునఁ దెచ్చి
కించల వదల్చి జగము దక్కించుకొనియె
వింతమూర్ధన్యుఁ డగుహనూమంతుఁ డపుడు॥ 9

సీ:- (స్మృతి నభినయించి అనురాగమున) నాథా! కిష్కింధాపతిస్కంధా
వారమున నేకవీరుఁ డనంబొల్చునాంజనేయుఁ డెక్కడ నగుపడఁ
డేల?

రా:- దేవీ!

చ॥ దశవదనుండు కూలినపదంపడి భాస్కరబింబవర్తి యా
దశరథరాజు, నాదుపిత, తానె దయన్గనిపించి యానతీ
య, శుభతరాభిషేకసమయార్హవిధు ల్సమకూర్ప నేగనీ
నిశ రఘునాథకీర్తిపరిణీత కయోధ్య కసాధ్యవేగియై॥

(విమానవేగము ను నటించి) ప్రియా! ఈమహాంబురాశి కంజలింబట్టుము

చ॥ హరియురమందు సుస్థిరతనందియు వీరభుజాంతరమ్ముల
న్మఱగెడిలక్ష్మియీవనధిమధ్యమునందు జనించినట్టిదే!
హరు శిరమందు మేలిమణియయ్యను లోకములంకరించుచం
దురుఁడును వార్ధిమధ్యజనితుండెసుమీ! కను మబ్ధి మేలిమిన్! 11
(విమర్శతో)

మ॥ అయిన న్గాఁదగులే సుధాప్రకృతి యీయంభోధినీరంబు, విం
త యొకింతెనియులేదు దాన, సిరియు న్జాబిల్లియు, న్వేల్పుగి
డ్డియు. ధన్వంతరి, కౌస్తుభాదు లటఁ బుట్టెన్నాఁగఁ ద్రైలోక్యవి
స్మయమానాద్భుతగాథ కాదె! మహిమ న్సంద్రంబు సామాన్యమే॥
మఱియు నో దేవీ!

చ॥ తల మెడ మాత్రమే కనుచుఁ దక్కిన దేహము కానరామిచే
నలినభవుండు నిండుజతనంబునఁ దజ్జలజోపరిస్థితి

న్నిలిచి యనేకభుక్తతుల నిష్ఠురనిష్ఠ నుతించు నేరి నా
ఫలదుఁడు పద్మనాభభగవానుఁడు నిందె శయించు నెప్పుడున్॥ 13

సీ:— (నమస్కరించును)

ల:-ధర్మక్రియాచరణము చేత మహాత్ములు వడయునుత్తమసిద్ధి సర్వత్ర సమస్తాతిశాయి యనుట సత్యమేకదా!

చ॥ అడఁపఁగనీ జగంబుఁ బ్రళయంబున, మబ్బులఁ దాఁపనిమ్మ, పా
ర్లెడిబడబాస్యవహ్నిని ధరింపఁగనిమ్ము, సురాళి సోమనీ,
కడునిడుపైనవ్యాప్తింగనుఁగాక సముద్రి; మఱే నగస్త్యునా
త్తడి నొకగుక్కగా! మనకు ధన్యతపంబులె ముఖ్యవంద్యముల్॥

రా:-(సబహుమానముగ) తమ్ముఁడా! మేలాడితివి!

చ॥ సరసుఁ డనుద్ధతుం డుసుమి సాగరుఁ డందునఁ జేతిగుంటకే
సరిపడె, నట్టులుంపుమది, స్పర్థ వియత్తల మడ్డగించుచు
న్బిరిఁగెడివింధ్యమే ఘటజు వేడుకఁ దీర్ప నడంగెఁగాదె! త
త్పరమమహర్షిసత్తము ప్రభావము మించు ననన్యవేద్యమై॥ 15

మఱియు, నంతు నెఱుంగలేనిగాంభీర్యముల నెసంగియు మహనీయుల చరిత్రములత్యంతమధురములుసుమా!

ఉ॥ ఇంతటిగొప్పవారినిధియే ప్రళయంబగుచో క్షణాన భా
స్వంతుని వేకరాల్వొలిచి వారిఁ బీల్వఁగ నుప్పుకుప్పయౌ
నంతటఁగాలరుద్రు భయదాగ్నికిఁ బెట్టుచు నుప్పు చూర్ణమై
వింతయుగాంతవాయువులు వీవఁగ ధూళిగ లేచి మాయవా॥ 16

సీ -ఆర్యపుత్రా! కడలినడుమ విడంబించు నాలంక యనునోడకు నేరేడు దీవికిం గట్టుత్రాటివలె నక్కడ నదియేమి?

రా:- దేవీ! మేదినీనందిని! అయ్యది పడినరావణుని జగద్విజయస్తంభము! అదియునుంగాక కాకుత్స్థకుటుంబదుఃఖమునఁ బాలిభాగస్వామియగు భాస్కరపుత్త్రుని సుగ్రీవుని కీర్తిమయమగుమహాసేతువు!

సీ:-(ఆనందమున) ఆర్యపుత్త్రునిగనుంగొనవలయు ననునా శావృక్షమునఁ దుఁనిగినయంకురముల సుజ్జీవింపఁజేసిన మహౌషధమగు నిమ్మహాసేతువుం గని ధన్యనైతిని (చేమోడ్చి) మహాత్మా! వందనములు!

రా:- దేవీ! విశ్వంభరాసంభవీ!

శా॥ సింగి న్దవ్వయి చూచు దేవతరుణీనేత్రాళికే న్డాయిఁ జూ
డంగంజాలుఁ పయోధి మౌక్తికపుదండ న్బోలి యీసేతు వం
దుంగన్పట్టెడి నాయకోరుమణిదీపు ల్చిందుచు న్సర్వర
త్నాంగీనాద్రిశిఖానుబంధరచనాధౌరేయపారీణమై॥ 17

ఇది నిర్మింపఁబడుచుండఁగా

మ॥ ప్లవగేంద్రు ల్పెదపెద్దకొండల గుబేల్పాతంబుగా వేయ ను
ద్భవమౌ నుగ్రతరంగమాలికలచేత న్బిట్టుగాఁ దాడితం
బవుచు న్వానకుఁ బాఱ నేఱ్లసముదాయం, బార! తత్సర్వసం
భవమూలంబు సముద్రమౌ యనెడిసంభ్రాంతి న్బ్రకల్పించుచున్॥

(సుగ్రీవునితో) వానరరాజా!

ఉ॥ సేతువు గట్టుకౌతుకముచేఁ గపిముఖ్యులు వేయుపర్వత
వ్రాతముచేతఁ బొంగిపడి వార్ధి నదీగతి నట్లు మల్పి త
ర్వ్యాతిశయాననే గిరినిపాతజగర్తము గుంజ నష్టగ
ర్వ్యాతిశయంబున న్మఱలడా? పొనుపాటున? జ్ఞప్తినున్నదే!॥ 19

సు:- దేవా! మచ్చిత్తచిత్రఫలకమున భవచ్చిత్రతరచరిత్రము దెద్దియేని
వ్రాయఁబడనిది కలదా! అదియునుంగాక,

మ॥ నడవ న్గట్ట నగంబుల న్బఱపినంత న్వార్థి శూన్యంబుగా
నుడుమార్గానకు నువ్వనీ రెగయఁగా, నుడ్డాడుచుండ న్దిమ్మ
ల్గడుశీఘ్రంబున నిమ్నగ ల్తెఱపి నెల్ల న్నిండి, తియ్యందనం
బిడి, సంద్ర బొకనాఁడు స్వాదుజలమౌ టేర్పాట రూపించెఁగా॥ 20

వి:- దేవా! మనువంశమాణిక్యమా!

మ॥ పడుపాట న్గుహల న్జలంబు నుడియ న్బార్శ్వాన మైనాకుఁడు
న్బొడసూప న్గని బంధుదర్శనసముద్భూతాశ్రుధారాతతు
ల్జడిగట్ట న్గడునుబ్బు పెన్దొనలతో జ్వాలాళి కే నోషధు
ల్దొడి దండు న్బిబిరంబులై నెగడఁ బొల్చున్ సేతుశైలౌఘముల్॥

సీ:- (నవ్వుచు) నాథా! పార్వతీజనకుఁ డగుపర్వతరాజునకు యువరా
జగునీమైనాకుఁడు తానురెక్కలఁ దక్కించుకొనియు నీసముద్రాంత
రనివాసముచే స్థావరుఁడేయయ్యెన్గదా!

రా:-(నవ్వి) అవును జానకీ! నిజమే

గీ॥ తండ్రి హిమగిరి సంగతి న్దలఁపఁజోక
తనయుఁ గ్రౌంచుని రక్షించు పనికి నిలక
తనదు రెక్కల గాచుకో దాఁగె వనధి
దాఁగి యొఱఁగించుకొనిన దింతయును లేదు॥ 22

సీ:- (నవ్వి పుష్పకమున్జూచి) అహో! విమానరాజమా! ఆకసమున నెగురుకౌతుకముతో మానస ముబలాట పడుచున్నది అందుచేత నింకఁ బై కెగురవమ్మా!

రా:- (కౌతుకస్మితమున) వై దేహీ! కనుము కనుము!

గీ॥ ఏకొలంది విమానంబు పైఁకిజనెడి
నాకొలఁది దవ్వుదవ్వగునాశ, లినుని
కాకఁ బైకుప్పతి న్దేలుకంధరము లో
పుష్పకాహతి లో చెమ్మఁబొంగఁజేయు! 23 24

మఱియు,

చ॥ దడదడ మ్రోఁగుగర్జనల దండడితోడ భయంకరమ్ముగాఁ
గడఁగిన కారు మేఘములు కంటిపస న్ప్రారియించుచీఁకటి
న్గడికొనఁజేయు, మబ్బుపయి గుత్తగ వెన్నెలపోఁత నిండ, ని
య్యుడుతల మెన్ని చిత్రకళలూనెనో! తావుల వెల్వరించుచున్॥ 25

సు:- (క్రిందఁజూచి కౌతుకమున రామునితో) దేవా! ఇపుడు కడు నెడమయిన పుడమిం గనుఁడు!

చ॥ కడు నెడవాకొలంది మెరక ల్మఱి పల్లము లంతరింపఁగాఁ
బుడమి తదీయదీప్తులనె పొల్పొడిగా మణికుట్టిమంబుగా!
జడధి భుజంగవేష్టనవశంబునఁ దత్క్షణమై జగాల నె
క్కుడు విలువైన నీపసనె కూర్మ్యనురత్నము నొందినిక్కగా॥

సీ:- (ముందుకుఁజూపుచు) కల్పాంతసమయమునఁ బ్రజ్వరిల్లు ప్రళయాగ్నిశిఖలచే నుడుకుసముద్రమున లేచునుబుగుగుత్తులవలె నాకసమునందు వేలతరబడి స్ఫటికాచ్ఛశిఖరాల నొప్పు యీయెదుటి వర్వత మెద్దియోగదా?

వి:- దేవీ!

ఆ॥ మంచుకొండసుమ్మీ! మనముందరిది, దీన
మున్న శివుని చిచ్చుకన్నుమంటఁ
జనినమదనుఁ గొఱకు సంజీవనీపర
మౌషధముఁగ దుర్గ యవతరించె॥ 28

సీ:- (కౌతుకముతో) అయిన నిచట నేనా చంద్రకిరీటు నిటలనేత్రాగ్ని లమునకు భగవానుఁడగు మన్మథస్వామి యాహుతియైనది?

వి:- అవునుఁ జెల్లీ! అవును అయ్యసమశరుని దుర్మరణమున కయ్యుత్తరముగఁ గనఁబడు దేవదారు వనములవరుసయే సాక్ష్యము.

ఆ॥ మూడుకనులవేల్పు మువ్వంచనుకనుసీమ
రోస మొక్కఁబిగిని కాసె, నైనఁ
బైది దగదగనుచుఁ బ్రజ్వరిల్లినఁ గ్రింది
రెండుఁ బొగని సెఁపకుండె నహహా ॥ 29

రా:- చెప్పఁగలమా!
నీలలోహితు నొసటికంటిని జెలంగు
జెప్పఁగిప్పఁగరా కొక్కఁగొప్పనిప్పు
భువననాశమున కందుమూసిదాఁచు
దాని కింధనమయ్యె నాత్మభవుఁ డట్లు॥ 30

సీ:-(రామునితో) ఆర్యపుత్ర! అట్టిదయారహితుఁ డైనమహాదేవుఁడు దేవిపై నెట్లు మనసు ద్రిప్పుకొనఁగల్గెనో?

మ॥ స్మరుఁడే అట్లునశింపఁ దత్సహచరు ల్సంగీతలావణ్యనా
ట్యరసాదు ల్తన కేసహాయముఁను జేయన్లేమి గుర్తించి, భూ
ధరరాట్కన్య యనిష్టమూర్చి శుభమొందం జేయు దీవ్యత్తప
శ్చరణ న్బిట్టు తపించి యాశుమెయిలో సామెల్లఁ దానయ్యెఁజూ॥

వి:- (పరిహాసమున)

ఉ॥ నందియె, పుత్త్రలే ఫణులె నచ్చినభాగ్యముగా నెసంగు న
య్యిందుధరు న్దపోనియతి నెన్నియుగంబులొ కొల్చి పార్వతీ
సుందరి చూపె మేలిగడుసుందన మాతని మేనిలో సగం
బొందుఫలంబుగా ఫలదమొందునుగా జతకూర్చి యేకతన్ 32

సీ:-(నవ్వి) భగవతి యఁగునాసర్వమంగళ వైవాహికమిందెందు జరిగినది?

వి: అదిగో! ఆయుంగను గనుపడునదియే యోషధిప్రస్థ మనునది
అదియే నగరాజు నగరము.

గీ॥ ఓషధీమయుండై నహిమోర్విధరుండు
ధారవోయంగ శశిఖండధరుండు శివుండు
తనదు ముంజేతి భుజగకంకణము దాంచి
భీతి విడుపార్వతి న్వాయిం బెండ్లియాడె॥ 33

రా:- నిక్కమే దేవీ! నిక్కమే

ఆ॥ తండ్రి హిమమునకలిమిం దద్దయు హేమం
కళల మెంచుగాంగ వెలయంజేయు
శివునిచేతి మదము చెల్లినయహిభూష
భయము వీడి చేట్టవట్టె గౌరి॥ 34

సీ:- (నవ్వుచు) నాథా! మన్మథునంతవానినే యుచటమండించినాం
డీఘనుడని యాతని నమ్మలేక కాబోలు గౌరి తదర్ధశరీరమందే
తననుం జేర్చుకొననది.

రా:-(నవ్వి) అవునుజానకి! అదియొకవిచిత్రమే,

చ॥ హరుమెయి దక్షిణంపుసగ మాసతి డాపలిమేనుసగంబుతోం
బరంగుట నామెనెచ్చెలులు పంబినమేలపుంజూడ్కిం జూచుచు
న్నరిగిన తక్కుసామలను జోకగం గూర్పంగ నర్ధనారు లి
ద్దఱయి ముఖాముఖిన్వడిగం దాంటిరి పెండిలిపీటం జేరంగన్ 35

మఱియు,

మ॥ కుడివైపే తన కేలరా దనెడికోర్కుల్గౌరికి న్దీఱం బ్రే
ముడి సద్దంబునం దాగుమారుపసతో మూర్తి ప్రదర్శించి, యె
ప్పుడు సంశ్లేషమెసంగుట న్సమత సంభోగప్రలంభంబులో
ప్పిడ నన్యోన్యత మించు నాల్మగలకిక్లే మోడ్తు హస్తద్వయిన్॥

వి:- దేవీ!

మ॥ తనయిచ్ఛన్ స్తనమొక్కటై యుభయపథ్యంబై తల జ్జందురుం
డు నెసంగ న్భుజగుండు సవ్యభుజమందు న్వ్రేలంగా, నెనొ్నసం
టను మూడౌనయనాన సామునెఱమంట న్సామ దాక్షిణ్యపూ
ర్తిని చుంయ్యుంయనంబొల్చుదైవమఖిల శ్రేయాలి మాకీయుతన్॥

మఱియు,

ఉ॥ వామకుచంబుఁ బత్త్రిముసఁ బల్కిన చెమ్మట భస్మరేణుసం
కామితదక్షిణాంగుళి సుఖమ్ముగఁ దీర్చెడి నైవ మాఁడురూ
పా! మగరూప? పేడియననా? భళీ! యివియేవి కాక వే
ఱా మఱియేదొయా శివుసుభాంగము మాకొసఁగూర్చు సంపదల్॥

(మఱియొకవైపుఁజూపుచు)

మ॥ అదిగో మంథరపర్వతంబు! మును దైత్యధ్వంసి కేయూరవ
జ్రదళప్రోద్ధతి నైన పెన్వ్రలయుపిస్తారంబుల న్వింతయై
పొదలు, న్గూర్మము వీఁపురాపిడిని దసూర్మలంబున న్గొంతపో
వదయే నింతకు మించునున్నతిని నిల్వన్వచ్చునం చెంచెదన్॥ 39

రా:-(పరకాయించిచూచి, నగుచు)

శా॥ రెక్కల్తున్గిన మోరుకాయలు పోరి నేర్పఁగంగ మంథాద్రియె
ట్లోకెక్కె న్నైఁచెను నాగరాణ్మథనరజ్జూగ్రత్వ? మీదుష్టుఁడే
యుక్కెక్కఁడై జలధి న్గలంచి సిరి నెంతో పాపిఁ బుట్టించి పె
న్జిక్కు న్గొల్పె జగాన లేమిఁకలుము ల్చేకూర్చి, యేగొప్పయో!॥

సీ:—(ఆవేగముతో) ఇతఁడేగదా క్షీరపారావారమును మండమాత్రి
(మిగడయే) శేషముగా నొనర్చి చంద్రుం బుట్టించి విరహిణు
లగుస్త్రీలపై దుముకువానిగఁ జేసెను! (అందఱునవ్వుదురు)

వి:-(రామవాక్యముంబురస్కరించుకొని) ఆహాహా!

ఆ॥ వనధిలోన లక్ష్మిఁ బడవేయువలయునం
చెగయుచుండఁ బూన్కి యేమి ఫలము?
తోఁయఁ దోయఁ జందురుం డందె యుండక
మరలమరలఁ బైకిఁ బరుగు లిడెడు॥ 41

(విమర్శించి)

మ॥ కపటార్థంబుగఁ గైటభారిపృథువక్షఃపీఠ వౌతల్లి! మా
ఖ్యవరాంబా! కినుకొందవేని, సతి, నిన్నర్థింతుఁ దెల్పంగ, నీ
కెవ్వడి ల్లాజలజంబ? విద్యకొఱకా యీ వందులో నుంట? సం
ద్రపు టాచార్యకమొక్కొ! నీచపదవిన్యాసంబ నీనేర్పుటల్?॥ 42

ల:-(నగుచు)అయ్యయ్యో! అటు దేవతలలో నిటురక్కసులన్గూడ శ్రేష్ఠు లగువారి వీరరసోద్రేకమునకు సూచకము లగు వాద్యవిశేషముల నృత్తంబు లాడునట్టియు, సకలరాజసమూహములలో దుర్వృత్తి నుద్రేకింపఁజేయు ఖర్జూరసప్రబోధిని యైనట్టియు, సాహసికుల శస్త్రాంధకారముల మిణుంగురుల వెలుంగులఁ బ్రకాశించునట్టియు, మధుదమనుఁ డగువిష్ణువక్షస్థల మను మేఘమున మెఱపుదీవెగా స్ఫురించునట్టియు లక్ష్మీదేవినా యిట్లు పాలంభించుట!

గీ॥ దొడ్డపేరొందునట్టి కౌతూహలమున
మహిళలగుణు లగువారిసమాశ్రయించి
వీరు లగువారి కరవాలవీథి నెప్పుడుఁ
దనరుగా యసిధారావ్రతంబుఁ బూని॥ 43

సీ:-(అనూయతో) తమతమ దుర్దర్పములఁచే గలుగునాయాసముల నలుగులోక మిట్లే లక్ష్మిపై నపకీర్తిగీతముల నాలపించుచుండును, (ముందుఁజూపుచు) పగటియందే పోగుజేసిన వెన్నెలవలెఁ బ్రకాశించు నాపర్వతేంద్రుఁ డెవరు?

వి:-దేవీ!

మ॥ ఇదె కైలాసము! దీని యచ్చతెలుపు స్థిరప్రదేశాళియం
డ డనేకప్రభలఁబ్బ వృక్షములనీడ ల్మాసియు న్దోఁచు న
ల్లదె! యం దాప్రతిబింబరూపములఁ! బద్మానీకమో? విష్ణుమో
దప్పుఁదగ న్భాసిలు శైవమౌళిశశిసంభూతంబు లౌజ్యోత్స్నలన్!॥ 44

రా:-ఔరా! శతవిధము లుగఁ బరికించినను గనుల కింకనుం గౌతుక మునుం బెంచుచునే యున్నదే!

ఉ॥ అల్లదశాస్యు బాహుపుకులందలి రవ్వల పత్త్రిరాజిసం
ధిల్లిన యొత్తుగుర్తుల వె! తేటగ స్ఫాటికకూటపాళి వ
ర్తిల్లెడి వీనిలో భుజగదేవుపురంబు చరిత్రకుఁడఁ గో
కొల్లగఁ జూచుచుండు రదిగో! కను! యక్షులు పొల్లుమూఁకలై
మఱియు,

చ॥ మును పదికొఁగిళుల్పఱసి మోపుగ వింశతిబాహుఁ డొత్తుదో
మ్మిన కదియంగఁబడ్డ తన మేఖలచే స్ఫటికాద్రి కూర్చి నీ

శునకుఁ దటోర్మికాబహులుచు త్రైలిఁబర్వఁగ వారియంత్రసే
చనమున సంవిధానగురుసౌఖ్యపరంపర నిండు హాయిగన్ ॥ 46

వి:-(సీతతో) దేవి! ఇదికనుము!

చ॥ శివు తలపూవువెన్నెలలచే శశికాంతము లూర్చునూఁట వె
ల్లువలను మొలకెత్తి, కడులోలుపయై యమృతంపుఁజేతితో
శివ పెనుప గ్రహించినవి చెట్లిటఁ, దానను, భ్రాతృవత్సల
త్వవిధి గ్రహించి షణ్ముఖుని బాల్యవినోదములెల్ల సైఁచెఁగా! ॥ 47

మఱియు, నీధరాధరము నుపరితలమున నివసించు మృడానీ ప్రియుఁడు

మ॥ తనువెల్ల న్నయనంబులౌ మఘవుఁ డాస్థ న్భక్తి సాష్టాంగవం
దననిష్ఠ న్విరికల్వదండయయి యనంగాఁ గాళ్ళము నాల్వల నె
త్తినచాపల్యముచేఁ గుమారుఁ డొగి చేఁదీయ న్బటు ల్తానుఁ బ్రే
మనితాంతంబుగ నవ్వు శంకరుఁడు నంపద్భద్రము ల్మీకిడున్ ॥ 48

ఇంతియకాక.

మ॥ సరి నేదైవము తాండవభ్రమణ భూచక్రంబు తా దిర్దిర
న్దిరిగె, గ్రక్కుల రేఁబవళ్ళఁ గనకాద్రిశ్రేష్ఠము న్వేనవే
ల్తురమూచీఁకటివెల్గుమెర్పుతళుకుల్ వ్రాగించుచు న్గిట్టున
న్మరిగె న్దద్భువనాంతిమేష్టిపిభుఁ డెందు న్నిమ్ము రక్షించుతన్ ॥ 49

ల:—

గీ॥ సింహనఖమొకొక్కొ యిది యన్న చెడ్డభీతి
లేడి విడిచి చన న్మచ్చలేని మేల్మిఁ
బురహరునియాఁదల న్మౌళిభూషయగుచు
వెలయుఁ గనుపండువిదుచుజా బిల్లి రేక ॥

నీ:-(పరిహాసముగ) తలకాయలదండ, దందశూకములుఁ బుర్రెలుసొమ్ములుగా ధరించి వల్లకాళ్ల వసించు నీసామికిఁ దానుఁగూడ నొకభూషయగుట నిజముగా తనకుఁ గళంకమగునుగాని సాధువైన తేడియా మచ్చయగుట?

వి:-(నవ్వి) దేవీ! భగవానుఁ డగు శంకరుఁడుఁగూడ నలంకారాభిలాషతో నీజింకతాల్పుం ధరించె ననుకొనను, మఱియేమి యనిన.

గీ॥ తనను గొలుచు పిశాచసదస్సు స్వేచ్ఛ
నెల్లెడ నాత్రిగుల జ్జరియించుచీలు
సలుపనే యీనిశాచరుం దలధరించె
వల్లకాళ్ళనె తిరుగుక పాలధరుఁడు॥ 51

రా:-(సన్మానస్వరమున)

చ॥ జడముడి కాపుగా బిగినెసంగఁగఁ జుట్టుట నల్గి పాపమిం
డ డెపుడుఁ గాటుచుండ నొకట స్దనబింబము చిక్కఁ బూర్ణత
న్దోడఁగ నిక్కొకచో సెగకనుంబెనుచిచ్చునఁ గాపుసంపెటం
బడుచునెయుండుఁగా శశి క్షమనొబ్బరిఁ, దత్కళకున్నమస్కృతుల్॥
(పుష్పకముంజూచి) ఓవిమానరాజమా! నుమేరుశృంగముల
మైథిలి చూచును. కొంచెముపైఁకిజనుము!

వి:-(సీతతో) దేవీ! చూడుము చూడుము!

చ॥ నెలనెల నొక్కొకండుకళ నిర్జరు లాఁకొనిత్రావఁ జెంగి వి
చ్చలవిడి మచ్చలేడి పెలుచ న్గుశల న్మేనెల్ల మేయ, నీ
శిలవయిఁ బైలుల న్దిగువచెట్టు లథశ్చరతారకగ్రహా
దులప్రభ నీడలీన, నరుదున్మద మీకన కాద్రి కూర్చెడిన్॥ 53
మఱియు,

ఉ॥ బంగరునేల, నిక్కఫలవత్తరువు ల్నెకుచుండఁ గొండపై
యంగణమందుఁ, బాపటగ నాపెనుబాటఁ జరించునేకచ
క్రాంగుని మేటికాఁక గనకాశ్మము నెల్లఁ గరంగి రొంపిఁ గూ
ర్పం గఁనుగాల్దిగంబడ భరంబున లాగెడి సూర్యునశ్వముల్॥ 54

ల:-(సీతతో)

మ॥ వదినా!- చూడఁగదమ్మ! పర్వతనితంబంబందు దేవాగసం
పద! పక్కన్ నడిప్రొద్దు మంటలెగిపింపన్గూడ నీవై పుఁ జ
ల్లదసంపు న్నిడునీడలన్బఱపి మేల్గాయి న్పమామోదము
ల్పిదుల న్జుబ్బనచూఱగా శ్రమముపో విం తైనవిం దీనెడిన్ 55
(వ్రేలఁజూపుచు, హాస్యస్మితమున) అల్లదే! పుష్కలావర్తమేఘ
... నసే యైరావత మున్నదే!

చ॥ తనభుజశక్తి లీల ననిఁ దద్దయు నెత్తి దశాస్యసింహాగ
గ్రజముల రావణుం డరవ జంతుస నాఁ డటుగీక నెట్టినే!
కనుఁ డివు డెట్టిస్వేచ్ఛ నెట్టు(కొలునో! వాసవబంధు భామినీ
జనపరిభుక్తదివ్యసుమజాలసుదామసు రేంద్రసీమలన్॥ 56

సు:—నిజమే మాటల కందనట్టివే దశకంఠునియాటలు

చ॥ ఒకరొక రుం ద్రొక్కపస నుజ్జ్వలవీరులు, తక్కువేరినం
టకుఁగల? మైన రావణు నెడ న్భువి వీరధరిత్రియయ్యెఁబో
రి కడుగ వాలి యేమియొనరించెనో? ధాత యొసంగుకన్నువీ
నుకలిమి కాంచనే వినని నోరు మెదల్పఁగ నల్పసాధ్యమే?॥ 57

రా:—(సబహుమానముగ)

శా॥ చంక న్వ(జవుగావుపట్టన దశాస్యస్వామి బంధించి ని
శ్శంక న్వారిచె వాలి నాల్గుదధుల న్సావిత్రి. సామాన్యుఁడే?
బింకాన న్దశకంఠుఁడే నసదొకో? వీఁడీల్గుకంటె న్మహా
తంకుం డాతనిచావులొచ్చె? అదె కాదా కూర్చె సాహాయ్యముల్॥

సీ:-(రామునితో) ఆర్యపుత్రా! మఱల నీగగనాంగణమెల్ల కర్పూర
శకలగుచ్ఛగౌరవర్ణములతోఁ గనిపించు టెందువలననో!

వి:-(సీతతో) చంద్రలోకసామీప్యమునకు విమానము చేరినది. ఈ
భగవానుని దర్శింపనగు.

చ॥ తొలిమలిప్రక్కదిక్కుల గతుల్దిశలం దమరింపఁ బండువె
న్నెలపసఁ గారుచీఁకటుల నెట్టన బిట్టెగజిమ్మ, ముజ్జగం
బులకును జూడ్కి విత్తనపు మెల్క గ నేరిన పొద్దుపట్టుపై
వలచి జనంబు నిల్పుకొను బ్రాణము లాహరిణాంకుఁ డీతఁడే॥ 59
మఱియు.

చ॥ కఱగళు జూటమన్న నెలకట్టున భూషణకాంతిరేఖయా
దొర, తొవచుట్ట, మిర్ల దిగదోపిడి మేపరి, లేడికంటిమే
ల్గరితల ముత్తియంపుసితకాంతిసరాల నలంకరించుమం
తిరి, సురరాట్సుధారసవతీపరిణేత, కనంగనయ్యెడిన్॥ 60

ఇంతయే కాదు

శా॥ ప్రాణాయామపరుండు పద్మముఖులన్, బ్రాయంపుటున్మత్తుల
జ్ఞానాతార్పుకుగాఁడు, సర్వతరుణీసంఘాక్షిప్రాగన్నము
న్స్నానంబు న్దోఁగలం దడంచుమగఁ డమ్మారారాయుతాన్నత్యయు
జ్ఞాన స్వైర్వడుయజ్ఞ రాజితెపి శృంగారైకవాదాధ్యుఁడై॥ 61

ల:——(చూచి, కౌతుకమున)

చ॥ చెవిగ లైన శాలివరిచిర్మ్మలక ల్వెడఁదీసి యచ్చర
ల్కవకవనవ్వుల న్బిలిచి కాన్కఁగఁ జూపుచు డాచుచుండ, మే
యుపలయినాస మాటికిటునట్టుగురుల్కొని గ్రాసమబ్బమి
న్జివరకు కందు లేడి యెదిచేయునొ సల్పినచందుగ్రాసెనన్॥ 62

సు:——

మ॥ నెమరు ల్వేసెడియోష్ఠసంపుటముల న్నిశ్చింతఁ బన్నుండుచం
ద్రమునంకేణము మాసమాస యొకసిద్ధస్త్రీసమూహంబు మే
లమున న్దాళము వేయుచు న్బదఁరుఁగొల్ప న్జంద్రుమూచూడఁబో
వమిచే నెట్టులు చిక్కశల్యమయి పెన్వంత న్గుమారిల్లునో !॥ 63

మఱియు,

ఆ॥ నెలకు నెలకు సృష్టిసలుపఁగావలయుట
నీసుధాంశుకళలఁ దీసి యొకటి
మచ్చుతునకకైన వచ్చునన్మనమున
శిరమున న్ధరించెఁ బరమశివుఁడు॥ 64

రా: — (ఆదరమున నమస్కరించి)

శా॥ నీవే కావె సమస్త దేవతతికి న్నిత్యామృతశ్రాద్ధ, మీ
నీ వల్లేకదె యోషధు ల్పెనుచుచు న్నిల్పు న్జగజ్జీవితం.
బావిశ్వేశుఁడు నిన్నుఁ దాల్పనియెడ న్హాలాహలం బన్నిమ
న్బ్రివ న్నెక్కొనుకాలపాశమున నే న్మృత్యుంజయుం డౌనొకో !॥

(సీతతో)

సీ॥ ఎల్లరకనులకు న్గొల్లగా మధుపర్క
సన్మాన మిడుదివ్యసత్త్రి మితఁడు.
నిలువెల్ల నుప్పొంగుబలము మున్నీటి కా
వేశింపఁ జేసెడి వెజ్జితండు,

బహిరంతరరతి నుత్పాదించి శృంగార
జనకమై తగురసాయన మితండు,
క్రితుభో క్తలకు నజీర్ణము వాపుసుధ నీను
తతపాపశాల కధ్యక్షుఁ డితఁడు,
ముగుద! పాలేగుశు క్తి మేల్మ్రత్తె మాతఁ
డల్లదాక్షాయణీపతి, యంతేకాక
హాగుజటారత్న భూషణాంకురమె యీతఁ
డింక నింతటివాఁ డని యెన్ను టెట్లు ? 66

సీ:—(నవ్వుచు) నాథా! కులరూపయౌవనములలోఁగూడ సమానలగు నెల్లరసపత్నుల యొదల న్నాదమిడు మిన్నగ నీదక్షకన్య యగు రోహిణి నెన్నుకొనుటచేతనే యీవెన్నెలఱేడు రోహిణీప్రియుం డన్న సన్నుతిం గన్నవాఁడు !

రా:- -(నవ్వి) అగును జానకీ! నిజమే.

క|| పెనిమిటిసుఖ మిరువదియే
డ్వనితలకు న్సమమె యైన వాల్లభ్యగతి
న్ఘనసుభగభావ మెదియో
తనరవలయు రోహిణీనితంబినియెడలన్ || 67

వి:-(స్పర్శసుఖ మభినయించి)

మ|| కలువ ల్విప్పఁగఁజేసి యం దెగయునుక్కు జ్జంద్రికాపానవి
హ్వాల లౌవెన్నెలపిట్టమైరువల జాడ్యంబు ల్త్రిటిన్మాన్పుచు
జ్జలిరాల జ్జలమూర్చి తళ్కు మిగులంగా మూకదూత్యంబుతో
వెలయించు నకన్లాభిసారికల తృప్తి న్జూడుఁ డిందుప్రభల్ ॥ 68

మఱియు,

మ|| తనరాక న్భరివిచ్చి మేల్మితొగ లంతర్హార్లై యూడఁ జెం
తనె మంద్రంపుకలధ్వని న్భ్రమరి ఝుంకారంబుఁ బఱాహాతు
ల్ఘనగీతంబును దాళ పూనటులు మెల్లంగాఁ జకోరీహాస
ధ్వని రేఁగ న్తామవారిఁ దేర్చు, దఃగనేత్రిం బిందుఁ డీమెల్లరన్ ॥
ఇంతియేకాక,

క॥ సకల మెఱుంగునట్టియభిసా౽క యూనుమహాంజనంబు, తా
కికనయనాంధపట్ట మనఁ గ్రిక్కిఱిసెను స్ఫుటకాఱుచీఁకటి
స్ఫ్రికటము కానిభూమి సుకరంబుగ త్రాళిసముం బొనర్చుచా
లుకరము లెల్లచోటుల వెలుంగిడ లేదొర తోచు నల్లదే॥ 70

రా:-(హర్షముతో చిరునగవున) ప్రియవాది వగునో ప్రియా!

ఆ॥ చందమామ నరయుసంతసంబునకంటె
నమృతబిందుసమము లైననీదు
నుడులజడులె నన్నుఁ గడుబెడంగగు మేలి
సౌఖ్యసారవరవశతను దేల్చు!॥ 71

వి:-(అనురాగమున)

శా॥ భూమూలంబునఁ గల్గురాపిడి శిరోభూషామణు ల్తేట ది
వ్యామోఘద్యుతు లీని చీకఁటులఁ బాయంజేయ నాగావని
స్వామాఱు న్దలలూఁచి నీయశమె సేవించున్ శ్రవో లేశమే
న్లేమి న్గండలనాదవర్జితగతి న్శేషుండు సోత్కంఠుఁడై॥ 72

(నవ్వి)

గీ॥ భోగినులె గానగోష్ఠి నిన్బ్రాకడ రెండు
వేల్కనులశేషుఁడే విన, వింఁడు రెండె
వీన్లవగ హరికిన్నరవిపులగీతిఁ
నుడియు ; వేగనులున్నఁ జక్షుశ్శ్రవుండె ? ॥ (లేక)

మ॥ ఇరువేగన్నులశేషుఁ డాభుజగిను ల్వేడ్క ల్విసాళింప గో
ష్ఠిరతి న్దావకకీర్తిఁ బాడ విను; ఏనీ! ఇంద్రుఁడో కిన్నరీ
తరుణీగీతము లెల్లచోనిగుడ శ్రోత్రాలెంచె యన్నింత వే
సరు, నౌలే, విను నెట్లు ? వేయికనులేన్ జక్షుశ్రవా లానోకో?॥ 73

రా:-(విలక్షణమైన మందహాసమున విభీషణసుభాషితము నాదరించి
చంద్రబింబమును సీతముఖమునుం గని యొక్కక్షణముపలక్షించి)

మ॥ మును తారుణ్యవిలాసినీముఖసమంబున్ జంద్రబింబంబు సృ
ష్టిని బద్మాసనుఁ డూను నెంబడి నె వృంజీభూతశీతాంశుపు
ల్మ్నాన లై సాగి నిజాసనాబ్జమున కే మోసంబుఁ గల్పింపఁదా
ర్కోనునిక్కట్టున జంకి నల్వ తనపూన్కల్మానె నంచెం చెదన్ ॥

(సీతతో)

శా॥ ఓరమ్యాంగి! భవన్ముఖంబునకు నీడో కాదో యీచంద్రబిం
బారంభం బని తన్నిజం బెఱుఁగ నజ్ఞాసీనుఁడే తూకమం
దారోపించి తెలుంగుట ల్కాని సమత్వాపేక్షతో జాబిలి
జ్జేరన్నెంచిన మింటిసిబ్బి గుమ్మైతె చిట్టాడు నక్షత్రముల ॥ 75

మఱియు,

మ॥ సుతనూ! నీరజ మున్న పాళమున నే జోడౌనె నీమోముతో
సుతరా మట్లనరాదు, విచ్చుసుత కూర్చున్ దృష్టిఁ దేం లెప్పుడే
నతిథుల్గా నహామెల్లఁ సూర్యుఁ గొలుచు న్గామించు నేకాగ్రతన్,
సుతు సాక్షాద్భగవంతు బ్రహ్మఁగ నెఁగా చోద్యంబె యీడౌటకున్॥

సీ:-(చిఱునగవున దలవంచి) ఆర్యపుత్త్రా! నిండుబింబముతో నిట్లు చందమామ యుండఁగా నొక్కకళమాత్రమునే భగవానుఁడగు శంకరుం డౌఁదలం ధరియించు టేలనో?

రా:-ముల్లోకములకుఁగూడ నియ్యమృతకిరణుఁడే జీవనాధారముగదా! అట్టిచో నితని సంపూర్ణముగ నాపినాకధరుఁడే ధరించినచో శివనిర్మాల్యమై యనుభవింపరాకపోవఁడా? (ఎల్లరు నగియెదరు) అయినను, నీవుకూడ నెలనెల నితనిఁ గళామాత్రునిగఁ జూచుచునే యుందువుగదా!

సీ॥ భువనత్రయములజీవుల కాదిమాహార
సంధానకరణయజ్ఞం బితండు
వలపుబాధల లోకముల నేర్పఁ గామాన
లాలాతచక్రలేఖాలవంబు
దిక్కుల గడితల్పు లొక్కమ్మడి న్దియఁ
గుదురుకల్గిన మేటికుంచెకోల
తన వీరవరులలో ఘనుఁ డెవ్వఁడను లెక్కఁ
బూవిల్తుఁ డిడికొను మొదటిగుర్తు
గీ॥ హరిణనేత్రల నగుమోము సిరుల నెదిరి
పెరిఁగి పహాఁగొట్టు ప్రతిరాజబీజ మితఁడు

వరభరానందదానసంపద్యుతుండు
కదవె క్రొన్నెలబాలుఁ డక్కజపుశిశువు॥ 77

సీ:-(అనుమోదమున) సకలగుణసంపన్నులైనవారెందైనన్వయముగఁ
ప్రకాశించువారే. మఱియుల్పుల కధికారమొసఁగ నత్త్రికొడ్కుదు
రనుటకు శివునిశీర్షమున నుండు నీశీతకరశిశువే మొదటినిదర్శనము.

రా:- (నవ్వి) దేవీ! మహాక్షత్త్రియకులసంభవా! ఆమాట నిజమే
సుమా!

ఉ॥ నిండగువార్ధిఁ జూడఁగ జనింపమిజం, బొకగోష్పదంబుగా
దండితనాన దాఁటె మును దాహనుమంతుఁడు. సేతునిర్మితిన్
గొండలువేయ సిద్దివి కెగుర్కొన పట్టిననీరధి న్గన
న్గండె చలించె; మీఁదు టధికు న్నిరినాఁడటు లేమి శక్యమే ?॥ 78

అటుచూడుము!

చ॥ తొలిమల చల్వరాల్గజుల దోయము నింపుచుఁ బాద్యమీయ, భా
ర్యలయినతార లంజలుల నర్ఘ్యము లాజలుఁ గూర్ప, నిండి లో
దొలఁకు వెలుంగుమేల్మి మెయిఁ దుచ్ఛకళంకము చాటునొంద, ని
ర్గలకళమాత్రనే తొలఁగ. నంతట రాజెటుగుప్పనో ప్రభల్॥

ఆ॥ అవి మృగేంద్రు వాడియపుగోరులో యని
మిడికి ముడుఁగు వంకమృగము వలన
నిండు దొడుగుజ్యోత్స్న నెగడుచంద్రుఁ బలాశ
సుమవతంసవతులు చూచుచందు॥ 80

వి.-క॥ మకుటజట నిడఁగ శంకరు
డొకకళ మును పుణికిపుచ్చ నుడురాజు మెయిన్
వికటముగఁ బడినకంతలు
ప్రకటంబగుచున్నగాఁగఁ బరిణతినొందెన్॥ 81

(నవ్వి రామునితో)

గీ॥ ఆకసంబను బావి మండూకమైన
యీతఁ డననెంత! యితనివేల్పేని నెంత?
అదరిపాటున నీపెంపు టసము నెదిరి
యెట్లుగర్జించు న్నాఁడో యీ వెకనుమ!॥ 82

సీ:-(చిరునగవున) తెలిసె తెలిసె ఆర్యపుత్త్రుని కీర్తికాంతలతో పోటీ
గొని యోడినందుననే యింతని కీకందు. (ఎల్లరు నవ్వుదురు)
(రామునితో)

చ॥ భుజముల మంథరంబు హరి పూన్కి సుధాంబుధి వేయ బిట్టురేఁ
గుజడధిలోఁ దరంగములకు న్వెలసిల్లెడివన్నెతోడఁ నీ
రజుఁడ పరార్థకృత్తికళ రంజిలుగారతతోడఁ దుల్యమై
నజ రఘువీరకీర్తి గణనం బొనరింపనివారు నుందురే!॥ 83

(తెరలో) దేవా! త్వరపడుఁడు! త్వరపడుఁడు! భగవాను
లగువసిష్ఠమహర్షు లనుగ్రహించిన మంగళాభిషేకముహూర్తము
సమీపించుచున్నది

రా:-(ఆలకించి) మమ్మునుద్వరపెట్టుట కయోధ్యనుండి మరలివచ్చెనా
యేమి మారుతి?

సీ:-(సంతోషమున) ఆంజనేయుఁడేనా త్వరపెట్టుట? అయినచో భూమి
దాఁపుగఁ బోవవీలగునట్లు పుష్పకమును దిగనిండు (క్రిందఁజూచి
రామునితో) ఆర్యపుత్త్ర! మఱల నదియేమి! లేఁజీఁకటిరంగున
వెలయుధరాతలమున విష్ణువక్షమందలికౌస్తుభ స్తబకమువలె వెలింగి
పోవుచుఁ గనుపడుచున్నది?

రా:—(చూచి విభీషణునితో)

గీ॥ తఱిమెన (నవ్వ లెగిపించు తరణిబింబ
మనఁగఁ దనచుట్టుఁ గాంతుల నినుచుకొనుచు
నడుమ మృగతృష్ణికలవలె యెడములోలయు
విశ్వకర్మ కర్మాగారవిధి నదెదియొ?

వి:-అదియే రోహణపర్వతము.

చ॥ పరువడి జ్యేష్ఠమూల నగుపర్వపుజాతరల న్బిడారుటొం
టె రహించిమేయు ముండ్లపొద నిండినదారులఁ బిగ్గలెండగా
డ్పులుకునెడార్ల దూరమునుండియె చూడ్కి హరించు చంద్రివె
ల్గురలుచుఁ జల్వరాదొనల నుబ్బగఁ జేయు నురుంగుబుగ్గలన్ 85

(ఎల్లరు విమానము న్దిగుదురు).

రా:- (చూచి సీతతో) దేవి! ఆదక్షిణాదిశ నిప్పుడరయుము.

ఆ॥ కదలికలోనఁ బుట్టుకలువయో మోనాఁగ
సింహళంబు సొగసుఁజిందుచుండ
నెగడు కేసరముల నిండుతో మాణిక్య
పర్వతంబు కనులపండు విడెడి

సీ:— ఇందే గదా దర్భలవెన్నవలె నుండు నగస్త్యమునిహంస ముండునది,

రా:— అవును మైథిలీ! ఈ రోహణాద్రియే లోపాముద్రావల్లభుండగు నాకలశసంభవుని రెండవయాశ్రమము.

శా॥ పుట్టె న్గుండను! పొంకుటో కులపతివ్యుత్పత్తి! న్ధరాపాత్రమే
న్దొట్టన్నిండుసముద్రవారి నొకటెవో యింటనే త్రావె, మి
న్నట్టె వ్వింధ్యము నుబ్బుజబ్బగయ నేర్పు న్వోజ్జగా మాన్పి, నా
చుట్టుంబోకను దీర్చెనం, చినుఁడె కొల్పు న్వొల్చు నాశ్వోనతన్ 87

మఱియు,

ఉ॥ వాడుకచన్న రెక్కలనె, పల్మఱుఁ బై కెగురంగఁ బూని, తో
త్తోడనె కూలి, డాఁగువసతు ల్పవకూరమి నెండ్రికల్గుల
న్గోడున దూఱఁజేసెఁ బెనుకొండలఁ ద్రావిననీ ర్వెడల్చు లో
జాడ్రతుటి, న్మహోత్మ్రుతి సాహసమా! సరసోక్తి సాధ్యమే 88

మఱియు, శృంగారవిషయములకెల్ల సార్వభౌముఁ డగుమన్మథునకు రత్నఖచితసింహాసన మనఁదగు నాసింహళద్వీపరాజమునఁ బ్రదోషసమయ ప్రారంభములందు

చ॥ పొడిచెడిచంద్రు తేఁతకరము ల్పడినంతఁ జెమర్చు చల్వరా
నడవలు పాదలాక్షవలన న్బడుగుర్తులఁ దెల్పు మించువ్రే
ముడి నభిసారిక ప్రియులమోజున నేగెడిచోఁ జకోరము
ల్పడి నెగురంగ జంకి యిలుచాయల మల్లివజాడలయ్యెడన్ 89

(మఱియొక దిక్కునకుఁ జూపుచు) అదిగో! ముత్తియములపంట నొసఁగునీటి కాదరు వగుతామ్రపర్ణి మహానది.

ఉ॥ ముత్తెపుఁజిప్పగర్భములఁ బూసలుకట్టిన యేటిచిన్కుపిం
డొత్తుఁగ్రిమాన సుందరులయూరువుల, న్మఱి, పూర్వపుణ్యము

న్నత్తున మత్తకాశినుల చన్నులభోగమె ప్రాప్తియున్నవో!
యెత్తతి నిల్వఁజాల్కరకలే యగుఁజూ! ఘనమౌక్తికంబులై 90,91

సీ:—ఆర్యపుత్రా! భగవానుఁ డగుసాగరునకు భాగీరథిపై గలపక్షపా
తమంతయు నామె పెద్దది యనుహేతువుచేతనేసుమా! ఆ యన
నిండైన ప్రేమపరీవాహము సహజముగనే సర్వాంగమౌక్తికాభర
ణమై రమణీయరసపరమావధి యగు నీతామ్రపర్ణియందే కదా
మొగ్గుట!

రా:—(చూచి, నవ్వి వేలు చోఁజూపుచు)

గీ॥ అదిగో! మలయాద్రి! అందుండి యాత్మసఖుని
దేమ్మొర న్పంపి మన నెట్లు తేర్చుఁ గనుమ!
వలచుప్రియుపయి సఖి తెల్పు వట్టిచాడి
నులుకుమానినిఁ దేర్చుట సులభ మింక. 92

ల:- (ముందుఁ జూపుచు)

గీ॥ తనదుకుడియరచేతిలో మినుకువారి
జలముల నిక్కవడుతిమింగిలములందు
నుబుకుదయుఁ దాఁపు వెంటనే యుమిసె నెవ్వఁ
డయ్యగస్త్యున కిది ద్వితీయాశ్రమంబు! 93

మ ఱి యు,

ఆ॥ నాల్గుసంద్రములను గల్గుక్షారజలంబుఁ
దావ నెంతదప్పి కాఁచెనో కో!
నీమహాత్మ్య నంచు నెంచి యచ్చపుజెల
లాతఁ డుదయమంద నందఁ బోలుచు 94

సు:- (నగుచు)

ఆ॥ "ఔర! ఔర! త్రావె నాపోశనంబుగా
నేకువారిసిధుల నెల్ల నొకట
నీమునీంద్రుఁ డింక నేఁకరి మెసవఁడే"
యనుచు జగము లేదు వణకియుండు. 95

(అంతటం గలయుంజూచి, హర్షాద్భుతములతో) ఆహాహా! ఇన్ని
నాళ్లకిప్పుడుగదా పదునాలుగు భువలమునకు నేకదండధారుఁడై

యీరామభద్రదేవుఁడు ధర్మాసనము నధిష్ఠింప దండకారణ్యగృహ
స్థులగు తపోధనులకు సమృద్ధి !

రా:- (బిడియపుసగవున-విమానవేగ మభినయించి-చూచి) ఏమియిది ?
బంగరులేడి విహరించిన యటవీప్రదేశముల పయికే వచ్చితిమే!

సు:- (నవ్వులాటగా) ఇదియేకదా! మారీచుప్రాణమునే యుపహార
ముగా నొసఁగుటచేఁ దననుఁడా రక్షించుకొని దశకంఠుఁడు మాయ
జడదారివేషమున నొనర్చిన మోసము నెఱింగిన యేకైకసాక్షి !
పంచవటి ! (ఆదరమున)

మ॥ ఒకమార్కౌశికయాగవిఘ్నకరుఁడై యొుడొక్కచో భర్త్రమో
ముకళాకాంతులనుండి సీతకనుదమ్ముల్ద్రిప్పఁచిత్రాభకాం
గకుఁడై, యింతటిరాము వెంట ధనుసంటన్జేసె, నేదైత్యుఁ డిం
తకుఁజాలె, న్భళి! రెండుజోతలిడుదు న్మారీచ దేవారికిన్ 96

సీ:- (లజ్జించును),

రా:-(ప్రస్రవణగిరిం జూపుచు సీతతో నేకాంతముగ)

చ॥ మును పొకరేయి నిందుమణిముక్తసుదీప్తికిఁ గాకిమూఁక స
ల్పినరొద కుల్కి ఘూకతతి పెన్గుహఁ జేఁరటి మేయఁబోవె! నీ
స్తనవటమే స్దమి న్దివియ దబ్బున నాకులఁ గోయనీవుపూ
నిన వనదేవత ల్పయికె నెట్టరె కొమ్మల! జ్ఞప్తినున్నదే?॥ 97

సీ:-(చిఱునగవునఁ గపోతహస్తముం గూర్చుకుని) భగవానులరగు
నోవనదేవతలారా! ఇదిగో మీపరిచారిక యగుసీజానకి నమస్క
రించుచున్నది

రా: (ఇంకొకవైపునకుఁజూపి దేవీ! మహనీయ యగుగోదావరీనది
యదిగో! నమస్కరింపుము! (జనాంతికముగా)

శా॥ ఓనాప్రేయసి! దీనిలో యిసుకవై పౌర క్రౌంచయుంగ్వాళిలో
గా నొనాపాదరింట, మోదుగలమొగ్గల్దండగాఁగూర్చి గో
ష్ఠాని న్నైనవనినీయురోజములపైగా నుంచి నేనవ్వఁ, ము
గ్ధాసిస్తామ్యతి గొప్పతప్ప నెడికిన్కన్గూడ హాసింపవే!॥ 98

సీ:-(లజ్జతోఁ గూడినచిఱునగవున మోమువంచి) గోదావరికి నమస్క
రించును.

రా:-(చుట్టును ముఖముఁద్రిప్పి చూచి వగతో) దేవీ!

చ॥ ఉఱియమినైన నుండెను మొగుల్దివి, వర్షము. లేనిలోటు దె
ప్పర మగునస్మదశ్రువులు వాపఁగ మాల్యవదద్రిఁ గాలువ
ల్వాఱలె, నదేమిచిత్రము భవత్పరిపాలితపాదపాళి న
న్నరసియుఁ బల్లవింప, వహహా! నెమిళుల్మఱిపాడ వయ్యెడన్॥

సీ:-(ముసరుకొనువగపున గద్గదమగు నెలుఁగున బుష్పకము నుద్దేశించి)
విమానరాజమా! నేనేసీతను. హృదయమొకవజ్రమేసుమా!
తపింపనూతపింపదు. పగులనుపగులదు. అయినను దయచేసి యీ
దండకారణ్యపంక్తిని ద్వరగ దాఁటఁజూడుము!

రా:—(విమానవేగ మగుపడ సీతతో) ఈముందు దోఁచునదియే.
మహారాష్ట్రదేశమున కేకైకభూషణ మనఁదగుకుండిననగరము.

చ॥ మలయభవం బొరుల్కనివిమంగళవైభవసంయుతంబు నీ
చలువలగాలి యీనగరిజాణల మన్మథనక్రకేళి ను
జ్జ్వల మగుస్వేదవారిఁ గొని భర్తల మేల్పరిరంభగోష్ఠి మై
పులకల నిమ్మడి న్ననుచుఁబో సరసప్రచురప్రచారియై॥ 100

మఱియు,

గీ॥ సౌరభోద్గారికైశికీసరసవృత్తి
వలచి వలపించు నీపల్కుబడులరీతి
నెటులొ పసిబట్టి దూరాన నెసఁగునట్టి
శ్లేష్మకవులైన నెప్పు డుపాసించుచుంద్రు॥ 101

వి:-(దక్షిణదిశ జ్ఞాపుచు) ఆంధ్రదేశలక్ష్మీకంఠలగ్నగోదావరీహారా
లంకారమున నాయకమణి యగుమహిమాఢ్యభీమేశ్వరుం దర్శించి
నమస్కరింపుఁడు!

ఉ॥ ఎవ్వని చిందులాట నుసి యెంతయు హెచ్చుచునుండ జంకి దా
దవ్వుగ గౌరి వీడిచన దక్షిణపాద మొకంట వెంట రి
వ్రివ్వున భైరవాకృతిఁ జరించుచుఁ బుఱ్ఱెలదండ పాములు
న నమ్మెయి న్బొదువఁ జేసినయంతిమయజ్వ రాజిలున్॥ 102

రా:-(నమస్కరించుచు)

శా॥ నృత్తారంభరసానకే తొలఁగ గౌరీదేవి, యైన న్నదు
ద్వృత్తి న్మేనున లోటు కన్పడుట లేదే లేద! పైపెచ్చు స్వా
యత్తంబై పెనుచింద నీవుడిపిన న్వ్యాళాళి నిన్నమ్మరా
చిత్తభ్రాంతి దిశాదులందు తిరుగ. న్జైమోత్తు నీ కోశివా!॥ 103

మఱియు,

మ॥ అసలే కాలగళుండ, వందుపయిఁ గాలాంధంబు నీకంఠము
న్నెసఁగ్రమ్మ, న్మఱి నీవొ సర్వాలయబుద్ధి న్మాలఁ జిందాడె, దీ
పసల న్జూచెడి కాళరాత్రియొ, శిరోభాగంబు దేహంబు వీ
డిసనెన్నాఁ గనిపింపఁ దల్లడిలె, ఖండీభూతధైర్యస్థితిన్ ॥ 104

(ఎల్లరు నమస్కరింత్రు)

రా:-(మఱొకవైపునకుఁజూపుచు) ద్రవిడమండలమునకుఁ దలమానిక
మైనకాంచీపుర మదిగో! మీనకేతనుని యునికిపట్టు! (ఏకాంతమున
సీతతో)

చ॥ పొడమిన చెమ్మట న్బిగువు పోయినదంపతులందుఁ గౌగిళు
ల్సడలుచునుండ మేనఁ బెలుచ న్బులక ల్పొరిరేఁపి నిక్కుదం
దడి నితరేతరాంగముల దార్కొనఁ దొత్తటికంబె నెంతొయె
క్కుడు తమిహోయి, వారలకుఁ గూర్చుచునుండుఁ బయోరుహాననా॥

మఱియు,

క॥ మొగమలము చెమటచిత్తడి
నొగి మకరీపత్త్రరాజి యూడిపడ శ్రమన్
జిగి సనినకపోలము లిం
పుగఁ జాటు న్దరుణి మేలిపురుషాయితముల్ 106

సు:-(వేఱుదిక్కుఁ జూపుచు) ఇల్లిదే! అవంతీదేశసీమంతమౌక్తిక
మగు నుజ్జయినీరాజధాని! శృంగారదేవత కిదియే గర్భగృహము.

క॥ తెల్లనివెన్నెల, రేల
నెల్లనిచీర న్ధరించి తెల్లనిమేన
న్బల్లగ నభిసారిక దివి
వల్లభుఁజేరుటలు బయటఁబఱచు న్నీడల్ 107

మఱియు,

ఉ॥ మేడలమీఁదిజవ్వనులు మిక్కిలినిక్కెడిముక్కు లొప్పఁ గ్రీ
జాడలలోఁ జకోరములు చంద్రిక లానినజోటఁ జీఁకటు
ల్వోడఁగఁజేసి తా మొగురు వెన్నెలసిగ్దలరీతి వెల్గఁ బె
న్వేడుకఁ బిట్టగోడలనె వీఁగుచుఁ జూచుచునుండ్రు వింతగన్ 108

మఱియు,

ఆ॥ ఇచట నంతిపురుల నెగురుచకోరంబు
లచటి యువిదగముల యాస్యసుధల
నిండుకడుపు లెంతొ నిమురుకొంచుశయించి
యాని యాన వైందవాభ నరుచి 107

వి:-అలకాపట్టణమునకు శాఖయోయన నొప్పునివ్వారముననే త్రిపుర
ముల దహించునిమిత్తము మహాకాళనాథదేవుఁడువిడిసినది.

చ॥ సుడిభ్రమియించు వేగమున జూటము సళ్ళుచు విస్తరింప నే
ర్పడు సురగాంగధార లోకపంజరమై తనచుట్టునొప్ప, ని
గ్గడఁ బ్రిచలద్భుజపరిచయకాండము రెక్కలుగాఁగ నంచచొ
ప్పిడులయనాటికానటుఁడహీనసుఖాన జగంబు నోముతన్ 110

రా:-(అంజలింబట్టి)

చ॥ ప్రళయమున న్ద్రిలోకములఁ బ్రౌఢత స్వాహయొనర్చి క్రిమ్మఱ
న్మొలుచునో యంచుఁగాము నటు మూడవకంట దహించు నీవదం
బులను సురాసురు ల్మకుటభూరిమణిప్రభ ముంచి క్రొల్వఁ బె
న్జలువలచూడ్కి వారలను సాఁకిననీ కివె మన్నమస్కృతుల్ ॥111

మఱియు

గీ॥ అయ్యొ! ముక్కంటిదేవ! నీకాగ్రహంబు
తోఁచ వేగ నొనల్కంట దుమికె నగ్ని
యెదుట సమ్మోహనాస్త్రసమేతు మారుఁ
గని చిరము స్వాహనెంచుచు నైనదె జడత? ॥ 112

(అందఱు నమస్కరింతురు)

సీ:-(నవ్వి) పాపము! పదునాలుగుభువనములను బాధించినంగూడ
భగవానుఁడగు చంద్రశేఖరుని కాళ్ళి తీటలేదు కాఁబోలు, అనం
గునింగూడ నవనీతప్రముద్ధవలె మింగినాఁడు (అందఱు నగుదురు)

రా:-(విమర్శించి)

చ॥ శర మగు శౌరి మోయుతమి సంభ్రమునై ఖగరాజు డాసి చి
చ్చ్ఛల కనుమంట మిణ్గురులసోఁకున గాసిలి పాఱిపోవఁగా
నురగగణంబు వంగి సరినొందదనంతఁ, బ్రయోగమొందె శం
కరుశ్రీమమై జయంబుఁగొనెఁగా! అలనాఁడతఁ డుల్కన న్సఖీ॥

(ఇంకొక వైపునకుఁజూపుచు కలచురీకులప్రభూతలగురాజేంద్రు)
లెల్లరకు పెద్దరాణి యైన చేదిదేశమునకుఁ భూషణములదండయై
యొప్పెడి మాహిష్మతీనగర మల్లదిగో!

ఉ॥ కౌఁగిలి ముద్దు కూటమియె కక్ష పణంబులుగాఁగ నొడ్డు నీ
నాగరికాల్మొగిళ్ళకు ననంగుఁడె దాఁర్వుడు కాఁడు. తుల్యమే
భోగము, గెల్వ నోడ నను బుద్ధివి దట్టఁగ నీని పెన్నమి
న్దోఁగు మనుంద్రు జూదములఁ దోఁగుదు రవ్వల మోదవారిధిన్॥

(విమానవేగమును నిరూపించి)

శా॥ కస్తూరీపరభూష భూసతికి స్వర్గంగాతరంగైక యా
నే స్తంపున్ జెలికత్తెయీయాయమున నుండీ! తీరజీవాళుల
న్గస్తిన్బట్టి యము ండు సోదరుడు లాఁగ న్జేరి తప్పించి ప్రే
మాస్తోకాఢ్యతఁ దండ్రి చండరవి డాయన్బంపు మోక్షాప్తికిన్॥ 115

ల:-(దవ్వునందలిది వ్రేలితోఁ జూపుచు)

ఆ॥ త్రిపురహరునిమౌళిఁ గ్రీడించి యమృతాంశు
బాలమైత్రి నొంది ప్రజలఁ దనిపి
సగరచితుల దొలఁచి జలధి కిల్లాలయ్యె
గంగ, యిదిగో! మనయఘుంబు లడఁచు॥ 116

రా:- (సంతోషమున)

ఆ॥ నగము చండికొసఁగ సాంబుని జడముడి
సంకుచింప, వసతి సామె యగుట
ద్విగుణమైన మేల్గభీరత నిముడు భా
గీరథీ! మదంబ! కేలుమోడ్తు!॥ 117

(సీతతో) దేవీ! నమస్కరింపుము!

శా॥ తానాబ్రహ్మగృహంబులోఁ గదలి సంక్రందంబొందుట ల్నిక్కమే
యైన, న్నొంటిఁ ద్యజించి యూర్ధ్వగతి కర్త్రాత్వం బిట న్బొందు జీ
వానీకంబుల వాలుతీవ్రతకు హెచ్చొమేల్వడి న్బ్రహ్మలో
కాన న్జేర్ప, శివావతంసమణి గంగాదేవి, విన్నాణనూ !॥ 118

సీ:-(అంజలింబట్టి) ప్రవాహమునుగొలుసున ముల్లోకముల ననుబం
ధించుతల్లీ ! మందాకినీ ! ఇవే నావందనముల నందుకొనుము !

ల:-(అన్యతిఁ జూపి)

చ॥ ధనపతిమీఁద నొప్రిణయతత్పర భావఫలంబు వెండికొం
డను విడనీమిచేత నచట న్దన కుండెడియింటివాఁకిటి
న్మనుచునెగాని, శూలి, పెనుసుక్కవ నుల్లముపల్లవింప నా
కనుపడు వారణాశి కటకంబుగఁ జేకొని నిల్చు నిచ్చలున్ ॥ 119

రా:-(ఆనందమున నవలోకించుచు)

క॥ తీరం బెటఁ దోఁపనిసం
సారాంభోరాశి దిగ్భ్రమల నీదుజను
త్తేటి తరియింప శ్రాంత్యా
గారం బగులంక యిదియె కాదె కుమారా ! 120

అదియునుంగాక, భగవానుఁ డగుభుజంగభూషణుఁ డిందే గదా
స్థిరవసతి నిల్చియుండుట

చ॥ మెడనలుపందుఁ బాపదూరమే న్గలియ న్ఫణరత్నపాళియే
తొడవని గౌరి బాహుపురితోఁ బెనవేసినకంఠసీమతో
నొడ లెడమాట హీనగతి నొందుస్వరంబుల సామగానము
న్వడలుచు బమ్మపున్కనగ వెల్గుశివుం డిడు లోకభద్రముల్ ॥ 121

(వేలోకచోఁ జూపుచు, సీతతో)

ఉ॥ కొత్తగ మార్వెలాఁగుకళ గొగ్గుఱుకాయల నాకరాగ్ర మో
బిత్తతి! ప్రేమ నిగ్గుదయపెంపున నీకయితోడి గట్టిగా
నొత్తుట నందు ధన్యగతినొందెదె, భవత్కులవృద్ధు లేలు నా
పత్తన మల్లదే ! నయనపాళిని జుబ్బనచూఱ గైకొనెన్ ॥ 122

సీత:-(ఎలనగవున దృష్టిమరల్చి యనురాగమున రాముఁ జూచుచు నగరముంగూర్చి) అమ్మా! మిథిలా! నావందనమ్ముల నందుకొని మాపెద్దలందఱకుంగూడ నాయభివాదనముల విన్నవింపుము!

రా:—(సుగ్రీవవిభీషణులతో) మిత్రులార! జానకిం గనినభూదేవి కీ పట్టణమే పుట్టినిల్లు. మిథిల పేరిటినగరము

సు వి:—(కౌతుకముతో) ఓహో! ఇచట నేకదా! భగవానుఁడగు పార్వతీప్రాణేశునకు ధను స్సైన యజగవమను శిష్యుఁడైన భృగు పతియు భంగపాటు నొందినది మఱియు నిం దేకదా! అట్టిసీబాల్య క్రీడలలో నీతో నాటచెలి యైనదీవీరలక్ష్మి!

రా:—(లజ్జ నగు నలఁతినగవున నొండెడం జూపుచు) ప్రేయసీ! ఇఁక నదే మనయెదుట గౌడులరాజధాని యగు చంపానగరము. మన్మ థుని బ్రహ్మచర్యవ్రతమున కైనవనములవలె వినయమధుర శృం గారవిభ్రమములచే రమణీయమై వెలుంగుచున్నది. (సీతతో నేకాం తమున) ఈయూరనే కలదొకవింత!

శా॥ మే నుబ్బించు గను ర్లకౌగిళులమేల్మి న్స్వల్ప శేషంబు గ
న్నే నెగ్గించినమీఁద నెమ్మొఁ బ్రమిద న్దీపంబు లోఁబాటుచేఁ
గ్రీనీడ ల్తమకౌనుబంటి మఱియు న్గేరింత నేణాక్షు ల
త్యానందంబుల వెల్లడింతు రనుభూతంబు ల్రిహశ్చాతురుల్ 123

ల:-(ముందుఁ జూపుచు) ఆహా! ఆవిచిత్రము నరయుఁడు! ధరామ రుల చిరంతననివాస మగు నియ్యంత ర్వేదికిం దూరపుసీమ నవిగో! గంగాయమునలు! శ్రీగంధము నొకరును కృష్ణాగరు నొకరును మైపూతలుగ నూఁతపఱచుకొని యన్యోన్యము నలఁదుకొనునట్టు లెట్టులున్నవో!

గీ॥ గట్టివడగండ్ల హిమగిరికాపురమునఁ
గరము పాలెనాయేమొ గంగాభవాని!
తండ్రి వేసఁగిరవి యంకతలమువసతి
నల్లఁబడెనేమొ యీయమునాస్రవంతి! 124

వి:-(యోజించి)

ఆ॥ బలి నడంచువిష్ణు వదనఖంబుల కాంతి
స్మరనిహంతృ జూటచంద్రు జ్యోత్స్న
హిమనగంపు నిడుదయేరుల పెనుపునఁ
బ్రతిపదమున వృద్ధిఁ బడసె గంగ 125

మఱియు,

క॥ అలఁతియె ప్రయాగ ? భూమి
జ్జ్వలిగిన క్షేత్రముల నెల్లఁ గడుగొప్పదినూ!
తిలకింతురు భవవార్ధి క
వలితీరము జనము లిచట వసియించుట నే॥ 126

-(ఆదరమున) వాకొనశక్యమా !

ఆ॥ అట్టి దివిజగంగ యూవైపు ప్రవహింపఁ
బాఱు యమున యివలిప్రక్క నవుర !
ముక్తి కీప్రయాగమున తీఁయబడినట్టి
ద్వార మనుట కడుయథార్థవాక్కు॥ 127

(సీతతో) వైదేహీ ! నమస్కరింపుము !

గీ॥ మఘవరో ! శ్యామ మనెడియామఱ్ఱిచెట్టు
సలుపు సద్వ్రత మెన్నంగఁ దలఁపవశమె ?॥
దానినీడ వసించు నేరైనగాఁని
చూడఁగల్గుదు రాపరంజ్యోతినైన॥ 128

(గాలిరథమువడిం గనబఱచుచు సంతసమున)

గీ॥ గాట్లపై బారులై చిగుర్గట్టుయూప
ములె మదన్వయయజ్ఞసంఖ్యలను బలుక
భానుకులజుల పట్టంపురాణి ధరణి
కొనరుపట్టం బిదే సరయూస్రవంతి ?॥ 129

ఇదిగో ! భగవతియగునయోధ్య !

క॥ ఉన్నాళస్థలపద్మము
లన్నటు లదె శిఖములెత్తి యతిఋతుకమునన్
నన్నుం గన విప్పారిన
కన్నుంగవ నాకసంబు గాలింతు ప్రజల్ ॥ 130

సు॥ వి.-(పట్టణమును పరకాయించి చూచి)

మ॥ ఒకనూఱధ్వరము ల్రచించి శతమన్యుండంట యేగొప్ప? వే
యిక పైపూచిగ యూపము ల్గొడిమలక్లే తెల్పుటన్నేదె త
త్సుకృతనీతఫలానుభూతి, మధురస్సుత్యం బయోధ్యా నదీ
యకళనాయకసిద్ధిఁ గన్గొనఁగ నన్యం బింమనే యేరికిన్॥ 131

రా:-(సుగ్రీవవిభీషణులతో) సచివులారా!

సీ॥ అట్టిరాజులు మాయన్వయంబునందు
మునుపు ప్రభవించుటెల్ల నిందుకనకు గురున
కలవసిష్ఠర్షి యిడినహవ్యములలోని
విభవమాహాత్మ్యమేసుమీ! వింత యేల ?॥ 132

(ముందుఁజూచి హర్షముతో) ఎట్లూ! ఈమహామహుఁ డవ్వ
సిష్ఠమహర్షి యే! మాయభిషేకమునకు వలయునుపకరణముల
సిద్ధముఁజేసికొని భరతశత్రుఘ్నులతో మనరాక నిరీక్షించు
చున్నాఁడు, పుష్పకముతో) ఓవిమానరాజమా! కాకుత్సరాజ
న్యుల ముఖ్యవిహారమంటపముదరికిం దిగుము. (ఎల్లరు విమానముం
దిగియెదరు) భరతశత్రుఘ్నులతో వసిష్ఠమహర్షి ప్రవేశము.)

వ:-(భరతశత్రుఘ్నులతో) బాలకులారా!

సు॥ ఘనలంకాపతిబాహుకాననపరిష్కార్త్రైకదోశ్శక్తిభా
జనుఁడై యీబుడుతండు లోకముల నిర్జాడ్యంబుల జేయుట
న్నన మేవింతయు; మానిభార్గవుఁడె తాక న్దత్తపోవీర్యము
ల్వెనుకన్బాల్యమునందె పీల్చి కడుపిప్పిన్జేసి సాధింపఁడే!॥ 133

(రామునిజూచి హర్షముతో)

మ॥ తనదోర్విక్రమకాండ రావణశిరోద్యానంబు భల్లప్రభం
జనయోగంబునఁ గూల్చుగొప్పపనితో సంపూర్తికాఁగా వరిం
చిన దిగ్జేతృసుమంగళీశుభయశశ్శీర్షియు క్తుఁడై క్రమ్మఱ
న్మనపున్నెంబులకల్మిఁ గంటఁబడెడి న్మారామభద్రుండ దే!॥ 134

రా:-(సంభ్రమమున సమీపించి సాగిలి నమస్కరించి)

క॥ బ్రహ్మాకే యాత్మజుఁ డగుచున్
బ్రహ్మర్షిత్వమున నలపురాణపురుషుఁన్

బ్రహ్మ న్దెలిపెడి రఘుపుల
బ్రహ్మకర్మగురున కివిగొ (రాముని ప్రణతుల్ ॥ 135

వ:— (రామునిఁగౌగిలించుకొని) వత్సా! రామభద్రా! నీయట్టివాని నేమని యాశీర్వదింపఁగలనయ్యా!

చ॥ అరితతి కందు వెండియును మంతయు గుంజి జగంబుమూసకు
న్దరలిచి యంతరాయరహితంబుగ హెచ్చెడిస్వపవిత్రాపని
స్ఫురశిఖచూఁది మేల్పుటపుశోధనతో గుణవర్ణ శుభ్రిత
స్థరఁ గళఁ జిమ్ముపిండముగాఁ దార్చితిగా స్వకమైనకీరితిన్ 136

ఇంతియ కాక,

గీ॥ లోకములమూఁటి నొకయింతలోన దాఁటు
వడి కలుగునీదుకీర్తి పవిత్రహ మొలయఁ
బ్రథమభూపయశోనదు ల్రొప్పిఁ శుద్ధి
వెలయు, సింధువు గంగాంబువులనుబోలి॥ 137

అయినప్పటికి నాయాశీస్సున నిట్లగుంగాక!

క॥ రవిశశులపోల్కి జగదు
త్సవసంధానైకదృష్టిధౌరేయుల బా
హువులట్లు వంశరక్షణ
కవుసుతుల న్గనుపుపండఁ గను మిర్వురుగన్ ॥ 138

సీ:-(వసిష్ఠునకు నమస్కరించును.)

వ:-ఓజనకవంశసుమంగలీ! బిడ్డా! మీకిరువురకుం గలసివచ్చునటుల రామభద్రు దీవింపనేదీవించితిని.

సీ:-(సంబరమునఁదనలో] అమ్మయ్య! ఇఁక నీరామభద్రున కీడులేని యిల్లాలు నాదును లే!

వల:—సగరవంశగురువు లగుమైత్రావరుణుల కివే సౌమిత్రి సాష్టాంగ నమస్కారములు!

వ:-బాలకా! లక్ష్మణా! నీవన్ని యాశీస్సుల కతీతపవిర్తనుఁడ వైతి వోయి

గీ॥ ఇంద్రజిత్తంతవీరు నొక్కింత నణఁచి
వర్థిలఁజేసితివి యీపపంచమెల్ల

నట్టి నీవల్లయిందు ప్రియంతవాని
కైన నభయమ్మొ నిడ దిట్టవై తికాదె॥ 139

ఆ॥ అయిన మీారునలువు రన్నదమ్ములుఁగూడ
నిరువు రేసిసుతుల వడయుఁడయ్య ?
వార లాదిరాజవంశాగమున కష్ట
శాఖలగుచు వృద్ధి సలుపఁగలరు ?॥ 140

రా:-(సంతోషమున మఱల నమస్కరించి) భగవానుఁడా! మా యిక్ష్వాకుల మతితరముగ ననుగ్రహింఁబడినది.

భ:- (రామునితో) దేవా! శూన్య మైనయీారాజభవనపు టంతిమ ద్వారమున ద్వారపాలకుఁ డగుపదాతి భరతుఁడు నమస్కరించుచున్న వాఁడు.

రా:-(మోదమునఁ గౌఁగిలించుకొని) అన్నా! భరతన్నా!

ఉ॥ అయ్యయొ! ఎంతపాలె భవదంగము! వెన్నెలకంబమయ్యెనె
మయ్యా? కవుంగిలిం గొఁగదయ్యా నను న్మదముబ్బునట్ట! లో
యయ్యా! కడుంగడుంజపల యాకమలాలయ కౌస్తుభంబుపై
నెయ్యపుసోదరప్రియత నే కద వీడదు విష్ణువక్షమున్ !॥ 141

భ:-(సీతకు నమస్కరించును.)

సీ:—అయ్యా! భరతకుమారా! తరణికిరణముల నెలమిఁగొను కమలముల గుంపువలె మీాయన్నగారి చెంతఁ జిరకాలస్థాయిగ సుఖము ననుభవించుచుండుము!

ల:-(భరతున కెఱగును.)

భ:—సోదరా!

గీ॥ లక్ష్మణకుమార! నన్ను వినక్షణంపుఁ
గుతుకమున గాఢపరింభగతిఁ బొందువుము!
చందనముకంటె ఘనసారచర్చకంటె
హాయిగదె కూర్చుసోదరు నంగసక్తి॥ 142

(గట్టిగాఁ గౌఁగిలించుకొని) అబ్బ? ఎంతకాలమునకు రఘుకుల తటాకమునకు యూపదండ మగులక్ష్మణు గాఢాలింగమున నా దేహము చల్లనం బొరసినది!

ఆ॥ పంక్తిగాఁగఁ జేర్చి పట్టిన గ్రైంథవ
కళల గుంపుతోడ నలువ సర్వ
దుఃఖములను దున్ని టినె ద్రోయవా మేల్మితో
సలిపియుండు సోదరులకరాలు!॥ 143

శ:—(రామునితో) ఆర్య! పాదసేవకునిసేవకుఁ డిదే నమస్కరించు చున్నాఁడు!

రా:-(కౌఁగిలించుకొని) ఆహా! మఱలమాలక్ష్మణు పరిరంభణమే నాకమరు చున్నది. (ఏకాంతముగ సీతతో)

ఉ॥ నిండగు చంద్రబింబమును నిల్వఁగఁదీయుచు గేలిచేయున
ట్లుండెడియీముఖంబు గను మోసఖి! లక్ష్మణుమోమె! దేవవే
దండముతోండము న్గరివత న్గఠకర్కశత న్వహించి న
న్దండిఁగవుంగిలించు భుజదండము లేనియుఁ దద్విధంబులే!॥ 144

శ:-(సీతకు నమస్కరించును)

సీ:-అన్నిలోకములయొక్క శోకశంకువులఁ దొలగించు గొప్పగొప్ప చరిత్రల కాస్పదమ్మైె లక్ష్మణతుల్యుఁడవు కమ్మా! వత్సా! మన పెద్ద లెటనున్నవారో?

శ:-మంగళోపచారములు సిద్ధపఱచుకొని మధ్యమాంబయగు సుమిత్రా దేవిమందిరమున మనందఱకై వేచియున్నారు. (సమీపించి లక్ష్మణున కెఱగును.)

ల:-(సంతసమునఁ గౌఁగిలించుకొని) అదృష్టవంతుడనై దీర్ఘాయుష్మంతుఁడ వగుని విందుండుటచేతనే మేము భరతన్నగారి నిటవదలి యేగుట!

రా:-(వసిష్ఠునితో) వీరేలంకాకిష్కింధాపతులు! విభీషణసుగ్రీవులు! భగవానులగుతమకు నమస్కరించుచున్నారు.

వ:-వీరు చాలకాలమువఱకురవికులపౌలస్త్యవంశముల కీర్తిమాలికలకుఁ దోరణ స్తంభములభాతి నిలిచియుందురుగాక!

రా:-భరతా! శత్రుఘ్నా! మహోమహు లగునీపౌలస్త్యసావిత్రులకు నమస్కరింపుఁడు,

భ-శ-ను-వి.-(అన్యోన్యయథోచితసత్కారులగుదురు)

వ:-(ఆనందముతో) అదృష్టఫలవిశేషముచేతనేకదా! పదునాలుగేండ్లు చనినమీఁద నేఁటి కిచటఁ గ్రమ్మఱ నిట్లు కలిసికొనిన దశరథకుటుంబమును మేము చూడఁగలుగుట. (సవిమర్శముగ)

మ॥ గెలిచె న్రావణు హైహయుం, డతఁడు బ్రుంగెన్ భార్గవుం డెద్దనీ
రల నీరాముఁడె కాకపక్షధరుఁ డౌ ప్రాయాననే నొంచె, నీ
వలిచారిత్రము బాలగాథ కసదా వాసిం నిజంబెన్న, లో
కుల కశ్లైన ముదంబు శ్రేయము నె చేకూర్చు న్దదుద్గీతముల॥ 145

(రామునితో) వత్సా! రామభద్రా! మాంగలికముహూర్తము దాఁటిపోనున్నది!

గీ॥ రమ్మి! రఘుసింహాసింహాసనమ్ము నెక్కఁ
గమ్ము! తులలేనిపస నలంకారిమందు,
గునియుచుండెడియుత్తరకోసలముల
సలుపు రాజన్వతులుగాఁగ సలుపు లుడిపి॥ 146

రా:-(సింహాసనము నధిష్ఠించును.)

వ:-(మంత్రపూతము లగునుదకము లచే నభిషేకించును.)

ఇతరులు: (బహువివిధాభిషేకముల నొనర్చి సర్వాంగాలింగితప్రణామముల నిడుదురు)

(తెరలో) మంగళవాద్యములు సంగీతములుం జెలంగును.)

వ:-(ఆనందమున) వత్స! రామభద్ర!

ఉ॥ జీవులఁ బెన్విభీషికలఁ జేయుపరాత్మునిలీల నష్టది
గ్దేవుల నల్పినాఁడవుగదే నెఱబొమ్మల, నట్టినీవె రా
జై విలసిల్లి యభ్యుదయమైతగు ధర్మము నోమఁగాఁ బరీ
భావమదృష్టదృష్టములఁ బర్వనొకో ప్రజ కీధరాస్థలిన్॥ 147

రా:-(బిడియపడును)

వి:-(అంజలింబట్టిమోకరించి) దేవా!

గీ॥ లంకయును బుష్పకంబును లాగుకొనినయొ
రావణుఁడు తొల్లి యలకాధిరాజునుండి

యిచ్చితిరి నాకొకం డానతిందు దీని
కలకు బేరుని వడిఁ జేరునట్లుగాఁగ ॥

రా:-(వసిష్ఠు ననుమతిపైఁ బుష్పకముతో) ఓవిమానరాజమా! పౌల స్త్యులలో మొదటివాఁడును నీకు మొదటియధిపతియు నగువాని సేవింపబొమ్ము! (పుష్పకముమాయమగును.)

వ.—(ఆనందమున) రామభద్రా! నీకింకేప్రియమును జేయఁగలను.

రా:-మహాత్మా! ఇంతకంటె మించినప్రియ మేమికలదు!

చ॥ జనకుని యాన వాళిముని చాయగ్రహించి, మహావరాహదం
ష్ట్రిని హసియించువింధ్య శబరప్రముదాదులఁ గాంచి, పావనై
కనుపడ దక్షిణాపరపుకంఠులసందునఁ గట్టఁగట్టి యెం
దును బ్రశయంబుదాఁక విడఁదోలిఁతి రావణబాధమీావయన్॥ 149

అయిననిట్లగుఁగాత!

చ॥ కడు వికసించు సూక్తిసుమకాండము లీనుసుధామరందము
న్గడిఁ జెవిదొప్పల న్గపు లజస్రము జుఱ్ఱుచునుండుగాత, మె
న్నడయిన శబ్దవాసనల నాననివారు గభీరసత్కవి
న్బొడమినదాన దోషగుణబుద్ధికి సిద్ధులు కాకపోవుతన్ ॥ 150

మఱియు,

మ॥ దివి మందాకిని, భూమి గంగ, యహిధాత్రి న్భోగవత్యంశ నీ
భువనంబు ల్విధికుండికాజలముల న్బ్రాతంబు లెందాఁక, వీ
రవరప్రౌఢయశస్సుధారససువర్షంబు ల్కవివ్యాహృతు
ల్బైవి నందాకఁను గ్రహ్యసద్గుణగణశ్రీల న్థిరం బయ్యెడిన్॥ 151

వ:-తథాస్తు!

రా:-(లక్ష్మణునితో) రమ్ము రమ్ము తల్లుల న్దర్శించుకొనుటకు.
(ఎల్లరు నిష్క్రమము.)

సర్వమ్ శివమ్.

ఉ॥ భట్టమురారిప్రౌఢసురవాక్కృతి వీరగభీరభావసం
ఘట్టితమై బుధేంద్రబహుకాంక్షితమైనయనర్ఘరాఘవం
బిట్టుల తెల్గుఁగైత వెలయించితి మేదురశయ్యఁ బొంచునే
రట్టటొదాఁటుచున్, విజయరాముఁడ, సాదరబుద్ధిఁ జూడుఁడీ!॥

సర్వము సమాప్తము

# శ్రీ శివానందలహరి - మచ్చుపద్యములు

మ॥ వనిగాఁ, గొండగఁ, బక్షిగాఁ, బురువుగా, వ్యాళంబుగా, దోమగా
జనుఁడున్గాఁ బసరంబుగాఁ సుకుఁడుగా జన్మింప జన్మింపనీ!
అనయంబున్, భవదీయపాదనలినధ్యానప్రమోదోరువా
హిని నాచిత్తము తేలియాడఁగల దానేన్ బొందిమా కేటికిన్॥

చ॥ నినుఁ గని, నీదుదివ్యపదనీరజయుగ్మముఁ జేతులారఁ గై
కొని, తలఁబూని, కన్నుగవకు న్గమునద్ది, యురాన హత్తుకొం
చును బిగిఁ గౌఁగిలించుకొనుచున్ విధిముఖ్యుల కందరాని వి
చ్చునలినగంధ మాని మఁసుమ్మద మే నెపు డొందఁగాంతునో!॥

ఉ॥ కోరుఁగదయ్య కోక మినుఁ! గోరుఁ జకోరము చంద్రుఁ గోరవే
నీరదుఁ జాతకంబు నలినీవనము న్గలహంస! మట్టులే
కోరుఁ జిదధ్వమృగ్యము నకుంఠితమోక్షసుఖప్రదంబుఁ, జె
ల్వారుభవత్పదాబ్జయుగళావృతి నామన మెప్డు! శంకరా!

చ॥ యమునెద నీడ్చితన్నుట, మహాద్రిఁ జరించుట, నమ్రదేవశీ
ర్షమకుటఘర్షణంబును, భరంపు టపస్మృతి మర్దనంబు, ని
త్యము వ్రతమయ్యె నీమృదుపదద్వయి! కోర్తు వదెట్లు! నాదుచి
త్తమణిమయోరుపాదుకలఁ దాల్పఁగ నీకొనవయ్య! శంకరా!॥

ఉ॥ “ఆయెద వీఁడు పుట్టుఁగదరా! అటఁ గావఁగ నేనె నిల్వనా
రా!” యని కోమలాంఘ్రులకు రాయిడిఁ గొండల మున్నె నేర్పితే
నో యనిపించుఁ గానియెడ నుండవె దివ్యగృహాలు, వేదిక
ల్మాయనిపూలపాన్పులు? నుమావర! నీగిరిదాఁటు లేటికో?॥

శా॥ లోకా లన్నిటి కీవెచుట్టమట! నీలో సచ్చిదానందసా
ద్రేకాంభోధి యెసంగునంట! దయ నీదేసొమ్మ! లేదీ! గుణ
శ్రీ కల్యాణి సుబుద్ధికన్య, నిదిగో! సేవింప నర్పింతుఁ, ద
త్సౌకర్యం బిడ నెప్డు నాహృదయసద్మం బొందుఁ, మాగారితోన్॥

# తప్పు - ఒప్పుల - పట్టిక

| పేజి | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 6 | 19 | బ్రమ | బ్రధమ |
| 8 | 11 | త్వత్తం | తత్త్వం |
| 10 | 12 | కూచ | కూచి |
| 21 | 24 | తము | తరము |
| 24 | 20 | విచారింపన్ | సమర్థింపవ్ |
| 1 | 11 | భవు | భువు. |
| 2 | 18 | క్యావము | కావ్యము |
| 5 | 11 | వసిష్ఠున | వశిష్ఠుని |
| 7 | 8 | విన | నవ |
| 10 | 20 | దేశేశం | దేవేశం |
| 18 | 8 | నుంవ్య | సింవ్య |
| 22 | 11 | నిభ్చ | నిబ్చ |
| 24 | 26 | సంతే | సంగతే |
| 26 | 7 | శక్తు | శుక్తు |
| 29 | 7 | సలాంత | స్థలాంత |
| 34 | 19 | నేర్మ్న | నేర్పున |
| 40 | 1 | మేల్దిపు | మేల్దిప్తు |
| 44 | 15 | కం॥ | సీ॥ |
| 48 | 5 | సీ॥ | గీ॥ |
| 51 | 19 | | జ॥ విచారముల్. |
| 56 | 5 | యొపు | యెప్డు |
| | 10 | రమ | దమ |
| | 26 | యెవ్వనికొ | యెవ్వనికో |
| 57 | 23 | విడనైతి | విడవైతి |
| 64 | 22 | గబులొ్కన | గుబులొ్కన |
| 68 | 3 | వివఁగు | విసుఁగు |
| 70 | 17 | మృష్ణ | మృష్ట |
| 71 | 26 | స్భర్ధన్ | స్పర్ధన్ |
| 87 | 17 | సుచీ | సుతీ |
| 75 | 14 | కసులచే | కష్టంచే |

| పుం | | బా॥ | జా॥ |
|---|---|---|---|
| 94 | 13 | అన | అమ |
| 100 | 10 | నద్గు | నగు |
| | 20 | దేరిన | జీవన |
| 103 | 21 | సంక్రనందనా | సంక్రందననందనా । |
| 107 | 20 | న్నెర | న్నిర |
| 110 | 7 | చెప | చెంప |
| | 13 | ద్దెలనల | గ్గెలనల |
| 111 | 13 | ఏమిన | ఏమన |
| 124 | 12 | రాప్రం | రాత్రిం |
| 126 | 12 | చదంబులై | చందంబులై |
| 128 | 4 | తల | తలల |
| 135 | 4 | దీపు | దీప్తు |
| | 19 | ద్దిమ్ము | ద్దిము |
| 160 | 4 | సుకృత | సుకృతా |
| | 5 | కళన | కళానా |
| 162 | 23 | వినక్ష | విలక్ష |
| 164 | 2 | కర్మ | విరత |
| | 8 | పిండమగా | పిండముగ |

షరా:—చులకనగు నచ్చుతప్పులు చదువరులే దిద్దఁబ్రార్థితులు.